అపరాధ పరిశోధన అనుబంధం—141

# మూడు నవలలు

(... కోసం "అపరాధ పరిశోధన" అందచేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఈ తప్పు క్షమించలేను!

రచన : వసుంధర

## శిథిల గుహలు

రచన: ఎమ్. డి. చైతన్య

## యోగాశ్రమం

రచన : సుంకరి రాంప్రసాద్

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 141
సెప్టెంబరు, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1

# ఈ తప్పు క్షమించలేను!

వసుంధర

అలారం గణగణ మ్రోగింది.

నాకు మెలకువ వచ్చింది. మంచంమీద నుంచి లేవ బోయాను.

కానీ రాధ నన్ను కరిచిపెట్టుకుని పడుకుని ఉంది. అలారం చప్పుడు వినగానే ఆమె నా చుట్టూ తన బంధాన్ని మరింత బిగించింది.

నేను మృదువుగా ఆమె చేతుల్ని విడిపించుకో బోయాను.

"అప్పుడే లేవద్దు—...." ముద్దుగా, గారంగా అంది రాధ. ఆమె కనులు మాత్రం యింకా మూతబడే ఉన్నాయి.

"టైము యేడున్నరయింది—తెలుసా?" అన్నాను.

"రాత్రి మీరు వచ్చేసరికి పన్నెండున్నర దాటింది—గుర్తుందా?" అంది రాధ. ఇంకా ఆమె కళ్ళు తెరవ లేదు.

నేను తడబడి—"అయితే?" అన్నాను.

"మీ రాలస్యంగా యెందుకొచ్చేరూ అనడగడం లేదు నేను. కనీసం ఎనిమిదిగంటలసేపయినా కలిసి మంచం మీద పడుకుందామంటున్నాను...." అంది రాధ.

"అయితే?"

"రాత్రి మనం పడుకునేసరికి ఒంటిగంటయింది. తొమ్మిదిదాకా మనం నిద్ర లేవక్కర్లేదు—...."

"అయితే నువ్వు పడుకో...."

"మీరు వెళ్ళిపోతే నాకు నిద్రపట్టదు...." ముద్దుగానే అంది రాధ.

"నీకేమో ఒకటే నిద్ర. నాకేమో నిద్రపట్టదు...." నేనింకా యేదో అనబోతుండగా—"మీకు మాత్రం నిద్రెందుకు పట్టను? మీరూ నాతోపాటే కదా నిద్ర పోయింది...." అని యెదురు ప్రశ్న వేసింది రాధ.

"నాకు నిద్ర తక్కువ—" అన్నాను.

చటుక్కున లేచి కూర్చుంది రాధ. ఆమె కళ్ళలో మత్తు పూర్తిగా విడిపోయింది—"నాకూ నిద్ర తక్కువే! మీరు ఆఫీసులో నిద్రపోతారు, సినిమా హాల్లో నిద్ర పోతారు. నేను మీరు పక్కనున్నప్పుడు మాత్రమే నిద్రపోతాను."

"నేను ఆఫీసులో నిద్ర పోతానని నీ కెవరు చెప్పారు?"

"మా నాన్న!"

కోపాన్ని పళ్ళ బిగువున అపుకున్నాను. రాధ తండ్రి రామమోహనరావు ఆస్తిలో, అంతస్తులో నా కంటే ఎన్నో రెట్లు గొప్పవాడు. ఇప్పుడు నాకున్న ఆస్తి,

అంతస్థు కూడా ఆయనవల్లే వచ్చాయి. నే నుంటున్న యిల్లు ఆయనది. నేను చేస్తున్న ఉద్యోగం ఆయ నిప్పించినది. ఆయనకు నామీద అట్టే సదభిప్రాయం లేదు.

రాధ నన్ను ప్రేమించింది. రాధ ప్రేమ నాయన ఆమోదించాడు. మాకు పెళ్ళి జరిగింది.

ఆయనకు రాధ ఒక్కతే కూతురుకాదు. రాధకు ముందు ఇద్దరు. రాధ తర్వాత ఒకరు వున్నారు. ఆయన పెద్దల్లుళ్ళిద్దరూ అన్నివిధాలా ఆయనకు దగిన వాళ్ళు. నేనూ వాళ్ళకులా వుండాలని, ఆ ఎత్తుకు ఎదగాలని ఆయన అభిలాష. అయితే నాకు నేను చేస్తున్న ఉద్యోగమే ఎంతో తృప్తిగా వుంది. నాకు పెద్దగా కోరికలేమీ లేవు. చేతిలో డబ్బుంది. చక్కటి ఇల్లుంది. ఇంతకంటే ఎందుకూ అనిపిస్తుంది.

"ఇదే సంతృప్తి అన్ని రంగాల్లోనూ వుంటే నిన్ను చేసుకున్నందుకు రాధంత అదృష్టవంతురా లుండదు—" అంటాడు రామమోహనరావు. కానీ నేనంటే ఆయనకేదో అసంతృప్తి వుంది. అది చూచాయగా నేనూ అర్థం చేసుకోగలను.

ఆయన నా గురించి రాధ దగ్గర వేళాకోళంగా మాట్లాడుతూంటాడని ఇప్పుడర్థమయింది నాకు. నేను రాధవంక చూశాను. ఆమె పళ్ళ బిగువున నవ్వుకుంటోంది.

"నువ్వు మీ నాన్న మాటలు నమ్మావా?" అన్నాను.

"నిజం చెబితే నమ్మనా?" రాధ తమాషాగా నవ్వింది. ఆ నవ్వులో అమాయకత్వం వుంది. అది నిజంగా అమాయకత్వం కాదు. అందం ఆమెకిచ్చిన వరం ఆ అమాయకత్వం. అందుకే ఆ అమాయకత్వం నన్ను కవ్విస్తుంది.

నేనామె చుబుకంపై ముద్దుపెట్టుకొని—"నా గురించి

నీకీ ఆరాలన్నీ ఎందుకు?" అన్నాను.

"ఇందులో ఆరా ఏముంది? నాన్న చెబితే విన్నాను. మీరు ఆఫీసులో నిద్రపోతున్నారంటే నాకు సంతోషం కూడా కలిగింది—" అంది రాధ.

"ఎందుకు?"

"ఇంట్లో మీరెప్పుడూ పట్టుమని ఆరేడు గంటలు కూడా నిద్రపోరు. మీకు నిద్ర చాలదని నా భయం. నిద్ర తక్కువైతే బ్లడ్ ప్రెషర్ పెరుగుతుందిట. ఆరోగ్యం చెడిపోతుందిట...." అంది రాధ. మళ్ళీ అదే అమాయకత్వం ఆమె ముఖంలో.

నన్ను నేను నిగ్రహించుకొని—"ఆఫీసులో నేనేం చేస్తూంటానూ అని ఆరాతీస్తున్నావన్నమాట. అది నాకు సంతోషంగా లేదు—" అన్నాను.

"అందులో నేను తీసిన ఆరా ఏమీలేదు. ఆరా అంటే రాత్రి మీరు పన్నెండున్నరకొచ్చారూ—అప్పుడు ఎందుకొచ్చారూ అని నిలదీయడం!" అంది రాధ.

నేను తడబడి-"నిలదీయలేకపోయావా?" అన్నాను.

"అలాంటివి నా కసహ్యం. నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. ఆలస్యంగా వచ్చినప్పుడు కారణం చెప్పడం మీ బాధ్యత. చెప్పలేదంటే అది నేను తెలుసుకోతగ్గ ముఖ్య విశేషం కాదన్నమాట...." అంది రాధ.

నేనుండబట్టలేక-"ఒకవేళ అది నీకు ముఖ్య విశేషమే అయి—నీనుంచి రహస్యంగా వుంచుతున్నాననుకో—అప్పుడు!" అన్నాను.

"మీరు నా నుంచి రహస్యం దాచినా, అబద్ధం చెప్పినా అందులో నా తప్పూ కొంత వుంటుంది...." అంది రాధ—"మీకు నా గురించి పూర్తిగా అర్థం కాలే

దన్నమాట. అర్థమైతే నా నుంచి రహస్యం దాచరు. నాకు అబద్ధం చెప్పరు...."

"ఎందుకని?"

"నాకు పరిస్థితులపట్ల పూర్తి అవగాహన వుంది. మా నాన్న మాలో విశాల భావాలు నూరిపోశాడు. తప్పుచేస్తే సానుభూతితో అర్థంచేసుకోగలను. తప్పుచేసిన మనిషి పశ్చాత్తాపపడితే క్షమించగలను. ఎందుకంటే తప్పు చేయడం మానవ సహజం. ఏదో బలహీనతలో ప్రతి మనిషికీ తప్పుచేయాల్సిన సందర్భం ఏర్పడుతుంది. బలహీనతను జయించినవాడు మహాత్ముడు. జయించలేనివాడు సామాన్యుడు...."

"ఇంతకీ యిదంతా నువ్వెందుకు చెబుతున్నావు?"

"ఉదాహరణకు మీ జీవితంలో నాతో వివాహానికి ముందు మరో స్త్రీ వున్నదనుకోండి. ఇప్పుడు మీ మనసులో ఆ స్త్రీకి స్థానం లేకపోతే—నేను మిమ్మల్ని మీ గతానికి తప్పుపట్టను. ఇప్పుడైనా పొరపాటున ఓ స్త్రీతో తప్పుచేశారనుకోండి. సవివరంగా నాకు తెలియబరిస్తే— మిమ్మల్నర్థం చేసుకుందుకు ప్రయత్నిస్తాను తప్పితే— సాధించను. అలాంటి నా దగ్గర రహస్యాలు దాచి అబద్ధాలు చెప్పే భర్తను దురదృష్టవంతుడని అనాలి .."

"నామీద నీకేదో అనుమానం కలిగింది. నిజం చెప్పించడానికే యిలా మాట్లాడుతున్నావనుకుంటాను-" అన్నాను.

రాధ నాకు దగ్గరగా జరిగి — "నేను మిమ్మల్ని ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. నా ప్రేమ నన్ను మోసం చేయదని నాకు తెలుసు. నేను మిమ్మల్ని పూర్తిగా నమ్ముతున్నాను. మీరూ నన్ను నమ్మండి—" అంది.

ఆమె నన్ను ప్రేమిస్తున్నదని నాకూ తెలుసు. అందుకే ఆమెను నమ్మి నిజం చెప్పడం కష్టం!

## 2

"ఇప్పుడు టైము పది దాటింది, తెలుసా?" అంది రోజా.

"అన్న టైముకు రావాలనే అనుకున్నాను. కానీ రాధ వదలాలిక దా—" అన్నాను.

"మర్చిపోయాను. నీకు పెళ్ళయిందికదూ!" అని నిట్టూర్చింది రోజా — "నువ్వే ఆమెను వదిలి రాలేకపోయావేమోనని నా అనుమానం—"

ఆమె అనుమానానికి నేను నవ్వి ఊరుకున్నాను. మగాడికి భార్య అందుబాటులోని వస్తువు. పరాయి ఆడదానికోసం తపించినట్లు మగాడు భార్యకోసం తపించడు. ఆ విషయం రోజాకూ తెలుసు. కానీ ఇప్పుడామె అలా ఎందుకన్నదంటే— నేను తనను రాధతో పోల్చి ఎక్కువ చేయాలి.... అది ప్రస్తుతం నా కిష్టంలేదు. మా యిద్దరి మధ్యా రాధ ప్రసక్తి రావడం నాకిష్టం లేదు.

రాధ అందమైనది. నన్ను ప్రేమించింది. మీదు మిక్కిలి ఆమె మనసు మంచిది. పనిగట్టుకుని ఆమెను చిన్నబుచ్చడ మెందుకు?

అలాగని రోజాను నిరుత్సాహపర్చలేను.

కాలేజీ రోజుల్లో రోజా, నేను ప్రేమించుకున్నాం. అరమరికలు లేకుండా కలిసి తిరిగాం. అవి నాకు మధురానుభూతులు.

రోజా చాలా తెలివైనది. మేము విచ్చలవిడిగా నే తిరిగినప్పటికీ మా పరిచయం గురించి ఎందరికో తెలియదు.

ఆమెకు నేనుకాక యింకా మగ స్నేహితులున్నారని నా అనుమానం. కానీ ఎక్కడా రోజా నాకు దొరకలేదు.

కాలేజీ చదువు పూర్తికాకుండా నే రోజాకు పెళ్ళయి పోయింది. అప్పుడుకూడా ఆమె నాతో—"నీకూ నాకూ పెళ్ళి కుదరదు. నీకంటే వయసులో, ఆస్తిలో, అంతస్థులో పెద్దవాణ్ని మాత్రమే నేను పెళ్ళిచేసుకుంటాను. కానీ నిన్ను నేను మరిచిపోలేను. నీకోసం మళ్ళీ ఎప్పుడైనా వస్తాను. మళ్ళీ ఈ రోజులప్పుడు గుర్తు తేవాలి—" అంది.

ఆమె ఇప్పుడు నాకోసం వచ్చింది. భర్త ఫారిన్ వెళ్ళాడు. పిల్లలు బోర్డింగ్ స్కూల్లో వున్నారు. తను నాకోసం ఈ ఊరొచ్చింది. ఎంతో తెగించి ఈ ఊరొచ్చింది. ఆమెది కూడా ప్రేమే కదా! ఆమెను మాత్రం నే నెలా నిరుత్సాహపర్చగలను?

"అప్పటికీ యిప్పటికీ నీలో యే మార్పూలేదు—" అన్నాను. రాధ ప్రసక్తి తీసుకురావడం యిష్టంలేక నేనామాట అనలేదు. నేనన్నమాటలో నిజముంది.

రోజా గర్వంగా — "ఈ ప్రపంచంలో అన్నింటికీ మించి నేను నా శరీరాన్ని ప్రేమిస్తున్నాను. దీనికోసం నేనేమైనా త్యాగం చేయగలను. ఈ శరీరాన్నిలా వుంచడంకోసం రోజూ నేను వ్యాయామం చేస్తున్నాను. తిండి బాగా తగ్గించడమేకాక ఇష్టమైన పదార్థాలెన్నో తినడం మానేశాను—" అంది.

"పోనీలే — నామీద ఇష్టాన్నుంచుకున్నావు...." అన్నాను.

"నీమీద ఇష్టమెలా పోతుంది? యూ ఆర్ మై ఫస్ట్ లవ్!" అందామె.

నేనామెను దగ్గరగా తీసుకున్నాను. రోజా నా కౌగిలిలో ఒదిగిపోతూ—"నీ స్పర్శలో ఏదో ప్రత్యేకత వుంది. నా శరీరమంతా నరనరాలా విద్యుత్తు ప్రవహించి నట్లుంది." అంది.

అదే అనుభూతి నాకూ కలిగింది. అది మాలోని ప్రత్యేకత కాదు. తప్పు చేయడంలోని థ్రిల్!

రాధకు డబ్బుంది. నామీద ప్రేముంది. అన్నింటికీ మించి నాపైన నమ్మకముంది. నేనామె నమ్మకాన్ని వమ్ము చేస్తున్నాను.

ఇదామెకు తెలిస్తే ఏమవుతుంది?

ఎలాంటి తప్పునైనా తనకు చెబితే క్షమించగల నందామె. నేనామెకు చెప్పడంలేదు. ఎందుకంటే నాకామెపై నమ్మకం లేదు.

"మళ్ళీ పాతరోజులు గుర్తొస్తున్నాయి—" అంది రోజా. ఆమె కళ్ళలో మెరుపు. ఆమెకవి మధురాను భూతులు.

నాకు రవంత గర్వం కలిగింది. నాలో ఏదో ప్రత్యేకత వుంది. నా తొలి ప్రియురాలు రోజా ఇప్పటికీ నన్ను గుర్తుంచుకుని నాకోసం వచ్చింది. నా భార్య రాధ నన్ను మనసారా ప్రేమించి నమ్ముతోంది ఇంకా....

రోజా చేతులు నన్ను చుట్టేశాయి. నా ఆలోచన ల్లోంచి అన్నీ తప్పుకొని రోజా మాత్రమే ఆక్రమించు కుంటున్న దశలో గదిలో ఫోన్ మ్రోగింది.

ఫోన్ నేనే అందుకొని—"హలో!" అన్నాను.

"నమస్తే సర్! గదిలో రమణ్ కుమార్ అనేవా రున్నారా?"

"నేనే రమణ్ కుమార్ ని!" అన్నాను.

"మీకోసం ఎవరో వచ్చారు. పంపేదా?"

తెల్లబోయాను. నాకోసం ఎవరొస్తారిక్కడికి? ఎవరికీ తెలియకుండా రహస్యంగా నేనిక్కడికొచ్చాను.

"ఎవరు?"

"ఒక యువతి. పేరు రాధ!"

ఉలిక్కిపడ్డాను. అంటే రాధ నన్నునుసరించి వచ్చిందా? అలా అనుసరించి రావడానికి కారణమేమిటి? ఆమె నన్నుమానించిందా?

నిన్న రాత్రి నేను ఆలస్యంగా రావడం గురించి ఆమె ఆరాతీయకపోయినా ప్రత్యేకంగా మాట్లాడింది. ఆమెకు అసలు విషయం తెలిసిపోయిందా?

మౌత్ పీస్ మూసి—"రాధ వచ్చింది—నాకోసం" అన్నాను రోజాతో.

రోజా పెద్దగా ఆశ్చర్యపడ్డట్టు కనబడలేదు—"చాలా రాంగ్ టైములో వచ్చింది—" అంది నిట్టూర్చి.

"ఇప్పుడు నేనేం చేయాలి?"

"ఏదో అనుమానంమీదే ఆమె యిక్కడకొచ్చింది. రూంలోకి రమ్మనమంటే నే మంచిది...." అంది రోజా.

"వస్తే....?" అన్నాననుమానంగా.

"భయపడకు. గురుబక్ష్‌సింగ్ వుండనే వున్నాడు.." అని నవ్వింధామె.

నేను వెంటనే — "ఆమెను పైకి పంపండి—" అన్నాను.

## 3

రాధ, నేను ఇంట్లో సోఫాల్లో ఒకరికొకరు ఎదురుగా కూర్చున్నాం.

నేను భయం భయంగా వున్నప్పటికీ పైకి మేకపోతు

గాంభీర్యాన్ని నటిస్తున్నాను. ఆమె ఇప్పుడేమంటుందో?

"చాలా సారీ అండీ!" అంది రాధ.

"ఎందుకు?"

"అర్జంటుగా నాన్న పిల్చుకుని రమ్మన్నాడని మీకు చెప్పాను. అది నిజంకాదు—" అంది రాధ.

"మరేమిటి నిజం?" అన్నాను అసహనంగా.

"మీ నడవడిక బాగుండడంలేదనీ, చెడుతిరుగుళ్ళు తిరుగుతున్నారనీ—ముఖ్యంగా మీకు స్త్రీ అంటే బలహీనత వున్నదనీ నాన్నకు అనుమానం వచ్చింది...."

నేను తెల్లబోయాను. రాధ అంత సూటిగా విషయం మాట్లాడుతుందనుకోలేదు నేను.

"అనుమానం మీ నాన్నకేనా—నీక్కూడానా?"

"ఊరికే మాటవరసకి అనుమానం అన్నాను కానీ—నాన్నకు మీ గురించి తెలిసింది—అని చెప్పాలి...." అంది రాధ.

నా ప్రశ్నకందులోనే బదులుంది. అనుమానం రాధకూ వుందన్నమాట!

"అంటే నువ్వూ నన్ననుమానిస్తున్నావన్నమాట!" అన్నాను.

"మా నాన్న సంగతి మీకు తెలియదు. ఆయనకీ ఊరి నిండా అనుచరులున్నారు. ఎలాంటివాడి గురించైనా ఆయన క్షణాలమీద సమాచారం రాబట్టగలడు...."

"అంటే?"

"ఆయన మీ గురించి ఏదైనా అన్నాడంటే అందుకు తగ్గ సాక్ష్యాలున్నాయన్న మాటే కదా!"

నేను వెంటనే ఏమీ చెప్పకుండా కాసేపాగి—"ఇంతకీ నువ్వనేదేమిటి?" అన్నాను. అసహనాన్ని

ప్రకటిద్దామనుకున్నాను కానీ భయమే నా గొంతులో ధ్వనించింది.

"నే నెప్పుడూ ఒకటే అంటాను. నేను మిమ్మల్ని నమ్ముతాను. కానీ మీరుకూడా నన్ను నమ్మాలి...." అంది రాధ.

ఆమె వివరించి చెబుతూంటే నే నే ఆశ్చర్యంగా విన్నాను.

స్త్రీ అంటే బలహీనత వుండడం మగాడికి సహజం. అవతలి స్త్రీకి అన్యాయం జరుగనంతకాలం, ఆరోగ్యానికి భంగం లేనంతకాలం ఆ తప్పుకు భర్తను క్షమించే సహృదయత రాధకుంది. భర్త మరో స్త్రీని వివాహమాడేందుకామె వ్యతిరేకి. కానీ భర్త మరో స్త్రీతో అనుభవాన్ని పంచుకుంటే ఆమె తప్పుపట్టదు.

"నన్ను నమ్మమంటావా?" అన్నాను.

"మోసం నాకు నచ్చదు. అత్యాచారం నాకు కిట్టదు. నన్ను నిర్లక్ష్యంచేస్తే నేను బాధపడతాను. ఈ మూడూ లేనప్పుడు మీరు చేసింది తప్పయినా నేను పట్టించుకోను. కానీ మీరు నానుంచి రహస్యందాస్తే నేను బాధపడతాను...." అంది రాధ.

"నేనిప్పుడు రహస్యం దాస్తున్నానని నీ కనుమానం వచ్చిందా?"

"మీ రెప్పుడెప్పుడెక్కడెక్కడికి వెడుతున్నదీ నాన్నకు తెలుస్తూనే వుంటుంది. అది నాన్నద్వారా తెలుసుకోవడం నా కిష్టముండదు. నాన్న చెప్పడానికి ముందే మీ విషయం నేను నాన్నకు చెప్పగలగాలి. అందుకని మీ కార్యక్రమం ముందే నాకు చెబుతూండండి...."

"అందువల్ల ప్రయోజనం?"

"ఇందాకా — ఉడ్‌లాండ్స్ హోటల్లోలా మరోసారి మిమ్మల్ని డిస్టర్బ్ చేయాల్సిన అవసరముండదు ...." అంది రాధ.

రాధ చాలా తెలివైనది. ఆమె నన్ను క్రమంగా తన గుప్పిట్లో యిరికించుకోవాలని చూస్తోంది. ఎక్కడా నా మనసుకు నొప్పి తగలకుండా నన్ను నిందిస్తోంది. తను క్షమిస్తానని హామీ యిస్తూ నా తప్పు తెలుసుకుందుకు ప్రయత్నిస్తోంది.

ఇదంతా పెద్ద ట్రాప్ అని నాకు తెలుసు.

"రాధా! బిజినెస్ వ్యవహారాలన్నీ అందరికీ చెప్పలేను. నువ్వు నన్ను నమ్ముతున్నందుకు చాలా థాంక్స్! నా ప్రవర్తన నీ నమ్మకాన్ని వమ్ము చేసే విధంగా వుండదని హామీ యిస్తున్నాను—" అన్నాను.

అప్పుడు రాధ మనోహరంగా నవ్వింది — "నేనేం చెప్పినా మీ మంచికోసమే చెప్పాను. అటుపైన మీ ఇష్టం. మీ యిష్టం మీకు హానిచేయవచ్చు. అదొక్కటే ఆలోచించుకోండి...."

ఆమె మాటలు నవ్వంత మనోహరంగా లేవు. మాటల్లో హెచ్చరిక వుంది.

నేను మళ్ళీ ఉడ్‌లాండ్స్ హోటలుకే బయల్దేరాను. రాధ మంచిది కావచ్చు. కానీ ఆమెకోసం రోజాను వదులుకోగలిగిన మంచితనం నాకు లేదు.

## 4

సాయంత్రం నాలుగు గంటలకు నాకు ఫోన్ వచ్చింది.

"రాత్రి ఏడు గంటలకు — దొడ్డి గుమ్మాన — రా —" ముక్తసరిగా చెప్పింది రామావతారం.

ఫోన్‌లో మాట్లాడినా ఆమె గొంతు చాలా సెక్సీగా

వుంటుంది. ఒక అమ్మాయికి రామావతారం అన్న పేరే చిత్రమనుకుంటే ఆమె గొంతులో పెద్ద ధ్వనించడం మరింత విచిత్రం.

ఈ మాట చెబితే రామావతారానికి నచ్చదు. ఆమె పవిత్రతకు ప్రాధాన్యతనిస్తుంది. పురుషులకు దూరంగా వుండడానికి ప్రయత్నిస్తుంది. అటువంటి యువతి నన్ను ప్రేమించడమొక పెద్ద విశేషం.

నిజానికి నే నామె గొంతు విని ఆకర్షితుడినయ్యాను. ఆమెతో పరిచయానికి ప్రయత్నించాను. స్వల్పకాలం లోనే ఆమె నాతో ప్రేమలో పడింది. రోజా నాతో తిరిగేటప్పుడు వుపయోగించిన తెలివితేటలన్నీ ఉపయోగించాను. అందువల్ల మా పరిచయం గురించి మా యిద్దరికీ తప్ప ఎవరికీ తెలియదు.

రామావతారం క్రమంగా నన్ను పెళ్ళి గురించి నొక్కించసాగింది. అదెంతవరకూ దారితీసిందంటే చివరి కామెను వదుల్చుకోవడం నాకు తప్పనిసరి అనిపించింది. అప్పుడామెకు నా గురించి నిజం చెప్పేశాను.

అప్పుడు రామావతారం నన్ను తిట్టని తిట్టులేదు.

నేను నవ్వి—"నేను మోసగాడినే. ఒప్పుకుంటాను. కానీ నీ గొంతులో పెద్ద ధ్వనిస్తుంది. ఆ ధ్వని నన్ను పెడదారి తొక్కించింది. నన్ను మన్నించగలిగితే మన్నించు—" అని చెప్పాను.

రామావతారం అప్పుడు తలిదండ్రులు చూసిన సంబంధానికి ఒప్పుకొని పెళ్ళిచేసుకుంది. ఆమె భర్త నాకంటే అందంగా వుంటాడు. ఏదో చిన్న ఉద్యోగం చేసుకుంటున్నాడు. అతడిని చూస్తూంటే నాకు చాలా అసూయగానే వుండేది. అతడి లాలనలో రామావతారం నన్ను

పూర్తిగా మర్చిపోయింది.

వివాహమైనా రోజా నన్ను మర్చిపోలేదు. రామావతారం కూడా రోజాలాగే నన్ను మరిచిపోకుండా నా కోసం పరితపించాలి.

ఒకసారి ఆమెతో ఈ విషయం చెప్పాను.

"నా భర్త పురుషోత్తముడు. నీ పరిచయం నా దుర దృష్టం. ఓ పీడ కల. ఇప్పుడు నువ్వది గుర్తుచేయకు—" అంది రామావతారం.

ఆమె అలా మాట్లాడుతూంటే—గొంతులో పెద్ద ధ్వనిస్తోంది నాకు. ఆమెను దగ్గరగా తీసుకొని—"ఇంకా తిట్టు—" అనాలనిపించింది నాకు.

రామావతారం తిడుతూంటే నాకు కోపంరాదు. మామూలుగాకంటే — ఆవేశంలోనే ఆమె గొంతు ఎక్కువ బాగుంటుంది. నన్ను రెచ్చగొడుతుంది.

"నీ భర్త ఎంతటి పురుషోత్తముడో చూస్తాను. మన పూర్వ పరిచయం గురించి అతడికి చెబుతాను...." అన్నాను.

రామావతారం భయపడుతూనే-"ఆయన నీ మాటలు నమ్మరు...." అంది.

ఎంతటి పురుషోత్తముడికైనా భార్యననుమానించక తప్పదీ కర్మభూమిలో. అప్పటికే ఆమె భయపడు తున్నదని గ్రహించి—ఆమె భయాన్ని మరికాస్త పెంచ డానికి నా దగ్గరున్న సాక్ష్యాలు చెప్పాను.

తిరుగులేని సాక్ష్యాలవి! అవేమిటో ఆమెకూ నాకూ మాత్రమే తెలుసు. ఆమె భర్తను నమ్మించడానికవి అద్భుతంగా పనిచేస్తాయని ఆమెకు తెలుసు.

"వద్దు. నా కాపురం పాడుచెయ్యొద్దు...." అందామె.

"నీ కాపురం పాడు చేసే ఉద్దేశం నాకూ లేదు. ఎటొచ్చీ నువ్వు నన్ను సంతోష పెట్టాలి—"

"ఎలా?"

"ఎలాగో నీకు తెలుసు...."

నా ఉద్దేశ్యం విని ఆమె వణికిపోయింది—"పెళ్ళికి ముందు ఏదో జరిగిపోయింది. ఇప్పుడు నువ్విలాగనడం భావ్యం కాదు—"

నేను నవ్వి—"గతం నీ భవిష్యత్తును బాధించకూడదంటే గతాన్ని గతంలాగే కొనసాగనీ—" అన్నాను.

"అందుకు నేను మానసికంగా సిద్ధంగా లేను—" అందామె.

"గడువు కావాలా?"

ఏమనుకుందో—"ఇస్తావా?" అంది.

"నన్ను వదుల్చుకోవడం కోసం గడువడిగితే దారుణంగా నీపై పగతీర్చుకుంటాను. లేనిపక్షంలో కొంత గడువివ్వగలను.. "

"నన్ను వదిలిపెట్టలేవా?"

"వదిలి పెడతాను—డబ్బిస్తే!"

"ఎంత కావాలం?"

"అడిగినప్పుడల్లా అయిదు వేలు. ఎన్నిసార్లడుగుతానో నాకే తెలియదు ఆలోచించుకో!"

ఆమె ఆర్థికస్థితి నాకు తెలుసు. నా షరతు వినగానే ఆమె "నీకు డబ్బెందుకు?" అంది.

"డబ్బడిగే ఆడవాళ్ళకివ్వడానికి...."

రామావతారం మాట్లాడకుండా ఆలోచనలో పడిపోయింది.

నేనామెకు నచ్చజెప్పడం ప్రారంభించాను—"రామా
తావతారం! నువ్వు నాకు కొత్త కాదు. నేను నీకు కొత్త
కాదు. మనం కలుసుకుంటే అది కొత్త తప్పూ కాదు. నా
ప్రోద్బలంమీద తప్పనిసరి పరిస్థితుల్లో యిరుక్కున్నావు
బట్టి అది నీ తప్పూ కాదు. ఇందులో నీ భర్తకు జరిగే
అన్యాయమేమీ లేదు. నువ్వనుకునే అన్యాయం నీ భర్త
కెప్పుడో జరిగింది. ఇప్పుడు నీ భర్తకు నిజం తెలియడమే
అన్యాయం. అది జరక్కుండా కాపాడుకో...."

ఆ తర్వాత రామావతారం నన్ను గడువే అడగలేదు.

నా మనసెంతో సంతోషించింది. తర్వాత ఆమెకు
చెప్పాను—"నెలకు రెండుసార్లైనా నువ్వు నన్ను ఆహ్వా
నించాలి. నా ఫోన్ నంబరిస్తాను. ఫోన్‌లో నాకు కబురు
చెప్పు. నువ్వే నన్నాహ్వానించడంవల్ల నీకిబ్బంది వుండదు.
నీ యింట్లో అనుకూల పరిస్థితులు నీకే బాగా తెలుస్తాయి
గదా—"

అటుపైన ఆమెను హెచ్చరించానుకూడా. ఏ నెలలో
ఆహ్వానం మర్చిపోయినా ఆమె భర్తకు నిజం తెలుస్తుంది.

రామావతారం అన్నింటికీ ఒప్పుకుంది. అది అసహాయత
అని నాకు తెలుసు. కానీ ఆడదాని అసహాయతకు జాలి
పడకపోవడంలో నే మగాడి సుఖం వుంది. ఆ విషయం
బాగా తెలిసినవాళ్ళలో నేనూ ఒకడిని.

ఈ నెలలో అప్పుడే మూడు వారాలు గడిచాయి.
ఇంకా రామావతారంనుంచి ఫోన్ రాలేదు. పిట్టకు బెది
రింపు డోసింకోటివ్వాలా అని ఆలోచిస్తున్నాను.

కానీ ఫోన్ వచ్చేసింది.

రాత్రి ఏడుగంటలకు....

రామావతారం యింటి దొడ్డిదారి ఒక సందులోకి

వుంటుంది. ఎవరికీ తెలియకుండా ఆమె యింటికి వెళ్ళడం పెద్ద కష్టంకాదు.

నా ఆలోచనలను రామావతారం ఆక్రమించేసింది.

ఆడవాళ్ళు రకరకాలు.

నన్నే ప్రేమించి వేరే వివాహం చేసుకునికూడా అప్పుడప్పుడు నాకోసం వచ్చే రోజా....

నన్ను ప్రేమించి వివాహం చేసుకొని నా వ్యక్తిగత జీవితం జోలికి రానని మాటిమాటికీ మాటయిచ్చే రాధ....

నేను ప్రేమించాననుకుని మోసపోయి నన్ను ప్రేమించి మోసం గ్రహించేక వేరే వివాహం చేసుకొని నన్ను ద్వేషించాలనుకుంటూ అది సాధ్యపడక నన్ను ప్రేమిస్తూండడం తప్పనిసరి అయిన రామావతారం....

ముగ్గురిలోనూ నాకు రాధ మనసంటే యిష్టం. రోజా శరీరమంటే యిష్టం. స్త్రీగా యిష్టపడేది మాత్రం రామావతారాన్ని!

అందుకే — హోటల్ ఉడ్‌లాండ్స్‌లో రోజా వున్నదని తెలిసినప్పటికీ — నాకుత్సాహం పుట్టించింది రామావతారం పిలుపు.

ఆఫీసులోనే వుండిపోయాను ఆరింటివరకూ.

అప్పుడు నాకు ఫోన్ వచ్చింది. ఆలస్యానికి రాధ ఫోన్ చేసిందా అనుకున్నాను. కానీ తీరాచూస్తే రోజా!

"అర్జంటుగా రా!" అది రోజా పిలుపు.

ఆఫీసునుంచి తిన్నగా రోజా దగ్గరికి వెళ్ళాను.

"ఏమిటి అర్జంటు?"

"నేను వచ్చింది నీ కోసం...."

"సాయంత్రాలు రాలేనని చెప్పానుగా...."

రోజా నా వంక దీనంగా చూసి — "ఇలాగైతే

నాకిక్కడ బోర్ కొడుతుంది. రాలేనంటే కుదరదు...."
అంది.

రోజాకు నాతో కలిసి సినిమా చూడాలనుంది. అందుకని కాసెట్ తెప్పించి వుంచింది. ఆ రూంలో వీడియో సౌకర్యముంది.

సినిమా పేరు శంకరాభరణం.

"నేను చూసేశాను...." అన్నాను.

"నేనూ చూసేశాను. కానీ మనం చూడలేదుగా...." అంది రోజా.

ఆ సినిమా ఆమెకెంతగానో నచ్చింది. నాతో కలిసి ఆ సినిమా చూడాలన్నదామె కోరిక.

కాదనలేకపోయాను.

ఏడుగంటలకు నాకు రామావతారం ఆహ్వానముంది. అది నేను వదులుకోలేనిది.

అప్పుడు టైము ఆరున్నరయింది.

ఏదో వంక పెట్టి తప్పించుకోవాలనుకున్నాను.

రోజా కాసెట్ పెట్టింది. సినిమా ప్రారంభమైంది.

అప్పుడామె నాకు దగ్గరగా జరిగింది. తన తలను నా భుజంపై వాల్చింది. రెండో చేతిని నా రెండో భుజంపై వేసింది.

కాలేజీ రోజుల్లో బాక్స్ టికెట్ తీసుకొని మేమిద్దరం అలా సినిమా చూసేవాళ్ళం. థియేటర్ కు ముందామె వెళ్ళేది. కాసేపటికి నేను వెళ్ళేవాణ్ణి. సినిమా చూడ్డం అయేక ముందు నేను వెళ్ళిపోయేవాణ్ణి. తర్వాత ఆమె వచ్చేది.

ఆ రోజుల్లో కాబట్టి అలా సరిపోయింది.

ఇప్పుడలా కుదరదు.

ఇద్దరూ వివాహితులం. అందుకే ఆమె సర్దార్జీ వేషంలో గురు భక్షసింగ్ పేరుతో ఈ హోటల్లో మకాం పెట్టింది. సర్దార్జీని కలుసుకునే నెపంతో నేనామెను కలుసుకుంటున్నాను. ఏ సరదాలైనా ఈ హోటల్ గదికే పరిమితం.

నేనామె నడుంచుట్టూ చేయి వేశాను.

సినిమా నడుస్తోంది.

కథలో అర్థముంది. అందముంది. నడకలో ఆకర్షణుంది. వేగముంది. అందుకే చూడ్డంలో విసుగుండదు.

ఒకరినొకరు పొదివిపట్టుకొని మేమా సినిమా చూస్తున్నాం. అయితే గతంలోలా యిద్దరు ప్రేమికుల్లాకాక పసిపాపల్లా ఆ చిత్రం చూశాం.

చిత్రం చూస్తూన్నంతసేపూ నవరసాల అనుభూతి కలిగింది.

నేను యేడుగంటలనీ, రామావతారాన్నీ మరిచిపోయాను.

సినిమా అయిపోయింది.

"నీతో ఈ సినిమా చూస్తూ గొప్ప అనుభూతి పొందాను..." అంది రోజా.

నాకూ అలాగే అనిపించింది. కానీ....

సినిమా చూస్తూ మేము కబుర్లు చెప్పుకోలేదు. ఒకరినొకరు పలకరించుకోలేదు. మేము సినిమానే చూశాం. అయితే నన్ను కదిలించిన దృశ్యం ఆమెనూ కదిలించిందనీ, నన్నానందపరిచిన విశేషం ఆమెనూ ఆనందపరిచిందనీ— అనిపించే భావన ఒక పెద్ద విశేషం!

"ప్రేమికులు కలిసి చూడతగ్గ సినిమా యిది!" అన్నాను.

ఈ భావన ఆ చిత్ర నిర్మాతకూ, దర్శకుడికీ వచ్చి వుండదు. ప్రేమికులేం కర్మ—ఆబాలగోపాలమూ మాసి ఆనందించిన చిత్రమిది!

"నీకు తీరిక లేకపోయినా—నాకోసం నాతో యింత సేపో గడిపావు. చాలా సంతోషం. థాంక్స్!" అంది రోజా.

"నేనే నీకు థాంక్స్ చెప్పాలి—" అందామను కున్నాను కానీ నాకు తీరికెందుకు లేదో స్ఫురించింది. రామావతారం గుర్తొచ్చింది.

చటుక్కున లేచాను.

టైము తొమ్మిది కావస్తోంది. త్వరపడితే అక్క ణ్నించి పావుగంటలో రామావతారం యిల్లు చేరుకో గలను.

ఇంకా నాకు అవకాశముంటుంది.

ఎందుకంటే రామావతారానికి నేను ముందే చెప్పాను.

"నేనేదో వేశ్య వద్దకు వెడుతున్నానన్న భావం నాకు కలక్కూడదు. ఇద్దరు ప్రేమికుల్లా గడపాలి మనం. కులాసాగా కబుర్లు చెప్పుకుంటాం. చదివిన కథలు మననం చేసుకుంటాం. కలిసి టిఫినో, భోజనమో చేస్తాం. తీరుబడిగా మనింట్లో మనం గడుపుతున్నట్లుండాలి. అంటే మనం కలుసుకున్నప్పుడల్లా మూడు నాలుగు గంటలనేపైనా మనం నిర్భయంగా, నిస్సంకోచంగా వుండగలగాలి...."

అంటే యిప్పుడుకూడా రామావతారం ఇంట్లో ఏకాం తంగానే వుంటుందన్న మాట....

"మరి నేను వెళ్ళాలి రోజా!" అన్నాను.

రోజా ప్రేమతో నాకు వీడ్కోలు చెప్పి—"తెల్ల

వారేసరికి మళ్ళీ నువ్వు నా రూం తలుపు తట్టాలి—"
అంది.

"దట్స్ మై ప్లెజర్!" అని అక్కణ్ణించి బయ
ల్దేరాను.

దొరికిన ఆటో వెంటనే ఎక్కేశాను. గమ్యస్థానంలో
దిగాను.

నా జాగ్రత్తలు నేను తీసుకుంటూ ఎవరికంటా పడ
కుండానే రామావతారం యింటి దొడ్డిగుమ్మం చేరు
కున్నాను.

తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తోయగానే
తెరుచుకున్నాయి.

రామావతారం ఉంటున్నది చిన్న బంగళా యిల్లు.
అదామె భర్త బాబాయిది. అందువల్ల చవగ్గా వచ్చింది
వాళ్ళకి. ఇంటి చుట్టూ ప్రహారీగోడ. ఇంటి ముందూ
వెనకాకూడా పెద్ద పెద్ద ఫలవృక్షాలున్నాయి. ఇప్పుడు
నేను చుట్టూ తిరిగి ముందుకు వెళ్ళి ముఖద్వారంవద్ద తలుపు
కొట్టినా గోడుమీద వాళ్ళకు కనబడను. అయినా నేను
రాజమార్గా నెన్నుకోలేదు. మరొకరెవ్వరూ రాడానికి
వీలులేకుండా దొడ్డితలుపు వేసేశాను.

ఇంటి వెనుక తలుపుకూడా తీసే వుంది.

నెమ్మదిగా యింట్లో ప్రవేశించాను.

ఇంట్లో ఎక్కడా అలికిడి లేదు. రామావతారం ఇంట్లో
ఉండేవుండాలి. కానీ యెక్కడా మసులుతున్న జాడ
లేదు.

ఇల్లంతా చీకటిగాకూడా వుంది.

ఒక్క నిముషం తటపటాయించి తడుముకుంటూ దీపం
వేశాను. నేనున్న గది ప్రకాశవంతమయింది.

కళ్ళు సులుముకున్నాను.

అక్కడున్న నిశ్శబ్దం నన్ను కలవరపరుస్తోంది. అయినా రామావతారంమీద నాకున్న మోజు నన్ను ముందుకే నడిపించింది.

పడక గదిముందాగాను. గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. బయటనుంచి గడియపడి వుంది.

ఆ గడియ చూడగానే నాకు స్ఫురించింది.

నేలబారుగా వున్న ఆ గడియ మనం లాక్ చేయడం మరిచిపోయామంటే—తలుపులు దగ్గరగా వేసినప్పుడు నేలమీదకు పడిపోయే అవకాశముంది. అప్పుడు ఎవరైనా వచ్చి తలుపులుతీస్తే తప్ప గదిలో వున్నవాళ్ళు బందీకిందే లెక్క....

ఈ గడియలో ఇబ్బందిగా వుందని రామావతారం నాకు చెప్పింది. ఇంట్లో మేమిద్దరమే వున్నప్పటికీ ఎందుకైనా మంచిదని గదితలుపులు వేయబోయాను. అప్పుడామె నన్నోసారి ఆ గడియ గురించి హెచ్చరించింది.

మేమిద్దరం లోపలుండగా ఆ గడియ పడిపోయిందంటే ఇంకేమైనా వుందా?

ఆ గడియ యే విధంగా పడుతుందో బయటనుంచి ఆమె చూపించింది.

ఇప్పుడా గడియను చూడగానే అసలు విషయం నాకు స్ఫురించింది.

హడావుడిలో తలుపు, గడియపడిపోయి రామావతారం పడకగది లోపల వుండిపోయుంటుంది. ఏడింటికల్లా నేను వస్తానని ఎదురుచూసి వుంటుంది. ఎప్పటికీ నేను రాలేదు. ఇంట్లో ఇంకెవ్వరూ లేరు. విసుగుతో కళ్ళుమూసుకుంటే నిద్రపట్టేసి వుంటుంది.

అందుకే యిల్లంతా నిశ్శబ్దంగా వుంది.

నేను మెల్లిగా గడియతీసి తలుపు తోశాను.

లోపలకూడా చీకటి. అవతల గదిలో నేను వేసిన దీపపు వెలుతురీ గదిలోకి యే మాత్రమూ ఉపయోగపడ్డం లేదు. రామావతారం నిద్రపట్టడంకోసం లైటార్పేసి వుంటుంది.

నేను గదిలో అడుగుపెట్టి స్విచ్ బోర్డుకోసం తడుము తాగాను.

ఇంతలో గదిలో అడుగుల చప్పుడు వినిపించింది. చెవులు రిక్కించాను.

రామావతారం పాదాల సవ్వడి మెత్తగా, మనోహరంగా వుంటుంది.

ఇప్పుడు నేను విన్నది ఆమె పాదాల చప్పుడు కాదు. అసలు నేనలాంటి చప్పుడు విన్నానా అన్న భ్రమకూడా కలుగుతోంది. ఎందుకంటే కొద్ది క్షణాలు మాత్రమే విన్నానా చప్పుడు....

స్విచ్ తలుపుకు పక్కనే వుండాలి. వెంటనే చేతికి దొరకలేదు. ఈలోగా నా చేతికి తగిలిందో యేమో గది తలుపు దగ్గరగా వేసుకుంది. గడియపడిన చప్పుడూ అయింది.

నాకు పై ప్రాణాలు పైనే పోయినట్లనిపించింది.

ఇప్పుడు రామావతారంకూడా ఈ గదిలో నేవుంటే....

మేమిద్దరం....ఒకే గదిలో....ఎవరో వచ్చి విడిపించేంతవరకూ బందీలుగా వుండిపోతాం. నా పరువుకు, రామావతారం జీవితానికీ తట్టుకోలేని దెబ్బ తగులుంది.

ఈ విషయం రాధవరకూ వెడుతుంది. అప్పుడామె నన్ను క్షమిస్తుందా? ఎందుకో ఆమె నన్ను తప్పక క్షమి

స్తుందనే అనిపించింది.

మళ్ళీ తడుముకుంటూ మొత్తంమీద స్విచ్ పట్టు కున్నాను. ఒక్కసారి గదిలో ట్యూబ్ లైటు వెలిగింది.

చీకటికి అలవాటుపడ్డ నా కళ్ళు వెలుగును భరించ లేకపోయాయి. కళ్ళు నులుముకుని ముందుకు చూశాను.

మంచంమీద యెవరో దుప్పటి కప్పుకొని నిద్రపో తున్నారు.

వాతావరణంలో చలిలేదు. అటువంటి సమయంలో దుప్పటి కప్పుకొని ఉక్కపోవాలని యెవరనుకుంటారు?

మంచంమీది వ్యక్తి రామావతారమేనని నేనూహించ గలను. ఆమె కప్పుకుని పడుకుందంటే—ఆరోగ్యంకానీ దెబ్బతినలేదుగదా...

తినబోతూ కూర రుచి అడగనేల?

గదిలో నేను, రామావతారం....

గది తలుపులు గడియపడ్డాయి. బయట్నుంచి ఎవరైనా వస్తే తప్ప నేను బయట పడలేను. అలాగని యిప్పటి సమయం వృథా చేసుకోవడమెందుకు?

నేను లోపల్నుంచికూడా గడియ వేసి మంచం దగ్గరకు నడిచి నెమ్మదిగా "రామూ!" అన్నాను.

దుప్పటిలోని మనిషి నుంచి సమాధానంలేదు.

దుప్పటి కాస్త లాగాను.

రామావతారం!

ప్రశాంతంగా వుంది ముఖం.

"ఏయ్—యింత మొద్దు నిద్దరేమిటి? లే.... లే...." అన్నాను.

ఆమె బదులివ్వలేదు. పూర్తిగా దుప్పటి లాగేశాను. ఏదో అనబోయి ఉలిక్కిపడ్డాను.

రామావతారం గుండెల్లోకి దిగి వుంది—ఒక బాకు! పిడిమాత్రం కనపడుతోంది. చుట్టూ రక్తం గడ్డకట్టి వుంది.

అంటే?

రామావతారం చచ్చిపోయింది. చచ్చిపోలేదు. చంపబడింది. అంటే హత్య ...ఆమెనెవరో హత్యచేశారు.

గదిలో నేను, రామావతారం! రామావతారం హత్య చేయబడింది. నేనా గదిలో బందీని. ఎవరైనా వచ్చి తలుపులు తీస్తే తప్ప నాకు మోక్షంలేదు. అప్పుడు మాత్రం ...

నా వళ్ళు జలదరించింది.

రామావతారం హత్యకు నేను సంజాయిషీ యిచ్చుకోవాలి. అందరూ నేనే హంతకుడినంటే కాదని ఋజువు చేసుకోవాలి.

ఇప్పుడు రామావతారాన్ని చూస్తూంటే నాకు భయం కేస్తోంది. నా భవిష్యత్తంతా ఆమె హత్యతో ముడిపడి వుంది.

ఎవరామెను హత్యచేశారు? ఎందుకు చేశారు?

మళ్ళీ నా బుర్ర పనిచేస్తోంది. గదిలో అడుగు పెట్టినాక— నేను విన్న అడుగుల చప్పుడు భ్రమకాదు.

ఎవరో రామావతారంపై పగబట్టారు. ఆమెను చంపేశారు. అప్పుడు తెలిసింది — గది తలుపు బయటనుంచే గడియపడిందని. హంతకుడు గదిలో కూర్చుని అవకాశం కోసం యెదురుచూస్తున్నాడు. నేను తలుపుతీయగానే తను గదిలోంచి బయటపడి-బయటనుంచి తలుపు గడియ వేశాడు.

ఇప్పుడు నాకు స్ఫురిస్తోంది. నేను తలుపు గడియ తీసి

నపుడు జాగ్రత్తగా పక్కనపెట్టాను. అది మళ్ళీ క్రిందకు పడే అవకాశం లేదు. ఎవరో కావాలని నన్ను గదిలో బంధించారు.

నన్ను బంధించిన వాళ్ళెవరో. హత్య కేసులో నన్నిరికించడానికి ప్రయత్నిస్తారు. కాసేపట్లో యిక్కడికి పోలీసులు రావడం తథ్యం.

పోలీసులకు నేనేం చెప్పాలి? అసలు నేనిక్కడ యెందుకున్నానంటే ఏం చెప్పాలి?

మొదటిసారిగా తప్పు చేసినందుకు నన్ను నేను నిందించుకున్నాను. నిందించుకుని లాభం లేదుకదా....గదిలోంచి బయటపడడానికి ఏమైనా వీలుంటుందేమోనని చూశాను. నేను వేసిన తలుపు గడియ తీసేశాను. తలుపులు మళ్ళీ మళ్ళీ లాగి చూశాను. లాభం లేదు. తలుపు రావడం లేదు. బయటపడడానికింకో దారిలేదు.

నా ప్రయత్నాల్లో నేనుండగానే వున్నాను. ఈలోగా గది తలుపులు తెరుచుకున్నాయి. అనుకున్నట్లే పోలీసులు వచ్చారు.

"ఇన్స్పెక్టర్! ఈ గదిలో నేనుండడం నా దురదృష్టం. ఈ హత్యతో నాకెలాంటి సంబంధమూ లేదు. అంతా నేను నిజమే చెబుతాను. మీకు సహకరిస్తాను. నన్ను హంతకుడిగా భావించవద్దు...." అంటూ నే యిన్స్పెక్టర్‌కి లొంగిపోయాను.

# 5

రామావతారం తళుకు బెళుకులతో నన్ను లొంగదీసుకుంది. నాకు స్త్రీలంటే బలహీనత వుంది. అది ఆధారంగా చేసుకుని ఆమె నానుంచి డబ్బు గుంజుతూ తన అవసరాలు గడుపుకునేది.

వివాహమైనా ఆమె నన్ను వదిలిపెట్టలేదు. నా భార్యకు మా పూర్వ పరిచయం గురించి చెబుతానని బెదిరించి తన యింటికి రప్పించుకుంటుంది. నా దగ్గర డబ్బూ గుంజుతుంది. తన మోజు తీర్చుకుంటుంది.

ఆరోజు నన్నామె ఏడింటికి పిలిచింది. తొమ్మిదిదాకా నేను వెళ్ళలేకపోయాను. అప్పుడు వెడితే హంతకుడు నన్ను తెలివిగా గదిలో బందీ చేశాడు.

ఇదీ నేను పోలీసులకు చెప్పిన కథ. నా కథను కొంత వరకూ పోలీసులు నమ్మారు. రామావతారం అడక్కపోయినా నేనామెకు కొంత డబ్బిస్తూ వుండేవాడిని. ఆ డబ్బునామె బ్యాంకులో వేసుకునేది. నేనిచ్చానన్న మొత్తాలూ, తేదీలూ—ఆమె పాస్ బుక్ తేదీలతో సరిపోయాయి.

నేను చెప్పిన కథలో నిజముంది. ఎటొచ్చీ వంచన చేస్తున్నవారు తారుమారయ్యారు. చనిపోయిన మనిషిపై నింద వేయడం తప్పని నాకు తెలుసు. కానీ నేను చేస్తున్న తప్పు నా బ్రతుకును నిలబెడుతుంది. చనిపోయిన వారి కోసం బ్రతికున్నవారు జీవితాన్ని త్యాగం చేయడం బుద్ధిహీనత అనిపించుకుంటుంది.

నా కథకు ప్రచారం వచ్చింది. మామగారింట్లోనూ, రాధకూ కూడా నేను పోలీసు కస్టడీలో వున్న విషయం తెలిసింది. మామగారు మండిపడి నా ముఖంకూడా చూడనన్నారుట. రాధ నన్ను బెయిలుమీద విడిపించుకునేందుకు వచ్చింది.

"మొత్తంమీద నా మంచితనానికి పరీక్ష పెడుతున్నారన్నమాట!" అంది రాధ మొదటిసారిగా నన్ను చూడ్డానికి వచ్చినపుడు.

నేను సిగ్గుతో తల వంచుకున్నాను.

"రామావతారం గురించి ముందే నాకెందుకు చెప్ప లేదు?"

"చివరివరకూ నీనుంచి దాచగలననుకున్నాను...."

రాధ నిట్టూర్చి—"హత్య మీరు చేయలేదు కదూ!" అంది.

"నేను చేయగలనని నమ్ముతున్నావా?" అన్నాడు దీనంగా.

"నేనుండగా మరో స్త్రీతో సంబంధం పెట్టుకో గలరనీ నమ్మలేదు నేను...."

ఛెళ్ళున కొట్టినట్లయింది నాకు — "నేను నిజంగా హత్య చేయలేదు...."

"అది న్యాయవాదులు చూసుకుంటారు. నేను చేయ గలిగిందల్లా బెయిల్ మీద విడిపించి మిమ్మల్నింటికి తీసుకుని వెళ్ళడం!" అంది రాధ.

"థాంక్స్ రాధా!" అన్నాను.

"నా డ్యూటీ నేను చేస్తున్నాను. థాంక్సెందుకు?"

నేను మాట్లాడలేదు.

మేము ఇంటికి వెళ్ళాం.

రెండు రాత్రులూ—ఒక పగలూ తర్వాత మళ్ళీ ఇల్లు చేరాను నేను. ఆ యిల్లు నాది. నాదంటూ ఒక ఇల్లుంచు కుని నాది కాని ఒక యింటికి వెళ్ళడంవల్ల నేనిప్పుడు హత్య కేసులో అనుమానితుణ్ని.

"నాకు మిమ్మల్ని చూస్తే చాలా జాలిగా వుంది—" అంది రాధ.

"ఇప్పుడు నీకు నామీద జాలేస్తోందా?" ఆశ్చర్యం గానూ, ఆనందంగానూ అడిగాను.

"పొరుగింటి పుల్లకూర రుచి అన్న సామెత ఒక్క మగవాళ్ళ విషయంలోనే నిజమనుకున్నాను. ఎందుకంటే నేను వయసులో వున్న అందమైన స్త్రీని. వివాహానికి ముందు మగవాళ్ళను చూస్తే అప్పుడప్పుడు రకరకాల ఊహాలు పుట్టేవి. వివాహమైనాక మనసంతా మీరే నిండి పోయారు. కలలోకూడా పరాయి పురుషుడిపై తప్పుడు ఊహరాదు నాకు. నిత్యం యెందరో సినీ హీరోలను, ప్రపంచ శ్రేణి ఆటగాళ్ళను—టీవీల్లోనో, సినిమాల్లోనో, సభల్లోనో చూస్తూంటాను. కానీ పొరపాటునకూడా వాళ్ళలో ఎవరినీ మీ స్థానంలో ఊహించుకున్న సందర్భాలు నాకు లేవు. అది పాతివ్రత్యమని నేను భావించడంలేదు. స్త్రీకి సహజమని అనుకుంటున్నాను. స్త్రీ జీవితంలో స్థిరత్వాన్ని కోరుతుంది. రక్షణను కోరుతుంది. ఆమె కోర్కెలు ఒక వలయానికి చుట్టూ తిరుగుతాయి. పురుషుడి విషయంలో అలా కాదని నేను విన్నాను...."
రాధ ఆగింది.

ఆమె చెప్పబోయేదేమిటో నాకర్థం కాలేదు కానీ నేనిప్పుడు అపరాధిని. రాధ దృష్టిలోనే కాదు, న్యాయస్థానం దృష్టిలోకూడా!

రాధ మళ్ళీ ప్రారంభించింది — "ఈ లోకంలో పురుషుడివంటి స్త్రీలూ వుంటారని రామావతారం నిరూపించింది. ఆమె వలలో మీరు పడడం మీ దురదృష్టం. అందుకే నాకు మీరంటే జాలిగా వుంది."

"థాంక్స్ రాధా—నీనుంచైనా నాకు రవంత జాలి దొరికింది...."

రాధ నా మాటలు వినే మూడ్‌లో లేదు. ఆమె యింకా చెప్పుకుపోతోంది-"ఈ భూమ్మీద స్త్రీ పుట్టక

ఎందుకు? తన వాళ్ళను అర్థంచేసుకుని లాలించడానికీ—తప్పులు చేయబోయే వాళ్ళను వారించడానికీ....! అందుకే భగవంతుడామెను ప్రేమమయిని చేశాడు. అటువంటి స్త్రీ జాతికి మాయని మచ్చగా నిలిచిన రామావతారం వంటి ఆడదానికీ లోకంలో జీవించే అర్హతలేదు. మీరామెను హత్యచేసి వుంటే నేనానందించి వుండేదాన్ని...."

నేను ఇబ్బందిగా ఫీలయ్యాను. రామావతారాన్ని రాధ తప్పుపట్టి తిడుతోంది. రామావతారంలో తప్పులేదనీ ఆ తప్పు నాదనీ నాకు తెలుసు కాబట్టి ఆమె తిట్లన్నీ నాకు తగులుతున్నాయి.

"నేనామెను చంపలేదు—" అన్నాను.

"అసలేం జరిగిందో మొత్తమంతా మీరు నిజమే చెప్పారుకదూ!"

"రాధా! నిజమొక్కటే యిప్పుడు నన్ను రక్షించగలదని నాకు తెలుసును. అబద్ధం చెప్పలేను...."

"మీకోసం ప్రత్యేకంగా డిటెక్టివ్ కిల్లర్‌ని రప్పిస్తున్నాను. ఆయన మిమ్మల్ని తప్పకుండా రక్షించగలడు...."

"డిటెక్టివ్ కిల్లర్?!" అన్నాను ఆశ్చర్యంగా.

నేనాయన పేరు విన్నాను. ఆయన వయసు ముప్పై దాటింది. పెళ్ళి చేసుకోలేదు. తన జీవితాన్ని నేర పరిశోధనకే అంకితం చేశాననీ, వివాహమందుకు ప్రతిబంధకమనీ అంటాడాయన.

ఆయనలో వచ్చిన ఇబ్బంది ఏమిటంటే—పరిశోధనకు దిగేక మొత్తం వివరాలన్నీ లాగేస్తాడు. తను కనుగొన్న వివరాలన్నీ పత్రికలకు తెలియజేస్తాడు. ఏ కేసుకైనా

ఆయన్నాహ్వానించే ముందు పెద్దమనుషులన్నవారు ఆలో చించుకోవాలి.

"డిటెక్టివ్ కిల్లర్ పేరు వినలేదా?" అంది రాధ.

"విన్నాను. కానీ ఈ కేసులో డిటెక్టివ్ వెంకన్నను పిలవాల్సింది...." అన్నాను సంకోచిస్తూ నే.

"ఎందుకని?"

"ఆయన ఆమాకీలన్నీ రహస్యంగా వుంటాయి. నేరస్థుల రహస్యాలను దాచడంలో ఆయనకాయనే సాటి!"

రాధ నవ్వి—"మీ గురించిన పూర్తి రహస్యాలు తెలుసుకోవాలన్నది నా కోరిక. అందుకే కిల్లర్ని పిలిచాను—" అంది. నా ముఖం ఆదోలాగై పోవడం చూసి. "మీరు హత్య చేయనప్పుడు కిల్లర్ తప్ప యింకెవ్వరూ మిమ్మల్ని రక్షించలేరు. మీ గురించి యెటువంటి నిజం బైటపడినా నేను భరించగలను. ఇంకా మీ కెందుకు భయం?" అందామె మళ్ళీ.

తప్పు చేసినవాడు భయపడక తప్పదు కదా....

కిల్లర్ బైటపెడితే తప్ప నా తప్పులన్నీ రాధ ముందు ఒప్పుకోదల్చుకోలేదు.

# 6

"అయాం కిల్లర్. కిల్లరాఫ్ లైస్. కిల్లరాఫ్ ఫాల్స్ హుడ్. కిల్లరాఫ్ క్రిమినల్స్..." అంటూ చేయి చాచాడతడు.

నేను భయం భయంగా చేయి జాపి—"అయాం నాటే క్రిమినల్. నమ్ముతారా?" అన్నాను.

"నమ్మను—" అన్నాడు కిల్లర్—"ఈ ప్రపంచంలో

నేరస్థుడు కానివాడంటూ వుండడు కాబట్టి—"

"అయితే అందర్నీ చంపేస్తారా?"

"నా క్రతువు తెరువుకు అవసరమైనంతమందిని, నా జీవన పరిమితి వీలిచ్చినంతమందిని...." అని నవ్వాడు కిల్లర్.

అతణ్ని మంచిచేసుకోవడం మంచిదనిపించింది—"మీ తెలుగు చాలా గొప్పగా వుంది. అదే మీ మాతృభాషా?" అన్నాను.

"నా తల్లి భారతమాత. ఆమె భాషలన్నీ నా మాతృభాషలే...."

ఏమనాలో తెలియలేదు.

కిల్లర్ నన్ను పరీక్షగా చూడ్డం మొదలుపెట్టాడు. అతడి చూపులు నన్ను గుచ్చుతున్నాయి. నాకిబ్బందిగా అనిపించి తలవంచుకున్నాను.

"మీ కథనం ప్రకారం హత్యజరిగిన గదిలో మీకంటే ముందెవరో మసిలారు. పోలీసులకలాంటి ఆధారాలు ముందు దొరకలేదు. నేను రంగంలో దిగగానే గదంతా శోధించి కొన్ని కొత్త వేలిముద్రలు సంపాదించాను..." అన్నాడు కిల్లర్.

కిల్లర్ నిజంగా చురుకైనవాడు.

పడకగది నానుకునే బాత్రూముంది. బాత్రూములో కాస్త పైనుంచి వెంటిలేటరుంది. వెంటిలేటరుకు ఇనప చువ్వలున్నాయి. ఆ విషయం పైదాకా వెడితే కానీ తెలియదు. నాకంటే ముందెవరైనా ఆ గదిలో చిక్కుపడివుంటే తప్పించుకుందుకక్కడ ప్రయత్నం చేస్తాడు.

అక్కడ రెండు జతల వేలిముద్రలు దొరికాయి. ఒకటి నావి.

"అంటే అవే హాంతకుడివయుండాలి...." అన్నాను.

కిల్లర్ తల అడ్డంగా ఊపి—"హంతకుదెవరో ఇంకా తెలియలేదు. అప్పుడే ఏమీ చెప్పలేము. గదిలో మీరు కాక యింకో వ్యక్తి అక్కణ్ణించి బయటపడాలని ప్రయత్నం చేసినట్లు తెలుస్తుంది. ఆ వ్యక్తి ఎవరన్నది తెలుసుకోవాలి...." అన్నాను.

"ఎలా తెలుస్తుంది?" భయంగానూ ఆత్రుతగానూ అడిగాను.

"అది తర్వాత తెలుసుకుందురుగాని. హత్య సుమారు ఏడుగంటల ప్రాంతాల జరిగింది. మీరు తొమ్మిది గంటలకు అక్కడికి వెళ్ళానంటున్నారు. నిజానిజాలు తెలుసుకుందుకు గురుబక్ష్‌సింగ్ సాయపడాలి. కానీ గురుబక్ష్‌సింగ్ పరారీలో వున్నాడు. అతడి గురించిన ఆచూకీ తెలిస్తే తప్ప మీ ఎలిబీకి అర్థంలేదు—" అన్నాడు కిల్లర్.

పోలీసులు అరెస్టు చేయగానే నేను తొమ్మిదిదాకా గురుబక్ష్‌సింగ్‌తో వున్నానని చెప్పాను. పోలీసులు వుడ్‌లాండ్స్ హోటలుకు ఫోన్ చేశారు. గురుబక్ష్‌సింగ్ వున్నాడు. నా మాటలు నిజమేనని చెప్పి—పోలీసులు వస్తానంటే రమ్మన్నాడు.

పోలీసులు వెళ్ళేసరికి అతను లేడు. అతడు బయటకు వెళ్ళడం యెవరూ చూడలేదు. అంటే తెలివిగా పారి పోయేడన్నమాట! గదిలో అతడి సూట్‌కేసుంది. అందులో అతడి బట్టలు మాత్రం వున్నాయి. అతడు తిరిగివస్తాడని పోలీసులు రెండుమూడు రోజులు యెదురు చూశారు రాలేదు.

గురుబక్ష్‌సింగ్ ఎందుకు పరారీ అయ్యాడు? ఈ ప్రశ్న

ఒక్కటే చాలు—నన్ను నేరస్థుడిగా నిరూపించడానికి!

అసలు నిజం చెబితే రోజా జీవితం నాశనమవుతుంది. చెప్పకపోతే నాకు జీవితమే వుండదు. ఇంతవరకూ గురుబక్ష్ సింగ్ గురించి నేను సరైన సమాచారమివ్వలేదు. మా కంపెనీకి సంబంధించిన వ్యవహారంమీద రహస్యంగా మాట్లాడాలని వచ్చాడని చెప్పాను.

నేను చెప్పిన అబద్ధాలు పోలీసులు నమ్మారు. గురుబక్ష్ సింగ్ పోలీసుల కళ్ళబడడానికిష్టపడడం లేదంటే అతడివద్ద దొంగసరుకేదో ఉండివుండాలి. ఏమిటా దొంగ సరుకు? అది హోటల్నించి ఎలా తప్పించాడు?

పోలీసుల ఆలోచన ఈ దారిలో నడుస్తున్నాయి.

కిల్లర్ వచ్చి రెండ్రోజులయింది. నన్ను మాత్రం అతడీ రోజువరకూ కలుసుకోలేదు కానీ పోలీసులనుంచి మొత్తం సమాచారమంతా రాబట్టి పరిశోధనలో వున్నాడు.

"గురుబక్ష్ సింగ్ గురించి నేనేం చెప్పగలను?" అన్నాను.

"గురుబక్ష్ సింగ్ వదిలిన వెళ్ళిన సూట్ కేసులో అతడి బట్టలున్నాయి. వాటిని పరీక్షించి చూశాను. అతడు చాలా నాజూకైన మనిషనిపించింది. సర్దార్జీలలో అంత నాజూకైనవారు అరుదు. అందులోనూ అతిడు అయిదడుగులమీద ఒక అంగుళం మించి పొడవుండడని హోటల్లో వారందరూ అంటున్నారు...." అని ఆగాడు కిల్లర్.

నేను తడబడ్డాను. అతడిదంతా నాకెందుకు చెబుతున్నట్లు?

కిల్లర్ యింకా వివరించాడు.

గదిలో బాగా చనువుగా మసిలిన వారిద్దరే యిద్దరు. ఇద్దరిలో ఒకరు నేనేనని వేలిముద్రలు తెలియబరు

స్తున్నాయి. రెండో వ్యక్తి గురుబక్ష్ సింగు అయుండాలి.

"అది సహజమేకదా—" అన్నాను.

"సహజం కాని విశేషమొకటుంది—" అన్నాడు కిల్లర్.

"ఏమిటది?" కుతూహలంగా అడిగాను.

"గురుబక్ష్ సింగ్ సూట్ కేసులో మంచి పరిమళం. అదే పరిమళం స్నానాల గదిలో, మంచంమీదా కూడా వుంది. దీని అర్థం అతడు బాగా పెర్ ఫ్యూమ్స్ వాడతాడని. అవి అతడికి ప్రాణమై వుండాలి. వెళ్ళేటప్పుడు కూడా తీసుకుని వెళ్ళాడు...."

"ఇందులో అసహజమేముంది?"

"అసహజమేమిటంటే ఆ పెర్ ఫ్యూమ్స్ పురుషులు వాడేవి కాదు...."

నేనులిక్కిపడి—"పెర్ ఫ్యూమ్స్ కు ఆడా మగా వుంటుందా?" అన్నాను.

"మగాళ్ళలోనూ బొట్టు, కాటుక పెట్టుకునే వారుండవచ్చు. కానీ అవి ఆడవారి సొత్తుగానే భావించడం జరుగుతుంది...." అని కిల్లర్ ఒక్క నిమిషమాగి—"మంచంమీద మీవి, గురుబక్ష్ సింగ్ వి—వేలిముద్రలు ఎన్నోచోట్ల కలగాపులగంగా వున్నాయి. మీరు, అతడు కలిసి స్త్రీ పురుషుల్లా మసిలారనడాని కక్కడ ఆ సాక్ష్యం. ఎటొచ్చీ గురుబక్ష్ సింగ్ స్త్రీయా, పురుషుడా అన్నది మీరు చెప్పాలి—" అన్నాడు.

"వెధవ వేలిముద్రలు....ఎంత పని చేశాయి?" అనుకున్నాను. నాకు నాలుక తడారిపోయినట్లయింది.

"ఆ గదిలో మూడో వ్యక్తి మసలలేదు. ఒక స్త్రీ ఆ గదిలో అడుగుపెట్టిందనడానికి సాక్షులెవరూ లేరు.

గురుబక్ష్ సింగ్ ఆడదైనా అయుండాలి. లేదా మీరిద్దరూ సెక్స్ పెర్వర్ట్స్ అయుండాలి. రెండింట్లో ఏది నిజం?" అన్నాడు కిల్లర్.

నాకు గొంతు పెగల్లేదు.

"సమాధానం గురించి మీరాలోచిస్తున్నట్లున్నారు. నిజం చెప్పాలా, అబద్ధం చెప్పాలా అన్న ఆలోచన అది! మీరు నిజం చెప్పడానికి సహకరించే ఓ సమాచారం చెబుతాను. అక్కడ తలదిండు క్రింద రెండు పొడవాటి వెంట్రుకలు దొరికాయి. వాటిని కెమికల్ ఎనాలిసిస్ కు పంపడం జరిగింది. వాటిలోని భాస్వరం ఎమౌంట్ నిబట్టి అవి స్త్రీ వెంట్రుకలని తేలింది...."

"అంటే—గురుబక్ష్ సింగ్ ఆడది కాదు...."

కిల్లర్ శాంతంగా — "అయిదడుగుల ఒక అంగుళం ఎత్తయిన నాజూకైన సర్దార్జీతో హోటల్ వుడ్ లాండ్స్ గదిలో మంచంమీద ఏకాంతంగా చనువుగా గడిపారన్న వార్త పత్రికలకెక్కితే—హంతకుడిగా ఉరికంబమెక్కే ముందే అవమానం మిమ్మల్ని చంపేస్తుంది...."

నేను మాట్లాడలేదు.

"గురుబక్ష్ సింగ్ స్త్రీ అనడంలో సందేహంలేదు. పోలీసులు ఫోన్ చేయగానే ఆమె తన స్త్రీ వేషాన్ని ధరించి పురుష దుస్తులు సూట్ కేసులో వదిలి—మిగతావన్నీ యే చేతిసంచిలోనో వేసుకొని వెళ్ళిపోయుంటుంది. ఆ సమయంలో భుజానికి వ్రేలాడే చేతిసంచీతో ఓ అందమైన యువతి హోటల్లోంచి బయటకు వెళ్ళడం కొందరు చూశారు. ఆమే గురుబక్ష్ సింగ్ అయుంటుందని యెవరూ ఊహించలేదు. కానీ గదిలో ఆమె పాదాల గుర్తులున్నాయి. ఒక్క పైకోటు మినహాయిస్తే ఆమె

ధరించిన పాంటు, షర్టు స్త్రీలవని తెలుస్తూనేవున్నాయి. మీరామె వివరాలు చెబితే మీకు నేను హంతకుడి వివరాలు చెబుతాను. నా ఊహ నిజమయితే తప్ప అది బయటపెట్టను. నా ఊహ నిజమో కాదో తెలుసుకోవాలంటే — మీరు గురుబక్ష్ సింగ్ వివరాలు చెప్పాలి...."

అప్పుడు నేను రోజా వివరాలు చెప్పకుండా ఆమె గురించి చెప్పాను.

"అంటే నేననుకున్నది నిజమేనన్నమాట!" అన్నాడు కిల్లర్.

"ఏమనుకున్నారు మీరు?"

"మీ శీలం మంచిది కాదని...."

నేను దెబ్బతిని — "హంతకుడి గురించి చెబుతానన్నారు!" అన్నాను.

"ఒక యువతి వివాహమైనాక మీకోసం భర్తను మోసంచేసి — మారువేషంలో యింత సాహసంచేసి వస్తుందంటే నమ్మడం కష్టం. మీరామెను దేనితో బ్లాక్ మెయిల్ చేసి లొంగదీసుకొని వుండాలి...."

"కాలేజీ రోజుల్నించీ ఆమే నా వెంటబడింది. నేనామె జోలికి వెళ్ళలేదు—...." అన్నాను ఉక్రోషంగా.

"అంటే అప్పుడుగానీ యిప్పుడుగానీ ఆమె మిమ్మల్ని రేప్ చేసిందా?"

ఈ ప్రశ్నకు తెల్లబోయి—"అంటే?" అన్నాను.

"ఆమె ప్రేమకు మీ సహకారంకూడా వున్నదని నా భావం ..." అని ఆగి—"ఇంత చెప్పి ఆమె పేరు, చిరునామా మాకివ్వలేరా?" అన్నాడు కిల్లర్.

"ఆమెకన్యాయం చేయలేను...." అన్నాను.

"ఇట్సాల్రైట్ — ఈమాత్రం చెప్పారు చాలు...."
అని వెళ్ళిపోయాడు కిల్లర్.

## 7

"ఇది చూడండి—" అంది రాధ.

అది ఆ రోజు దినపత్రిక. అందులో రెండో పేజీలో రోజా ఫోటో వుంది.

రామావతారం హత్యకేసులో గురుబక్ష్‌సింగ్ వ్యవహారానికి సంబంధించిన కొత్త నిజాన్ని కనుగొని డిటెక్టివ్ కిల్లర్ పత్రికలవారికి తెలియబరిచాడు. అతడి పరిశోధనా వివరాలందులో వున్నాయి.

అతడు నేను చదువుతున్న కాలేజీకి వెళ్ళి అక్కడ పరిశోధన కొనసాగించాడు. నా టైములో నాకు పరిచయస్థులైన ఆడపిల్లలెందరో, వారిలో భాగ్యవంతులెందరో అందులో చదువుకొనసాగుతూండగానే యెవరికి వివాహమయిందో కనుక్కొనేసరికి రోజా పేరు బయటపడింది. అతడామె చిరునామా సాధించడమేగాక కలుసుకున్నాక నిజం చెప్పకపోతే ఆమెను బలవంతంగా మా ఊరు తీసుకొచ్చి హోటల్ ఉడ్‌లాండ్స్‌లోని వారందరికీ ఆమెను గురుబక్ష్‌సింగ్ వేషంలో చూపుతానని బెదిరించాడు. ఆమె నిజం చెప్పేసి రహస్యం కాపాడమని వేడుకుంది.

అదిప్పుడు పేపర్లో వచ్చింది.

"మీరు నాతో చాలా అబద్ధాలు చెప్పారు...." అంది రాధ నిట్టూర్చి.

నేనేదో అనేలోగా కిల్లర్ మా యింటికి వచ్చాడు. నన్ను చూస్తూనే — "మీరు చెప్పకపోయినా రోజా గురించి తెలుసుకున్నాను. కావాలనుకుంటే రోజా

గురించి మీ చేతనే చెప్పించేవాణ్ని. కానీ నా శక్తి సామర్థ్యాలు మీకు తెలియడం మంచిదనిపించి అలా చేశాను. ఇప్పుడు మీరు ఈ కేసులో మాకు చెప్పకుండా దాచిపెట్టిన మొత్తం రహస్యాలన్నీ బయటపెట్టి సహకరించడం మీకే మంచిది ....” అన్నాడు.

“నేను దాచిపెట్టింది ఒకేఒక్క రహస్యం. అది మీరు కనుక్కోవడమే కాక బట్టబయలుకూడా చేశారు” అన్నాను.

“మరి రహస్యం కనుక్కున్నదెందుకు?”

“రోజా జీవితం ఏమవుతుందో ఆలోచించారా?”

“జీవితాన్ని నిలబెట్టుకోవడం — రహస్యాన్ని దాచడంలో కాదు. రహస్యం అవసరం లేకపోవడంలో వుంది—” అని—“రోజా చేజేతులా జీవితాన్ని నాశనం చేసుకుంది. అందుకు మీ ప్రోత్సాహమూ వుంది కాబట్టి ఆమెపై జాలివుంటే మీరు మీ భార్యను వదిలి రోజాతోనే కాపురం పెట్టండి—” అన్నాడు కిల్లర్.

“అలా ఎలా కుదురుతుంది?”

“హత్య చేసినవాడు ఉరికంబానికి సిద్ధపడక తప్పదు” అని— “రామావతారం పడకగది నానుకుని వున్న బాత్రూంలో మీవికాక మరొకరి వేలిముద్రలున్నాయన్నానుగదా—అవి యెవరివో తెలుసుకున్నాను....” అన్నాడు కిల్లర్.

“ఎవరివి?” అంది రాధ.

“అతడి పేరు శంభునాథ్. నిరుద్యోగి. ఆ వీధి మొత్తానికి తీయబడివున్న మగాళ్ళు నలుగురున్నారు. ఎంక్వయిరీకి వెళ్ళినట్లు వెళ్ళి ఆ నలుగురివీ వేలిముద్రలు సంపాదించాను. అందులో శంభునాథ్ వేలిముద్రలు

మాశాక్కు వలసినవని తేలిపోయింది....”

“అసలతడా వీధిలోనే వుంటాడని యెలా ఊహించారు?”

“రామావతారానికి మగాళ్ళ పిచ్చి వుందని తెలిసింది గదా. ఆమె తన వలను విసురుతూనే ఉండివుండాలి. ఆమె ఎవరిమీద వలను విసురుతుందీ అంటే చెప్పడం కష్టం. పెళ్ళికాని వాళ్ళనూ, ఏ పనీలేకుండా తిరుబడిగా వున్నవాళ్ళనూ అయితే ఆమెకు సేఫ్. ఆ కోణంలో ఆలోచించి అది ఫలించకపోతే మరో ఆలోచన చేద్దామనుకున్నాను. అదృష్టవశాత్తూ — ఫస్టు బెట్టే క్లిక్కయింది—” అన్నాడు కిల్లర్.

“ఈ కిల్లర్ దేవాంతకుడు —” అనుకున్నాను. నేనిచ్చిన తప్పుడు సమాచారంతో అతడు సరైన మనిషిని పట్టుకున్నాడు. అతడి విజయం కాకతాళీయమా లేక రామావతారం నిజంగానే బరితెగించిందా?—“అంటే ఆ రామావతారం నన్నేకాక చాలామందిని సాధిస్తోందన్నమాట....” అన్నాను.

“దాన్ని సాధించడమనే అంటారు. అవగా సహకరించే వాళ్ళను సాధించడం....” అని నవ్వాడు కిల్లర్.

“శంభునాథ్ నేరం ఒప్పుకున్నాడా?” అంది రాధ.

“ఒప్పుకునేందుకతడు నేరంచేస్తే కదా!” అన్నాడు కిల్లర్.

“మరెవరు చేశారు?”

“మీ శ్రీవారే చెప్పాలి....”

“నిజంగా నాకేమీ తెలియదు....” అన్నాను. కిల్లర్ వ్యవహారంచూస్తే—అతడు నేను హంతకుడినని నాచేతే ఒప్పించేలాగున్నాడు.

"మీకు తెలియనిది చెప్పొద్దు. తెలిసిందే చెప్పండి.."

"ఏం చెప్పాలి?"

కిల్లర్ వివరించసాగాడు.

రామావతారానికి పెళ్ళికి పూర్వం రమణ్ కుమార్ అనే యువకుడితో పరిచయముంది. రమణ్ కుమార్ ఆమెను మోసం చేశాడు. ఆమెకు పెళ్ళయినా అత డామెను వదలకుండా బెదిరించి అనుభవిస్తున్నాడు. రామావతారం అందుకు మానసికంగా సిద్ధపడిలేదు. కానీ తన కాపురం నిలబెట్టుకోవడంకోసం ఆమె యిష్టంలేని పనిచేస్తోంది. అయితే యే రహస్యమైనా యెన్నాళ్ళో దాగదు.

రామావతారం ఇంటికి రమణ్ కుమార్ వచ్చిపోతున్న విషయం శంభునాథ్ గమనించాడు. వాళ్ళమీద నిఘా వేశాడు. వాళ్ళ సంభాషణను వినడమేకాక పాకెట్ కాసెట్ రికార్డర్లో రికార్డు చేశాడు. అటుపైనుంచి శంభు నాథ్ రామావతారం వెంటబడ్డాడు. తనకు లొంగక పోతే ఆమె భర్తకు నిజం చెప్పేస్తానన్నాడు.

రామావతారం లొంగలేదు. తనలాంటిదాన్ని కాదని వేడుకుంది. రమణ్ కుమార్ని తనకో పీడలా దాపురించా డని వాపోయింది. తన అసహాయత నాధారంగా తీసుకొని వేశ్యగా మార్చవద్దని కోరింది. శంభునాథ్ కరగలేదు.

చివరికామె ఒకరోజున అతణ్ని సాయంత్రం రమ్మన మని చెప్పింది. అతడు వెళ్ళాడు. గదిలో ఆమె పడుకుని వుంది—దుప్పటి కప్పుకొని. దుప్పటి తీసిచూస్తే ఆమె శవముంది!

శంభునాథ్ భయపడ్డాడు. బయటకు వద్దామంటే ఎవరో తలుపులు వేసి బయట్నించి గడియ పెట్టారు.

"అప్పుడు మీరు కల్లోయ, శంభునాథ్ తప్పించుకోవడమేకాక పోలీసులకు ఫోన్ చేశాడు కూడా....." అన్నాడు కిల్లర్.

నేను కిల్లర్ చెప్పేది వింటున్నాను. అంటే ఇతడు మొత్తం నా గురించిన కథంతా తెలుసుకున్నాడన్న మాట!

"ఇప్పుడింతకీ మీరు నాకు చేయాల్సిన సాయమల్లా రామావతారం పూర్వ పరిచయమున్న ప్రేమికుడు రమణ్ కుమార్ మీరేనని! మీరు కాదన్నా శంభునాథ్ టేప్ రికార్డరు ఔనని ఋజువు చేస్తుంది. అవునంటే హంతకుడు మీరు కాదని తేలిపోతుంది...."

"హంతకుడెవరు?"

"ముందు మీరు చెప్పండి. రామావతారం విషయంలో మీరు గతంలో చెప్పిందంతా అబద్ధం. ఆమెను మీరు బ్లాక్ మెయిల్ చేసి ఇష్టంలేని పనికి ఒప్పించారు. అవునా?"

"అవును—...." అన్నాను తలవంచుకుని.

"రామావతారాన్ని ఆమె భర్త చంపాడు. శంభునాథ్ తనింటికి రాకపోకలు చేస్తూండడం గమనించి నిఘా వేసి అతడో రోజున మొత్తం కథ తెలుసుకొని—భార్యను నిలదీసి పూర్తి నిజం తెలుసుకుని—"వాళ్ళిద్దర్నీ రాత్రి ఏడుగంటలకు రమ్మని చెప్పు. అందరిముందూ ఈ సమస్యకు పరిష్కారం చెబుతాను—" అన్నాడు భార్యతో.

ఆ రోజతడాఫీసుకు వెళ్ళినట్లే వెళ్ళి దొడ్డిదారిన తిరిగి వచ్చాడు. చివరసారిగా భార్యతో అన్ని సుఖాలూ పొందాడు. తర్వాత ఆమెను ఒక్కసారి కళ్ళు మూసుకోమన్నాడు. బాకుతో గుండెల్లో పొడిచి—అరవకుండా

నోరు మూశాడు. శంభునాథ్‌ని గదిలో యిరికించి తను వెళ్ళిపోయాడు.

అన్నాళ్ళూ మామూలుగా వుంటూ ఉన్నట్లుండి భార్య పోయిన రోజునే వూరి ప్రయాణం పెట్టుకోవడం చాలా రోజులవరకూ తిరిగిరాకపోవడం తనమీద అనుమానానికి దారితీస్తుందని గ్రహించలేకపోయాడు. ఎందుకంటే అతడు ప్రొఫెషనల్ మర్డరర్ కాదు. ఆవేశం అతణ్ణి హత్యకు పురిగొల్పింది. హత్య చేశాక అతడు పశ్చాత్తాపపడ్డాడు. తిరిగి రాగానే నేనూ, పోలీసులూ ప్రశ్నలు వేసి దబాయించేసరికి నిజం ఒప్పుకొని యేడుస్తూ కూర్చున్నాడు. ఈ కేసులోంచే మీరు బయటపడ్డారు—" అన్నాడు కిల్లర్.

"థాంక్స్!" అన్నాను అప్రయత్నంగా. కానీ ఎందుకో నాకు సంతోషంగాలేదు. రాధవైపు చూశాను. ఆమె అప్పుడే లేచి లోపలకు వెళ్ళింది. తిరిగి వచ్చేసరికి ఆమె చేతిలో నోట్లకట్టలున్నాయి. వందరూపాయల నోట్లకట్టలు ... రెండు .... అంటే మొత్తం యిరవై వేలు...

కిల్లర్ డబ్బు అందుకుని — "థాంక్స్!" అన్నాడు.

"నా భర్తను రక్షించారు. మీ మేలు మరిచిపోలేను" అంది రాధ.

కిల్లర్ మాట్లాడలేదు. తమాషాగా నవ్వి ఓసారి చేయి వూపి వెళ్ళిపోయాడు.

రాధ నావైపు తిరిగింది. రమ్మన్నట్లు నావైపు చూసి ముందుకు నడిచింది. నేనామెననుసరించాను.

ఇద్దరం వెళ్ళి మంచంమీద పడుకున్నాం పక్కపక్కగా.

"తప్పుచేశాను రాధా — నన్ను క్ష మి ం చు...."

అన్నాను.

"మీరు నా నుంచి చాలా దాచారు...."

"ఇంకెప్పుడూ ఏమీ దాచను...."

"థాంక్స్ ఫర్ ది ప్రామిస్...." అంది రాధ. ఆమె మనోహరంగా నవ్వి—"ఒక్కసారి కళ్ళు మూసుకోండి" అంది.

ఆమెను సంతృప్తిపరచడంకోసం యేం చెప్పినా చేయాలి. కళ్ళుమూసుకున్నాను.

"కళ్ళు తెరవండి!" అంది రాధ.

తెరిచాను.

రాధ చేతులు వెనక్కి వున్నాయి. ఆమె ముఖం ఎర్రబడి వుంది.

"ఏ తప్పునైనా నేను క్షమించగలను. సహృదయంతో అర్థం చేసుకోగలను. పరిస్థితుల ప్రభావంవల్ల స్త్రీ అకర ణాన లోనుకావడం పురుషుడికి సహజం. కానీ మీరు రాక్షావతారం జీవితంలో ఆడుకున్నారు. ఆమెపై అత్యాచారం చేశారు. ఆమె హత్యకు మీరే కారణం. ఆమె భర్తను మీరే హంతకుణ్ణి చేశారు...."

"అవును రాధా! ఇంతవరకూ నేను చేసినవన్నీ తప్పులే! నేను రాక్షసుణ్ని. కానీ నువ్వు దేవతవి. నీ సాహచర్యంలో నా రాక్షసత్వం పోతుంది.." అన్నాను.

"నేను దేవతనే కావచ్చు—కానీ రాక్షసుడి సహచారిణిగా చాలాకాలం బ్రతికాను. అది నాలో రాక్షసత్వాన్ని నింపదా?" అంది రాధ.

ఆమె మాటల కర్థం తెలిసేలోగా—ఆమె రెండు చేతులూ ముందుకు వచ్చాయి. ఆ చేతుల్లో కత్తి వుంది. నేను కదిలేలోగా ఆ కత్తి నా గుండెల్లో దిగబడింది.

## 47

కెవ్వుమని అరిచాను.

"నిన్ను ప్రేమించడం జీవితంలో నేను చేసిన పెద్ద తప్పు. ఆ తప్పునిప్పుడే సవరించుకున్నాను. నాకిప్పుడే సంతోషంగా వుంది...." అంటూ నవ్వుతోంది రాధ.

నన్ను రక్షించడానికి కిల్లర్‌ని నియమించిన రాధ, మరో స్త్రీతో నేను అనుభవం పంచుకున్నా సహిస్తానన్న ప్రేమమూర్తి రాధ..తనే నన్ను అంతం చేసింది..

ఇంకా ఏమో అనిపించేలోగా నా కళ్ళు మూతలు పడ్డాయి.

—:అయిపోయింది:—

# శిథిల గృహాలు

## ఎమ్. డి. చైతన్య

సాయంత్రం ఐదు గంటలు దాటింది.

బుచ్చిరాములుగారు తన భార్య శాంతాదేవి, ఒక్కగా నొక్క కూతురు దుర్గతో హైద్రాబాదులో ఒక పెళ్ళికి అటెండు కావడానికి హడావుడి పడుతున్నారు.

సామాన్లు సర్దుకోవడం పూర్తి అయింది.

డ్రైవరు గ్యారేజీలో నుంచి కారుతీసి — బయట పెట్టాడు.

దుర్గకు సంతోషంగా వుంది. హైద్రాబాదు ప్రయాణమంటే — ఆమెకు చాలా ఇష్టం.

దుర్గ మనస్సు ఆనందంతో సముద్ర తరంగాల్లా ఉవ్వెత్తున ఎగిసి పడుతోంది.

ఆ ప్రయాణం తన జీవితంలో సముద్రమంత విషాదాన్ని తెచ్చి పెట్టనున్నదని ఆమెకు తెలియదు.

ఆమెకే కాదు బుచ్చిరాములుగారికి — శాంతాదేవికి కూడా తెలియదు.

తెలిస్తే బహుశా వాళ్ళు ఆ ప్రయాణం చెయ్యరు.

భవిష్యత్తులో జరిగే కొన్ని విషయాలు మనిషికి ముందే తెలిస్తే ఆ జీవితం నరకసదృశం.

అందుకే మనిషికి తన భవిష్యత్తు తెలుసుకొనే ఏర్పాటు చేయలేదేమో భగవంతుడు.

దూరదర్శన్ లో "ప్రయోజన విద్యా కార్యక్రమం" ప్రసారమౌతుంది. అప్పుడు సమయం సాయంత్రం 7-30.

దుర్గ టి.వి. ఆఫ్ చేసింది.

తలుపులు, కిటికీలు మూసేసి తాళం వేసి—బయటికొచ్చారంతా.

కాసేపట్లో మగ్గురూ వచ్చి కార్లో కూర్చున్నారు.

కారు కదిలింది.

పెళ్ళి తెల్లవారుఝామున అయిదు గంటల ఇరవై నిమిషాలకుంది.

రెండుగంటలు ప్రయాణంచేస్తే వాళ్లు తమ గమ్యాన్ని చేరుకోగలుగుతారు.

ఊరు దాటి కారు వేగంగా పోతుంది.

ఉన్నట్టుండి ఆకాశం మేఘావృతమైపోయింది. ఉరుములు, మెరుపులు—అంతా కటిక చీకటి. కుండపోతగా వర్షం ప్రారంభమైంది.

దుర్గ జీవితం విషాదభరితం కాబోతుందని ప్రకృతిమాతకు ముందే తెలిసినట్టుంది.

ఆకాశం జాలిలో కన్నీటిని కారుస్తుందా?

ప్రకృతిలో వచ్చిన అకస్మాత్తు మార్పుకు కారులో ప్రయాణం చేస్తున్న బుచ్చిరామలుఁగారు అతని కుటుంబ సభ్యులు పెద్దగా కలత చెందినట్లు లేదు.

కారులో వర్షపు నీటిబిందువులుకూడా జొరబడే అవకాశంలేదు. కాబట్టి వాళ్ళు సుఖంగా ప్రయాణం చేయగల్గుతున్నారు.

కారు అద్దాలమీద రెండు వైపర్లు నిర్విరామంగా తిరుగుతూ డ్రైవరుకు దారిచూపిస్తున్నాయి.

కారు వేగంగా ప్రయాణిస్తుంది.

గంటన్నర ప్రయాణం తర్వాత కారు హైద్రాబాదు సమీపానికి వచ్చింది.

అల్లంత దూరాన రేడియో టవర్లకున్న ఎర్రని లైట్లు వెలుగుతూ యే ఆధారం లేకుండా ఆకాశంలో వ్రేలాడుతున్నాయా? అన్న అనుభూతిని కలిగిస్తున్నాయి.

చీకటి మూలాన స్తంభాలు కనిపించడంలేదు.

కనుచూపుమేర లక్షలాది విద్యుద్దీపాలు దేదీప్యమానంగా వెలుగుతూ — కాంతి సముద్రంలా వెలిగిపోతుందా నగరం.

ఏ చక్రవర్తో తన లక్షలాది సైనికులతో కాగడాలతో విడిది చేసాడా అన్న అనుభూతి కలుగుతోంది.

ఎదురుగా సర్దార్జీ లారీ ఒకటి మృత్యుదేవతలా పరిగెడుతూ వస్తోంది. సర్దార్జీ నిద్రకళ్ళతో డ్రైవ్ చేస్తున్నాడు.

కారు డ్రైవరు చాకచక్యంగా కారును రోడ్డు దించి అదే వేగంతో మళ్ళీ రోడ్డెక్కించబోయాడు.

రోడ్డు ఎడ్జ్ ఎత్తుగా వుండడం మూలాన — కారు రోడ్డెక్కే ప్రయత్నంలో అరడజను పల్టీలుకొట్టి ప్రక్కనే వున్న ఒక గుంటలో పడిపోయింది.

కారులో హాహాకారాలు మిన్నుముట్టాయి.

డ్రైవర్‌తో సహా, అసిస్టెంటు ఇంజనీరు బుచ్చిరాములు,

భార్య శాంతాదేవి — మృత్యువుతో హోరాహోరీ పోరాడి అక్కడికక్కడే తమ అంతిమ శ్వాసను విడిచారు.

దుర్గ గాయాలతో బ్రతికి బయటపడింది.

## 2

మధ్యాహ్నం మూడు గంటలు.

ఉస్మానియా జనరల్ హాస్పిటల్.

ఆ రోజు దుర్గను హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ చేసారు. ఆమెను ఇంటికి తీసుకెళ్ళడానికి సురేష్ వచ్చాడు.

సురేష్—దుర్గకు స్వయాన మేనమామ. ముప్పయి ఏళ్ళుంటాయి. చెడు తిరుగుళ్ళు తిరుగుతుంటాడని టాక్ వుంది. అబిడ్స్‌లో పెద్ద ఫర్నిచర్ షాపుకు ఓనర్. అత స్వార్తుగా డబ్బుగలవాడయ్యాడు.

దుర్గకు వైద్యం చేసిన డాక్టర్లకు, సపర్యలు చేసిన నర్సులకు కృతజ్ఞతలు చెప్పి, ఆమెను తీసుకొని హాస్పి టల్‌లో నుంచి బయటకొచ్చాడు.

వాళ్ళకోరకు కారు సిద్ధంగా వుండి. డ్రైవరు డోరు తెరచి నిల్చున్నాడు. వెళ్ళి కార్లో కూర్చున్నారు వాళ్ళు.

కారు ముందుకు సాగింది.

కాసేపు నిశ్శబ్దం!

"అంకుల్, నేను మా ఊరు వెళ్ళిపోతాను."

సురేష్ ఆశ్చర్యపోయాడు.

"మీ ఊరు వెళ్తావా? వెళ్ళి ఏం చేస్తావు? అసలు అక్కడ యెవరున్నారని?"

దుర్గ దిగాలు పడిపోయింది. నిజమే! తనకు ఆ వూళ్ళో యెవరూ లేరు. తల్లిదండ్రులు కారు ప్రమాదంలో మర ణించారు. బంధువులుకూడ లేరు ఆ వూళ్ళో.

తను ఏం చేయాలి? ఎలా బ్రతకాలి? అన్న ప్రశ్నలు

ఆమెను వేధిస్తున్నాయి.

దుర్గ టెంత్ ఫస్ట్‌క్లాసులో పాసయ్యేనట్లు మొన్ననే రిజల్ట్స్ వచ్చాయి. ఇంటర్‌లో చేరుదామనుకుంది. కానీ-ఇంతలో అనుకోనివిధంగా తమ కుటుంబం అంతా కారు ప్రమాదంలో పోవడంతో—ఆమెకు దిక్కు తోచడంలేదు.

"అంకుల్, నువ్వన్నట్లు నేను వూరికి వెళ్ళి చేసేదేమీ లేదు. నాకు ఇక్కడే ఏదైనా ఉద్యోగం చూసిపెట్టు. అది చేసుకుంటూ కాలం గడుపుతాను" అంది.

"నువ్వు ఉద్యోగం చేయాల్సిన అవసరంలేదు. మీ నాన్న తాలూకు ప్రావిడెంటుఫండు, ఫ్యామిలి బెనిఫిట్ ఫండు వగైరాలు యాభై వేల వరకు వచ్చే అవకాశముంది. నువు మేజర్ అయ్యేంతవరకు నీకు ఫ్యామిలీ పెన్షన్ వస్తుంది—ఇవే కాకుండా పాతిక లక్షల స్థిరాస్థి కొండంత మామయ్య నీ అండన వున్నాడు. ఎందుకు నీకు బ్రతుకు భయం!"

దుర్గ మనసులో ఆశ చిగురు తొడిగింది.

నిజానికి తనకు ఈ వివరాలేమి తెలియవు. తెలిసిన తర్వాత యేదో మానసిక బలం చేకూరినట్లు అనిపించింది.

దుర్గకు లోకజ్ఞానం బొత్తిగా లేదు పుస్తక పరిజ్ఞానం తప్పించి.

ఆ పుస్తకాల వలన ఆమెకు తెలిసిందేమంటే డబ్బుకు అత్యంత ప్రాముఖ్యం వుందని, అది లేకపోతే—మనుగడ చాలా కష్టంతో కూడుకున్న పని—అని ఆమె అర్థం చేసుకుంది.

కారు వేగంగా వెళ్తోంది.

దుర్గ వీధులను, షాపులను, మనుష్యులను, యాంత్రికంగా చూస్తోంది. కానీ-ఆమె మనస్సు తన భవిష్యత్తు ఎలా

ఉండబోతుందో అన్న సమస్యకే ప్రాధన్యత నిస్తోంది.

దుర్గ తన భవిష్యత్తును రకరకాలుగా వూహించు కుంటుంది.

కారు బంజారా హిల్స్‌లో వున్న సురేష్ భవనం ముందు ఆగింది.

డ్రైవర్ కారు ఆఫ్ చేసి-డోర్ తెరిచి నిలబడ్డాడు. ముందు సురేష్, వెనకాల దుర్గ కారు దిగారు.

సురేష్ ఇంట్లోకి దారితీసి—దుర్గను సాదరంగా ఆహ్వానించాడు.

అది రెండంతస్థుల పెద్ద మేడ.

లెక్కలేనన్ని గాజుకిటికీలు వున్నాయి. క్రిందా మీదా మొత్తం రెండు డజన్లకు పైగా పెద్ద పెద్ద అందమైన గదులున్నాయి పెద్ద హాలు, మధ్యలో షాండిలియర్ వ్రేలాడుతోంది. గోడలకు ఖరీదైన పెయింట్స్ వేసి వుంది. ఫ్లోర్ అంతటా కాస్ట్లీ కార్పెట్ ఒకటి పరచి వుంది. అందమైన సోఫాలున్నాయి. మేడమీదికి రెండు వైపులనుండి మెట్లు వున్నాయి. మెట్లమీద యెర్రని తివాచి.

అంత పెద్ద భవనంలో యెవరూ కనిపించక పోవడం దుర్గకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

సురేష్ మేడమీదికి తీసుకెళ్ళాడు దుర్గను.

ఓ గది తలుపులు తెరిచి—"ఈ గది నీది" అన్నాడు.

ఆ గది చాలా అద్భుతంగా వుంది.

గదినిండా తివాచి. రెండు పెద్ద సోఫాలు. ఏ.సి. సౌకర్యం వుంది. ఎటాచ్‌డ్ బాత్‌రూం వుంది.

వీటన్నింటిని మించి—అందమైన నగిషీలు చెక్కిన

పెద్ద పేక మంచం. దానిమీద అందమైన మెత్తని పరుపు, రంగు రంగుల బెడ్ షీట్, లావుపాటి పిల్లోలు వున్నాయి. ఆ గది అచ్చం రతీ మన్మథుల బెడ్ రూంలా వుంది. ఆ పందిరిమంచాన్ని చూడగానే—కామనాడులు ప్రకోపించేంత సెక్సీగా వుంది.... దానికి తోడు గది అంతా సువాసన వెదజల్లుతోంది. బహుశా మంచంమీద పెర్ ఫ్యూమ్ చల్లివుంటారు. గోడలకు అందమైన లతల్తో వట వృక్షాలతో కూడుకున్న పెద్ద పోస్టర్ అంటించి వుంది. మరోవైపున మినియేచర్ దృశ్యం.

"ఈ గది నీదే! ఎలా వుంది?" రెండవసారి అన్నాడు, సురేష్ ఆమెవైపు చూస్తూ.

"ఫర్వాలేదు బాగానే వుంది" అన్నది దుర్గ.

సురేష్కు ఆమె అలా అనడం యెందుకో నచ్చలేదు.

"అద్భుతంగా వుంది" అంటే బహుశ సంతోషించే వాడేమో.

అవుడే ఓ యాభై ఏళ్ళ ముసలతను "దండాలు బాబు!" అంటూ వచ్చాడు.

"ఆఁ నమస్తే, రంగయ్య తాత! నేను ప్రొద్దున్నే చెప్పానే దుర్గ మనింటికి వస్తుందని—ఈమే దుర్గ."

"దండాలు తల్లి!" అని చేతులు జోడించాడు.

దుర్గ యాంత్రికంగా చేతులు జోడించింది.

"ఇతను, రంగయ్య తాత అని వంట చేస్తూ వుంటాడు. ఏ వంట కావల్సివచ్చినా, ఏది తినాలనువున్నా ఇతన్నడుగు—నీకు క్షణాల్లో తెచ్చిపెడ్తాడు" అంటూ పరిచయం చేశాడు సురేష్.

"అంకుల్! ఇంత పెద్ద భవనంలో ఎవ్వరూ కనిపించ రేమిటి?" ఆశ్చర్యంతో చూస్తూ అడిగింది.

సురేష్ నవ్వాడు—

"ఎవ్వరూ యెందుకు లేరూ? నేనున్నాను, రంగయ్య తాత వున్నాడు."

"మరి లావణ్య అత్తయ్య కనిపించదేమిటి?"

సురేష్ ముఖం గంభీరంగా మారిపోయింది.

"ఆమె నాతో తెగతెంపులు చేసుకోవడానికి ప్రయత్నిస్తోంది. విడాకులకోసం కోర్టులో దావా వేసింది."

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది.

"నేను ఆమెకు నచ్చలేదట."

"నువ్వు బాగానే వున్నావుగా?"

"బాగానే వున్నాను. నా ప్రవర్తన బాగాలేదట."

దుర్గ సురేష్ వైపు చూస్తూ మౌనంగా వుండిపోయింది.

"నువ్వు స్నానం చేసిరా!"

"స్నానమా? ఎలా చెయ్యను. కాలుకు బ్యాండేజీ వుందిగా!"

"కాలు తడవకుండా చేయి."

దుర్గ మారు మాట్లాడకుండా బాత్‌రూంవైపు దారి తీసింది.

## 3

దుర్గ కాలుకు తగిలిన గాయం పూర్తిగా తగ్గిపోయింది. ఆమె పూర్తి ఆరోగ్యాన్ని సమకూర్చుకుంది.

దుర్గ అందంగా తయారై సురేష్ కొరకు యెదురు చూస్తూ కూర్చుంది. ఈ వేళ తన పుట్టిన రోజు. సురేష్ తనను సాయంత్రం ఫస్ట్ షో సినిమాకు తీసికెళ్తానని చెప్పాడు.

సాయంత్రం అయిదుగంటల యాభై అయిదు నిమిషాలు. సురేష్ ఇంకా రాలేదు.

దుర్గ హాల్లో అసహనంగా కూర్చుంది.

ఆకాశవాణి ఉర్దూలో ప్రాంతీయ వార్తలను ప్రసారం చేస్తోంది.

దుర్గకు ఉర్దూ సరిగ్గా అర్థంకాదు. అయినా ఎన్.టి. రామారావు తిరిగి ముఖ్యమంత్రిగా ఆ రోజు మధ్యాహ్నం మూడున్నర గంటల ప్రాంతంలో ప్రమాణ స్వీకారం చేశారని చెప్తున్నాడని అర్థం చేసుకోగలిగింది.

నగరంలో అల్లర్ల మూలంగా కర్ఫ్యూ కొనసాగుతుందని చెప్తున్నాడు.

కర్ఫ్యూ వుంటే తాము సినిమాకు వెళ్ళడం యెలా కుదురుతుంది? అంకుల్ ఇంకా రాలేదేమిటి? దుర్గ ఆలోచిస్తూ కూర్చుంది.

బయట కారు హారన్ శబ్దం వినిపించింది.

"హమ్మయ్య, అంకుల్ వచ్చాడన్నమాట!" దుర్గ తృప్తిగా నిట్టూర్చింది.

సురేష్ కారు దిగి ఇంట్లోకి వచ్చాడు.

"ఏమిటి అంకుల్ ఇంత ఆలస్యం చేశావు?" గారాబంగా అడిగింది దుర్గ.

"అంతటా కర్ఫ్యూ చేసారు. ఇవేళ మనం సినిమాకు వెళ్ళడం కుదరదు!" అన్నాడు.

"అదేం కుదరదు! ఇవేళ ఎలాగైనా సినిమా చూడాలి, తప్పదు."

"ఎలాగైనా చూడాలంటే ఒకటే మార్గం, నా దగ్గర ఒక క్యాసెట్టు వుంది. వీడియో సినిమా చూద్దాం!"

"ఏం సినిమా?" ఉత్సాహంగా అడిగింది.

"బ్లూ ఫిలిం!" అన్నాడు సురేష్.

"బ్లూ ఫిలిం అంటే నీలవర్ణం సినిమానా?" అమాయ

కంగా అడిగింది.

సురేష్ ఆశ్చర్యపోయాడు. దుర్గకు బ్లూ ఫిలిం అంటే కూడా తెలియాదా?

"ఏదో ఒకటి, చూద్దామా? చూద్దామంటే వేస్తాను" అన్నాడు.

"ఊఁ చూద్దాం.... చూద్దాం..." అన్నది దుర్గ.

"పద" వాళ్ళిద్దరూ వీడియో వున్న గదిలోకి దారి తీసారు.

సురేష్ క్యాసెట్టును వీడియోలో పెట్టాడు. లైట్లు ఆర్పేసాడు. ఆ గది అంతా చీకటి అయిపోయింది. వీడియో ఆన్ చేసాడు.

వీడియో తెరమీద వెలుగు ప్రసరితమైంది.

అక్షరాలు పడుతున్నాయి.

నటీనట వర్గం, సాంకేతిక వర్గం, వివరాలు పడుతున్నాయి. నటీనటులంతా తెలుగువాళ్ళే, కొందరు ప్రముఖ తెలుగు సినిమా హీరోయిన్‌లూ కూడా వున్నారందులో.

తెరమీద అక్షరాలు మాయమయ్యాయి.

దృశ్యాలు మొదలయ్యాయి.

అదొక అడవి ప్రాంతం....

పదిమంది యువతులు, యువకులు యవ్వన బింకంలో వయసు పొంగులతో అలరారుతున్నారు. అంతా అర్ధ నగ్నంగా సెక్సీగా వున్నారు.

ఆ గుంపు అంతా కలసి ఒక ఆట ఆడటానికి నిర్ణయించుకున్నారు. అందులో ఒక యువతీ మరొక యువకుడుంటారు. చీటీలు వేసి ఆ యువతీ యువకుల జంటను ఎన్నిక చేసారు. వాళ్ళిద్దరూ నగ్నంగా ఆ అడవిలో

పరుగెత్తాలి.

ఆ ఇద్దరు యాంత్రికంగా తమ దుస్తులను పూర్తిగా విడిచి నేకెడ్ అయిపోయారు. వాళ్ళు చాలా ఎత్తుగా చెక్కిన అజంతా శిల్పాల్లా వున్నారు—బంగారు మేని ఛాయ కలిగి వున్నారిద్దరూ.

ఆ యువతి వయ్యారంగా కెమెరా ముందుకు వస్తోంది. దృశ్యం అంతకంతకూ క్లోజ్ అప్‌లో కనిపిస్తోంది. కెమెరా ఆ యువతి శరీర భాగాలన్నింటిని వదిలి జఘన సీమను తన ధ్యేయంగా పెట్టుకుంది.

తెర నిండా అదే దృశ్యం.

పైన ఫ్యాన్ తిరుగుతుంది. దుర్గ పూర్తిగా చెమటతో తడిసిపోయింది. ఆమెకు ఆ దృశ్యం చూడాలో, చూడ కూడదో అర్థంకాక మీమాంసలోపడి-అలాగే చూస్తోంది. అటువంటి చిత్రాన్ని ఆమె ఇంతవరకు చూడలేదు.

తర్వాత ఆ యువకుడు కెమెరావైపు నడుస్తున్నాడు. క్లోజప్‌లోకొచ్చాడు.

దృశ్యం మారింది.

మరో యువకుడు ఒకటి.... రెండు.... అంటూ లెక్కి స్తున్నాడు.

నగ్న యువతి పరుగెత్తడం మొదలెట్టింది.

కెమెరా ఆమె ముందు భాగాన్ని చిత్రీకరిస్తోంది. మిడ్ ఆఫ్‌లో పరుగెడుతున్నపుడు బరువైన వక్షోజాలు గమ్మత్తుగా యెగురుతున్నాయి. కెమెరామెన్ దృష్టి అంతా అక్కడే వుంది.

దృశ్యం మారింది.

యువకుడు తొమ్మిది....పది....అన్నాడు.

నగ్న యువకుడు పరుగెత్తడం మొదలుపెట్టాడు.

ఆమెను ఛేజ్ చేసి—ఆమెతో ఇంటర్ కోర్స్ సల్పాలి. అదే కార్యక్రమం.

పార్కులో వున్న వాళ్ళంతా బైనాక్యులర్స్‌తో ఆ దృశ్యాన్ని చూస్తున్నారు.

యువకుడు ఒలంపిక్ పరుగుపందెంలో పాల్గొంటున్నట్లు పరుగెత్తి నిమిషంలో ఆ యువతిని పట్టుకున్నాడు.

ఆ యువతి ఓడిపోయినట్లుగా ఒప్పుకొని — నవ్వుతూ ప్రక్కనే వున్న ఇసుకతిన్నెలో వెల్లకిలా పడిపోయింది.

కెమెరా దృశ్యాలను క్లోజప్‌లో చూపిస్తోంది.

సురేష్ దుర్గవైపు చూశాడు. చీకట్లో ఆమె ముఖం కనిపించీ కనిపించకుండా, కనిపిస్తోంది. దుర్గ పెద్దగా ఉచ్ఛ్వాస నిశ్వాసలను చేస్తోంది. తెరమీద కనిపించే దృశ్యాలకు రెస్పాన్సుగా ఆమె బ్రెస్ట్ ఉబ్బుతూ తగ్గుతూంది. ఆమె సన్నగా వణుకుతోంది.

కెమెరా గ్లాసు పలక క్రింది నుండి క్లయిమాక్స్ దృశ్యాలను చిత్రీకరిస్తోంది.

సురేష్ దుర్గ భుజాలమీద చేయి వేసాడు. దుర్గ ఉలిక్కిపడింది.

సురేష్ తన చేతులతో ఆమెను కౌగిట్లో బంధించి, తన నోటితో ఆమె పెదాలను చుంబించబోయాడు.

దుర్గ గింజుకుంది.

"అంకుల్, ఏమిటిది?" అంది కోపంగా.

"అబ్బె యేమీ లేదు. నాకలా చేయాలనిపించింది. అంతే!"

"అలా చేయడానికేనా, నాకీ సినిమా చూపిస్తోంది" కోపంగా అంది దుర్గ.

"నో! అలా చేయాలంటే, నీకు సినిమాయే

చూపెట్టాల్సిన అవసరంలేదు. కాకపోతే నిన్ను ముద్దు పెట్టుకోవడానికి సినిమాలోని దృశ్యాలు ప్రేరేపించాయి!"

"అలా అయితే సినిమా ఆపుచేయి అంకుల్. నేను చూడను—" అంటూ లేచింది దుర్గ.

"రైట్, అలాగే దుర్గా!" అంటూ సురేష్ వీడియో స్విచ్ ఆఫ్ చేసి—గదిలో లైటు వేశాడు.

అంతవరకు చీకటి రాజ్యమేలుతున్న గదిలో—వెలుగు ఆక్రమించుకుంది.

# 4

ఉదయం ఆరు గంటలు.

దుర్గ స్నానంచేసి ఆకాశం రంగు అంగా అదే రంగు బ్లౌజు, ఓణీ ధరించి—పూజ చేసుకొని—టేప్ ఆన్ చేసింది.

"కౌసల్యా సుప్రజారామా పూర్వా సంధ్యా
ప్రవర్తతే!"

అంటూ సుప్రభాతం మృదుమధురంగా ఆ భవనం అంతా వినిపిస్తోంది.

పాలవాడిచ్చే పాలు తీసుకొని—

వంటింట్లోకి నడిచింది.

గ్యాస్ స్టౌ ఆన్ చేసి—క్షణాల్లో రుచికరమైన కాఫీ తయారుచేసింది. తను కప్పులో పోసుకొని త్రాగి—మరో కప్పు సురేష్‌కోసం అతని గదిలోకి పట్టుకెళ్ళింది.

సురేష్ ఇంకా నిద్రపోతున్నాడు.

రాత్రి అతను త్రాగిన గుర్తుగా — విస్కీ-బాటిల్స్, జీడిపప్పు ప్లేటు, ఐస్ సాసర్ టీపాయ్‌మీద వున్నాయి.

దుర్గ వాటివైపు ఒక్క క్షణం చూసి, సురేష్‌వైపు

దృష్టి మరల్చింది.

"అంకుల్ ....అంకుల్!" గట్టిగా పిలిచింది.

సురేష్ కళ్ళు తెరిచాడు.

ఎదురుగా దుర్గ నిల్చొని వుంది. ఆమె చేతిలో కాఫీ కప్పు.

చటుక్కున లేచి కూర్చున్నాడు.

"గుడ్ మార్నింగ్ అంకుల్, కాఫీ త్రాగు!" అంటూ చేతిలో పెట్టింది.

నవ్వుతూ గుడ్‌మార్నింగ్ చెప్పి—కాఫీ కప్పు అందుకుంటూ చేతిగడియారం చూసుకున్నాడు.

ఆరున్నర —

"ఇంకా ఆరున్నరేనా? నేను ఈ సమయంలో మంచి నిద్రలో వుంటాను. సరిగ్గా ఎనిమిదింటికిగాని లేవను" అంటూ కాఫీ సేవించాడు.

సురేష్ కప్పు ప్రక్కన పెట్టి—మళ్ళీ నిద్రకుపక్రమిద్దామనుకున్నాడు.

కానీ-ఎదురుగా దేవతలా వున్న దుర్గను చూస్తుంటే అతనికి నిద్ర ఎగిరిపోయింది.

రాత్రి జరిగిన సంఘటనను దుర్గ పూర్తిగా మరిచిపోయినట్లు కనిపిస్తోంది.

ఆ విషయం సురేష్‌కు సంతోషం కలిగించింది.

"దుర్గ, ఇవేళ బిజినెస్ పనిమీద నేను నాగార్జున సాగర్‌కు వెళుతున్నాను. నువ్విక్కడే వుంటావ ? లేక నాతో వస్తావా?" వస్తే బావుండును అని మనసులో అనుకున్నాడు.

నాగార్జున సాగర్ అనగానే దుర్గ మనస్సు ఆనందంతో నాట్యం చేసింది.

"నేను వస్తాను. సాగర్ చూడాలి, బావుంటుంది కదా?"

"అవును బావుంటుంది. పది గంటలకల్లా తయారవ్వు. వ్యాన్ బయలుదేరుతుంది."

దుర్గ తల వూపి టీ కప్పు తీసుకొని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

సురేష్ ఆవులించి ముసుగుతన్ని పడుకున్నాడు.

తొమ్మిదింటికి యాదగిరి వ్యాన్ తీసుకొని వచ్చాడు.

అపుడు దుర్గ తయారై తీరిగ్గా ఫిలిం ఫేర్ తిరిగేస్తూ కూర్చుంది.

"గుడ్ మార్నింగ్, మేడమ్" అంటూ విష్ చేశాడు.

దుర్గ తలెత్తి చూసింది.

ఎదురుగా యాదగిరి-నవ్వుతూ విష్ చేసింది. యాదగిరి డ్రైవరే కాదు. సురేష్‌కు ప్రాణమిత్రుడు కూడా.

"గురువుగారేరి?"

"లోపల వున్నారు!" పడక గది చూపించింది.

"ఇంకా నిద్ర లేచారా, లేదా? సాగర్ వెళ్ళాలని చెప్పారు" అంటూ బెడ్‌రూం వైపు దారితీసాడు.

సురేష్ ఇంకా నిద్రపోతూ కనిపించాడు.

యాదగిరి గట్టిగా పిలిచాడు.

సురేష్ ఉలిక్కిపడి లేచాడు_యాదగిరి విష్ చేసాడు.

"ఓరి నువ్వా! నేనేదో కలగంటున్నాను. ఆ కలలో యెవరో నన్ను గురుగారూ....గురుగారూ అని పిలుస్తున్నారు. కల చెదిరింది!"

"కల గన్నారా! తెల్లవారుఝామున కన్న కలలు నిజమౌతాయి అంటారు, ఏమిటి గురూ ఆ కల?"

సురేష్ వదనం ఆనందంతో వెలిగిపోయింది.

"నిజంగానా? మొత్తానికి మాంచి కలే! కలేమిటో తర్వాత చెప్తాను" అంటూ లేడిలా చెంగున బెడ్ మీది నుంచి లేచి బాత్రూంలకమ్ లెట్రిన్ లోకి దూరాడు.

యాదగిరి వెళ్ళి దుర్గతో కబుర్లు చెపుతూ కూర్చున్నాడు.

సురేష్ ఇరవై నిమిషాల్లో కాలకృత్యాలు ముగించుకొని హాల్లోకి వచ్చాడు.

రంగయ్య తాత వచ్చి వాళ్ళను భోజనానికి పిలిచాడు.

వాళ్ళంతా భోజనానికి లేచారు.

తను భోజనం చేసానని చెప్పినా—సురేష్ బలవంతం మీద యాదగిరి మళ్ళీ కూర్చున్నాడు.

రంగయ్య తాత చాలా రుచికరమైన వంటలు చేసాడు.

కోడి మాంసం చిప్స్, కోడిరోస్టు, గుమ్మడి పువ్వు పకోడి, జాంగ్రీ చేసాడు.

వంటలు బావున్నాయి అని మెచ్చుకుంటూ తిన్నారంతా.

ఉదయం పది గంటలు—

కావల్సిన సామాన్లు సర్దుకొని—దుర్గ, సురేష్ వ్యాన్ ఎక్కారు.

ఒంటి గంట ప్రాంతంలో వ్యాన్ సాగర్ చేరింది.

రిజర్వాయర్ లో సమకూరివున్న అపారమైన జలరాశిని చూసి దుర్గ మనసు ఆనందంతో ఉత్తుంగ తరంగంవలె ఎగిసిపడింది.

మానవ మేధస్సుకు ప్రతీకగా నిల్చిన ఈ మెషనరీ డ్యామ్‌ను చూసి మానవ దేవాలయం అని నెహ్రూ అన్న మాటలు గుర్తొచ్చాయి.

ఆంధ్ర, తెలంగాణాల్లో ఎన్నో ప్రాంతాలు సస్య

శ్యామలమయ్యాయి.

పాలాలనన్నీ

హాలాల దున్ని

ఇలా తలాలో హేమం పండగ

జగానికంతా సౌఖ్యం నిండగా....

చటుక్కున మహాకవి గేయం గుర్తువచ్చిందామెకు.

ఔను! భారత దేశమంతటా ఇలాంటి దేవాలయాలను విరివిగా నిర్మిస్తే, ఆయన ప్రతిజ్ఞ నెరవేరి నిత్య మంగళం నిర్దేశిస్తూ, స్వర్ణ వాద్యములను సంరావించనూవచ్చు అను కుంది.

విజయ్ విహార్ గెస్టు హౌస్‌లో రెండు రూములను బుక్ చేసారు.

గెస్టుహౌస్ గదులు బాగా నచ్చాయి దుర్గకు.

గదిలో కూర్చొని నదీ సౌందర్యాన్ని ఆస్వాదించవచ్చు. అపారమైన ఆ జలరాశి మధ్యలో పెద్ద పెద్ద పర్వతాలు పూర్తిగా మునగక తాము మానవజాతి అభ్యుదయానికి తమనుతాము త్యాగాన్ని చేస్తున్నామన్నట్లు— కొద్దికొద్దిగా తలలు పైకెత్తి చూస్తున్నాయి. అక్కడక్కడ చిన్న చిన్న బుట్టపడవల్లో నీళ్ళల్లో వున్న కొండల్లోకి వెళ్ళి యేవో సరుకులు తెచ్చుకుంటున్నారు.

కవిత్వంలో, శిల్పంలో, పురుగులో, పుష్పంలో, మెరుపులో, మేఘంలో, మనిషిలో సౌందర్యం ఆరాధించే దుర్గకు కృష్ణవేణిని చూస్తుంటే దివ్యానుభవం కలుగుతోంది.

పొడవాటి గాజు అద్దాల్లో నుంచి తదేకంగా నదిలోకి చూస్తున్న దుర్గను సమీపించి—"ఏమిటిలా చాలా సేపట్నుంచి చూస్తున్నావ్!" అన్నాడు సురేష్.

దుర్గ వులిక్కిపడి చూసి—"అంకుల్ ఇక్కడ్నుంచి నదిని చూస్తుంటే—అబ్బ ఎంత సౌందర్యంగా వుందో కదా! అంత జలరాశిలోను అలలు లేకుండా ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్న మౌన మునిలా యోగంలో వున్నదది, అందులో అక్కడక్కడ బుట్టపడవలు, చుట్టూ పహారాకాస్తున్న సైనికుల్లా కొండలు. ఎంత మనోహరంగా వుంది కదూ!" అన్నది పరవశించిపోతూ.

సురేష్ ఆమెవైపు జాలిగా చూసి—"ఆఁ మామూలుగానే వుంది ఇందులో పెద్ద గొప్పేం వుంది!" అన్నాడు చప్పరిస్తూ.

దుర్గ అతనివైపు విచిత్రంగా చూసింది.

తనలో సౌందర్యం లేనపుడు, సౌందర్యంకోసం ప్రపంచం అంతా వెతికినా ఎక్కడ కనపడదట. బహుశ ఇలాంటి వ్యక్తికే అయి వుండవచ్చు అనుకుంది.

దుర్గ అక్కడ్నుంచి లేచి వచ్చి సోఫాలో కూర్చుంది.

"సాగర్ అంతా యెపుడు చూద్దాం అంకుల్!" అడిగింది.

"ఇవేళ కుదరదు రేపు చూద్దాం!" అన్నాడు యేదో ఆలోచిస్తూ.

ఇంతలో యాదగిరి ఏ.పి. ట్రావెల్స్ అండ్ టూరిజం డిపార్టుమెంటు క్యాంటిన్ లోనుంచి భోజనాలు తెప్పించాడు.

బోయ్ వచ్చి—చీని ప్లేట్లల్లో మూడు భోజనాలు తెచ్చిపెట్టాడు.

భోజనం పర్వాలేదు బాగానే వుంది.

ముగ్గురూ ఆత్రంగా తిన్నారు. అప్పటికే భోజనం సమయం దాటి ఒక గంట అయింది.

భోజనాలయ్యాక త్వర త్వర గా సురేష్ బట్టలు మార్చుకొని "దుర్గా! నువ్వేదైన చదువుకుంటూ కాల క్షేపం చేయి. నేను మళ్ళీ సాయంత్రం 6 గంటలకు వస్తాను. ఒకే, యాదీ నన్ను పైలాన్ దగ్గర వదిలిపెట్టి తిరిగి నువ్వు విజయ విహార్ వచ్చేసేయ్. నేను సాయంత్రం ఏ ఆటోలోనో వచ్చేస్తాను" అన్నాడు.

ఇద్దరూ గబగబా రూంలోనుంచి బయటికి వచ్చేసారు.

సురేష్ మాటిమాటికి గడియారం చూస్తూ వుండడం కొంత ఆశ్చర్యాన్ని కలిగించింది యాదగిరికి.

వ్యాన్ కదిలింది—

హిల్ కాలనీ మీదుగా—పైలాన్ స్థంభం దగ్గరకు వ్యాన్‌ను తీసుకొచ్చి సురేష్‌ను వదిలేసాడు.

ఏదైనా వ్యాపారం పనిమీద ఊరెళ్ళితే వారిద్దరూ కలిసి వెళ్లారు, కానీ—ఇప్పుడు అలా కాకుండా అత నొక్కడే వెళ్ళడం యాదగిరికి ఆశ్చర్యం కలిగించింది.

వ్యాపారం పనిమీద వెళ్ళడం లేదని అతను అర్థం చేసుకున్నాడు.

అతను డ్యాం దగ్గర ఒక రిక్షా బేరం కుదుర్చుకొని రైతు బ్యాంక్ వైపు వెళ్ళిపోయాడు.

సురేష్ అటువైపు ఎందుకు వెళ్ళాడో అర్థంకాలేదు.

రైతు బ్యాంక్‌లో అతనికి కావల్సింది ఏముంది?

క్రొత్తగా ఒక బ్రోతల్ హౌస్ తెరిచారని తెలి సింది.

కానీ—పెళ్ళయిన తర్వాత కంపెనీ అమ్మాయిల వెంట తిరిగిన సంఘటనలు ఏమీ లేవు.

మర్రై తే ఎందుకు వెళ్ళినట్లు.

యాదగిరికి అతని ప్రవర్తన అంతుకాని ప్రశ్నగా మిగిలిపోయింది.

వ్యాన్ తిరిగి విజయ విహార్ వైపు దూసుకెళ్ళింది.

## 5

రాత్రి ఏడున్నర దాటింది.

దుర్గ కిటికీలోనుంచి కృష్ణవేణిని చూస్తూ తిలక్ గారి "అమృతం కురిసిన రాత్రి" చదువుతూ కూర్చుంది. సురేష్ గదిలోకి వచ్చి—"సారీ దుర్గా లేటయ్యింది. బోర్ ఫీల్ అవుతున్నావా?" అడిగాడు ఆప్యాయంగా.

"అబ్బే లేదంకుల్! నాకు ఈ ఏకాంతం చాలా బావుంది!"

"దట్స్ గుడ్! నాకు కావాల్సింది నువ్వు ఆనందంగా వుండటమే. మనం భోంచేద్దామా!"

"ఊఁ!" అంటూ పుస్తకం మూసేసి లేచింది.

సురేష్ ఇంటర్ కమ్‌లో రూం నెంబర్ కు మీల్స్ తీసుకురమ్మని చెప్పి ప్యాంటు, షర్టు విడిచి—నైట్ డ్రస్ తొడుక్కున్నాడు.

క్షణాల్లో నాన్ వెజిటేరియన్ భోజనం వచ్చింది.

కబుర్లు చెప్పుకుంటూ ఇద్దరూ భోంచేసారు.

భోజనం తర్వాత సురేష్ సిగరెట్టు వెలిగించుకొని బెడ్ మీద వాలిపోయాడు.

విశాలమైన గదిలో డబుల్ కాట్స్ వున్నాయి. దుర్గ తన బెడ్‌ను దూరంగా లాక్కొని పడుకుంది.

"ఏమిటి, అప్పుడే నిద్రపోతున్నావా?" అన్నాడు తలత్రిప్పి అటువైపు చూస్తూ సురేష్.

"లేదు. వూరొక్కనే పడుకున్నాను."

సురేష్ లేచి మరో సిగరెట్ వెలిగించి—అద్దం కిటికీ దగ్గరకి వెళ్ళాడు.

ఆకాశంలోని వేలవేల చుక్కలన్నీ నేలకు దిగి వచ్చాయా అన్నట్లు—లెక్కలేనన్ని దీపాలతో వెలుగు నగరంలా అలరారుతోంది ఊరు. దివిటీలు పట్టుకొని పహారాకాస్తున్న సైనికుల్లాగా 2 కి.మీ. వరకు డ్యాము కిరువైపులా ఫ్లోరోసెంట్ దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

ఈ దృశ్యం దుర్గకు అయితే మరీ బావుంటుందని—ఆమెను పిలిచాడు.

దుర్గ అంతవరకు అటువైపు చూడనేలేదు. అతను నిల్చున్నచోటుకు వచ్చింది.

సురేష్ డ్యామ్ మీది దృశ్యాన్ని చూపించాడు.

అదో కొత్త లోకంలా స్ఫురించింది. విచిత్రంగా కనిపించిందామెకు ఆ దృశ్యం.

ఆమె గుండెల కొండల్లో ఆనందపు తటిల్లత, ఆమె నయనాల అంచులలో ఆనందపు ఉప్పెన, కానీ ఆమె ఆవేవి వ్యక్తం చేయలేకపోయింది. ఉత్తుంగ తరంగాల్లా ఎగిసిపడాల్సిన కృష్ణవేణికి ఆనకట్ట వేసి ఆపేసినట్లు గంభీరంగా మార్చి—ఆమె ఆనందాన్నంతా ఫ్రీగా వ్యక్తం చేయలేకపోయింది.

'అంకుల్ యేమిటి ఉత్త జడపదార్థం, ఇంత అందమైన దృశ్యాలను చూసికూడ కామెంట్ చేయడంలేదు' అనుకుంది మనసులో.

ఆమె అనీజి ఫీలవడం సురేష్ గమనించాడు.

"ఏమిటిలా బిగుసుకు పోతున్నావు. బి. ఫ్రీ!"

"అబ్బే! అదేంలేదు అంకుల్!" తడబడింది.

"వూఁ నువ్వేం అనుకొంటున్నావో నాకు తెలుసు, అంకుల్ యేమిటి, ఉత్త జడపదార్థం ఇంత అందమైన దృశ్యాలను చూసికూడ కామెంట్ చేయడంలేదు, అని అంతే కదూ!"

దుర్గ ఆశ్చర్యపోయింది. తన మనసులో ఎలా అనుకుందో, ఉన్నదున్నట్లు అంకుల్ ఎలా చెప్పగలిగాడు. అదే విషయం అడిగింది.

"ఇందులో పెద్ద గొప్పేంలేదు. దీన్ని థాట్ రీడింగ్, అంటారు. కొద్దిగా ప్రయత్నిస్తే—ఎవరైనా దీన్ని నేర్చుకోవచ్చు. పైదిపై.... నీ మనసులోని భావం థాట్ రీడింగ్ ద్వారా నేను తెలుసుకున్న విషయము ఒక్కటే కనుక-నువ్వు మనసులో అనుకున్నట్లు, ఇక్కడి దృశ్యాలను నేను కవిత్వీకరించి చెపుతాను."

"కవిత్వంగురించి ఎబిసిడిలు కూడ తెలియని నువ్వు—కవిత్వం ఏం చెబుతావు అంకుల్!" అంటూ నవ్వింది.

సురేష్ కళ్ళు ఎర్రగా మారిపోయాయి. అవమానంతో ముఖం జేవురించింది.

"నువ్వు ఇందాక చదివిన పుస్తకాలు ఏమిటి—?" అడిగాడు గంభీరంగా.

"అమృతం కురిసిన రాత్రి, మహాప్రస్థానం రెండూ చదివేను!"

"వాటి ముఖచిత్రం ఎలా వుంటుందో కూడ నాకు తెలియదు. అంటే నువ్వు నమ్ముతావా?"

"తప్పకుండా నమ్ముతాను! ఎందుకంటే—నీకు సాహిత్యం అంటే అభిలాష లేదు కనుక!"

"అక్కడే పొరపడుతున్నావు. నువ్వు చదివిన ఆ రెండు కవితా సంపుటాల్లోని గేయాలన్నీ నాకు కంఠత

వచ్చు!"

దుర్గ ఆశ్చర్యంగా చూసింది అతనివైపు. పచ్చి అబద్ధం చెపుతున్నాడనుకుంది.

"చస్తే నమ్మను!" అంది.

"నిన్ను నమ్మించాలంటే యేం చేయాలి."

దుర్గ ఒక్క-క్షణం ఆలోచించి—"ఆ రెండు కవితా సంపుటాల్లో నుంచి—ఏదైనా ఒక్క దాంట్లోని, ఒక్క గీతం కంఠత అప్పచెప్పాలి. అప్పుడే నువ్వు చెప్పింది నమ్ముతాను."

"రైట్, నేను ఒప్పుకున్నాను. ఏ కవిత అప్పచెప్పాలో చెప్పు!"

"నీ ఇష్టం, ఏదైనా చదువు."

"నా ఇష్టం కాదు, నీ ఇష్టం. అప్పుడే నీకు నామీద నమ్మకం కుదురుతుంది."

దుర్గ క్షణంసేపు ఆలోచించి—"మహాప్రస్థానంలోని రెండవ గేయం పేరు యేమిటో చెప్పు? దాన్ని చదువు చూద్దాం" అంది.

సురేష్ క్షణంసేపు తల పైకెత్తి గది పైకప్పుకేసి చూశాడు. తలవంచి కళ్ళు మూసుకొని—రెండుసార్లు గట్టిగా ఊపిరి పీల్చి—వదిలి—

"గేయం పేరు 'ఐ' కరక్టేనా?"

"ఊఁ కరక్టే!"

"గేయం చదువుతున్నాను విను!"

"భూతాన్ని,
యజ్ఞోపవీతాన్ని,
విప్లవ గీతాన్ని నేను!
స్మరిస్తే పద్యం,

అరిస్తే వాద్యం,
అనల వేదిక ముందు అస్త్రనై వేద్యం,
లోకాలు,
భవభూతి శ్లోకాలు,
పరమేష్టి జూకాలు నా మహోద్రేకాలు,
నా ఊహ చంపేయ మాల,
రసరాజ్య డోల
గిరులు
సాగరులు, కంకేళికా మంజరులు,
ఝరులు నా సోదరులు!
నేనొక దుర్గం!
నాదొక స్వర్గం!
అనర్గళం, అనితర సాధ్యం నా మార్గం!"

సురేష్ అనర్గళంగా ఆ కవిత చదివి వినిపిస్తుంటే— దుర్గ నోరు విప్పి, విడ్డూరంగా అతనివైపు చూస్తూ వుండిపోయింది.

"ఇప్పటికైనా నా నమ్మకం కుదిరిందా! ఇంకొకటి చదివి వినిపించమంటావా?" అన్నాడు నవ్వుతూ.

"అక్కర్లేదు....అక్కర్లేదు, నమ్మకం కుదిరింది."

"ఊఁ మనమంటే యేమనుకున్నావ్! యు హేవ్ అండర్ ఎస్టిమేటెడ్ మీ!"

"యూ ఆర్ రియల్లీ గ్రేట్ అంకుల్! ఇవన్నీ చదవడం వరకే గానీ—నాకు కంఠతా రావు. ఆ గేయాల మీద యెంత భక్తి వుంటే వాటిని కంఠతా పడతారు."

సురేష్ మరో సిగరెట్ వెలిగించాడు.

"అంకుల్ మన ఇంట్లోని లైబ్రరీలో మహాప్రస్థానం పుస్తకం లేదుకదా! నువ్వు ఆ కవితను బైహార్ట్ యెలా

చేయగలిగావు" తనకా పుస్తకం ఇంట్లో దొరక్క మొన్న నే విశాలాంధ్ర బుక్ హౌస్‌లో కొన్న విషయం గుర్తువచ్చి అడిగింది.

"పిచ్చి ప్రశ్న! లైబ్రరీ నుంచి తెచ్చి చదివాను!"

"ఐసీ!" దుర్గకు ఇంకా ఆశ్చర్యంగానే వుంది.

"దుర్గ! నీకు హిప్నాటిజం గురించి ఏమైనా తెలుసా?"

"ఊహూఁ నాకేమీ తెలియదు. కాని — దాని గురించి విన్నాను. హిప్నటైజ్ అయిన వ్యక్తి ట్రాన్స్‌లోకి వెళ్ళిపోతాడట, చాలా ఆనందంగా వుంటుందట, అలా తరచుగా హిప్నాసిస్‌లోకి వెళ్ళిన వ్యక్తికి మెదడు పాదరసంలా పనిచేస్తుందట."

"నువ్వు విన్నది కరెక్టే! హిప్నాటిజం నాకు తెలుసు నన్న విషయం నీకు తెలుసా?"

ఆనందంగా, ఆశ్చర్యంగా చూసింది దుర్గ అతనివైపు.

"నీకు హిప్నాటిజం కూడా తెలుసా?"

"చేసి చూపించమంటావా?"

"ఊఁ!"

"ఎవరిని హిప్నటైజ్ చేయాలి?"

"ఇంకెవరిని, నన్నే!"

"హిప్నాసిస్‌లోకి వెళ్ళడానికి సంసిద్ధంగా వున్నావా?"

"నేను సంసిద్ధంగా లేకపోయినా చేయగలవా?"

"ఊహూఁ!"

"అందుకే నేను సంసిద్ధంగా వున్నాను."

"ఓ.కే. లెటజ్ స్టార్ట్! నువ్విలా ఈ మంచంమీద కూర్చో!"

ఆమె వచ్చి మంచంమీద కూర్చుంది.

"కళ్ళు మూసుకో!"

కళ్ళు మూసుకుంది.

"బాగా ఊపిరిపీల్చి క్రమంగా వదలాలి........ రెండు నిమిషాల దాక!"

దుర్గ క్రమంగా గాలి పీలుస్తూ........ వదులుతోంది.

సురేష్ గదిలోని లైట్లు ఆర్పేసి—డిమ్ లైటు వెలిగించాడు. గదిలో మసక మసకగా వెలుతురు.

"దుర్గా! యువార్ ఇన్ డీప్ స్టేట్ ఆఫ్ రిలాక్సేషన్....యూవార్ ఇన్ డీ........ప్ స్టేట్ ఆఫ్ రిలాక్సేషన్!" 'డీ'ను రాగయుక్తంగా లాగుతూ అనేకసార్లు అన్నాడు.

"నీ మనస్సు ఎంతో ప్రశాంతంగా, హాయిగా, సుందర వనాల్లో విహరిస్తున్నట్లు వుంది. హా....యిగా.... హాయిగా....నీ కెటువంటి బాధలు, భయాలు లేవు. హాయిగా ఉన్నావు. నీ మనస్సు తేలికగా దూదిపింజలా అయిపోతోంది! నిద్రపో హాయిగా....హాయిగా, నిద్రలోకి జారిపో, ఏవో....ఏవో లోకాలకు....నీ ఇష్టమైన లోకాలకు వెళ్ళిపో....నిద్రలోకి జారిపో...."

దుర్గ కూర్చుని నిద్రలోకి జారిపోయింది.

"స్....స్....స్....స్లీప్!" అన్నాడు గట్టిగా.

దుర్గ కూర్చున్నదల్లా తపీమని మంచంమీద పడిపోయింది.

"దుర్గా! నువ్వు నేను చెప్పినట్లు వింటావు. నేనే నీ మనస్సుకు అధిపతిని. నువ్వు నే నేదిచెప్తే అది చేస్తావు.... నేనేం చెప్తే అది చేస్తావు...."

దుర్గ సుషుప్తావస్థలోకి వెళ్ళిపోయింది.

"దుర్గా నువ్వొక పాట పాడతావు....నీ కిష్టమైన

పాట చాలా శ్రావ్యంగా పాడతావు."

దుర్గ పాడటం ప్రారంభించింది. సురేష్ టేప్ రికార్డర్ ఆన్ చేసాడు.

"చౌదవీకా చాంద్ హో....యాబ్ తాబ్ హో..."

చాలా శ్రావ్యంగా ఒరిజినల్ సాంగ్‌లా పాడింది.

ఆమె పాడింది రికార్డయ్యింది.

సురేష్ ఆమెనొక ప్రశ్న అడిగాడు.

"దుర్గ! నీకు తెలుగులో అభిమాన నటుడెవ్వరు?"

"ఎన్.టి. రామారావు!" తడుముకోకుండా చెప్పింది.

"అలాగా! ఆయన రాజకీయ ఉపన్యాసాలు నువ్వెప్పుడైనా విన్నావా?"

"ఊఁ విన్నాను."

"ఇప్పుడు నువ్వు లక్షలాది ప్రజలముందు ఒక బహిరంగ సభావేదికమీద వున్నావు. నీముందు చాలా పవర్‌ఫుల్ మైక్రోఫోన్‌లున్నాయి. ఆ లక్షలాది ప్రజల నుద్దేశించి—నువ్వు అనర్గళంగా—ఎన్. టి. రామారావుగారిలాగా ఉపన్యాసం ఇస్తావు—ఊఁ స్టార్ట్!"

దుర్గ మంచంమీది నుంచి లేచి నిలబడింది.

తన యెదురుగా వున్న రెండు మైకులను రెండు చేతిలతో పట్టుకొని — జనాన్నంతా ఒకసారి తేరిపార చూసి—"ఆకాశం దద్దరిల్లిందా!... నేల ఈనిందా.... సముద్రం ఉప్పొంగిందా? ఏమిటీ జనచైతన్యం! ఏమిటీ ఉత్తుంగ తరంగ ఉత్సాహం! ఏమిటీ అభిమాన వెల్లువ!"

అంటూ దుర్గ ప్రసంగం నయాగరా జలపాతంలా కొనసాగుతోంది. మాడ్యులేషన్ మొత్తం రామారావును పోలివుండటం సురేష్‌కు ఆశ్చర్యం కలిగించింది. గొంతును మిమిక్రీకళాకారుడిగా మార్చేసింది.

ఆమె ఉపన్యాసం ధారాళంగా అలా ఒక గంటసేపు కొనసాగింది. ఆ ఉపన్యాసంలో ఎక్కడా ఫుల్ స్టాపులు కామాలు లేవు. గంగా ప్రవాహంలా వుంది.

దుర్గ అనర్గళ వాక్పటిమకు సురేష్ ఆశ్చర్యపోయాడు.

ఆమెలో ఇంకా యెన్నో ట్రిక్కులు చేయించాలను కున్నాడు. కానీ—సమయం వృధా చేయటం ఇష్టంలేక అతని మనసులో వున్న మరో ఆలోచనను అతను అమలు చేయడానికి నిర్ణయించాడు.

ఆమెను నిద్రలోకి జారిపొమ్మని సజెషన్ యిచ్చాడు.

దుర్గ నిద్రిస్తోంది. ఆమె నిద్రలో అందంగా గోచరిస్తోంది. రింగుల వెంట్రుకలు నుదిటిమీద పడి అల్లల్లాడుతున్నాయి.

ఆమెను ఆ పరిస్థితిలో చూసిన సురేష్ మెదడులో కామనాడులు ప్రకోపించాయి. అతను దుర్గను అనుభవించడానికి నిర్ణయించుకున్నాడు.

"దుర్గా నువ్వు చాలా అందంగా ఉంటావు! యామ్ ఐ కరెక్ట్?"

"అఫ్ కోర్స్!"

"నువ్వు వెంటనే నీ జాకెట్టుతీసి అవతల పడేస్తావు!"

దుర్గ క్షణంసేపు నిశ్చేష్టురాలయింది.

"నువ్వు వెంటనే నీ జాకెట్టుతీసి అవతల పడేస్తావు!" గట్టిగా చెప్పాడు.

ఆమె చకచకా తన జాకెట్ హుక్స్ తీసి అవతల పారేసింది.

ఆమె పూర్తిగా సబ్ కాన్షియస్ లో ఉంది. ఆ పరిస్థితిలో ఆమెకు సూచనలిచ్చే వ్యక్తి ఏ పని చెప్పినా చేస్తుంది.

సురేష్ పాశవిక సూచనలివ్వడం మొదలుపెట్టాడు.

"నీ ఓణీతీసి అవతల పారేయ్!" సజెషన్ ఇచ్చాడు.

ఆమె చాల సిన్సియర్‌గా యెటువంటి సిగ్గు ఎగ్గులు ప్రదర్శించకుండా తన ఒంటికి చుట్టుకున్న ఓణీతీసి మంచం క్రింద పడేసింది.

దుర్గ లంగా, బ్రాతో మంచంమీద వెల్లికిలా సబ్ కాన్షియస్ స్థితిలో ఉంది.

బ్రా కూడ తీసేయమని సజెషన్ ఇద్దామనుకున్నాడు. కానీ — ఎందుకో తనా సజెషన్ ఇవ్వలేకపోయాడు.

ఆ స్థితిలో దుర్గ చాలా అందంగా గోచరిస్తోంది.

సురేష్ కళ్ళు కామంతో నిండిపోయాయి.

మన్మథుడు అతనిమీద లెక్కలేనన్ని బాణాలు వేసి బాధ పెడుతున్నాడు.

"దుర్గా, నేను నీతో సృష్టికార్యం జరుపుతాను. నువ్వు అభ్యంతరం చెప్పకూడదు. నిన్ను నాకు అర్పించేసుకో! నిన్ను నాకు అర్పించేసుకో!"

"నో! ఇంపాజిబుల్. అదేనాటికీ జరగదు. నువ్వు లాంటి పనికి పూనుకుంటే నీ ప్రాణాలు తీస్తాను" దుర్గ సుషుప్తావస్థలోనే మాట్లాడుతుంది.

సురేష్ ఆశ్చర్యపోయాడు. ఇటువంటి నెగటివ్ సమాధానం వస్తుందని కలలోకూడా ఊహించలేదతను. కింకర్తవ్యమేమిటో అతనికి వెంటనే అర్థంకాలేదు.

"ఆల్ రైట్! నీకిష్టం లేకపోతే మానెయ్! ఊఁ ఈ జాకెట్ తొడుక్కో!" దుర్గ తీసి పారేసిన జాకెట్‌ను ఆమె చేతికందించాడు.

దుర్గ ట్రాన్స్‌లోనే జాకెట్ తొడుక్కుంది.

కాసేపటి తర్వాత దుర్గ హిప్నాసిస్ లోనుంచి బయటి

వచ్చింది.

"ఏమిటి దుర్గా, త్వరగా నిద్రపోయావేంటి?" అడిగాడు సురేష్.

"ఔను, ఉన్నట్టుండి ఇలా నిద్రపట్టిందేమిటి?"

సురేష్ నవ్వాడు—

"అయితే నీకు జరిగిన విషయాలు ఏవీ గుర్తులేవన్న మాట."

"ఊహూం నాకేం గుర్తులేదు."

సురేష్ ఊపిరి పీల్చుకున్నాడు.

"దుర్గా నువ్వొక అద్భుత ఉపన్యాసకురాలివి ...నువ్వు చాలా బాగా మాట్లాడగలవు?"

"నేనా? నాకసలు ఉపన్యాసాలివ్వడం చేతకాదు. ఒకసారి యేమైందో తెలుసా? అవి నేను ఇంటర్ మీడియట్ చదివే రోజులు. కాలేజీలో డిబేట్ కాంపిటిషన్ పెట్టారు. బలవంతంగా నా పేరు లిస్టులో వ్రాయించి—వన్ను ఉపన్యాసం ఇవ్వమన్నారు. నేను స్టేజిమీదకి ఎక్కి నిలువునా ఒణికిపోసాగాను. ప్రాణాలు పోతాయా అన్నంత టెన్షన్! నిమిషం గడిచింది, నే నేం మాట్లాడలేదు. 'ఊఁ ఏదైనా మాట్లాడు', వెనకగా యెవరో విసుక్కుంటున్నారు. అంతే! వాఁ అంటూ యేడుపు లంకించుకున్నాను. అదీ, నా ఉపన్యాస పాటవం!" అంటూ నవ్వింది దుర్గ.

"దుర్గా! నీలో అంతర్గతంగా మహాశక్తి ఉందికానీ—దాని వెలికి తీసేవారు లేక — నీ శక్తిసామర్థ్యాలన్నీ అడవిగాచిన వెన్నెల్లా వృధా అయినాయి!"

"అంకుల్! అపు నీ ముఖస్తుతి, ఇలువంటివి నాకు ఇష్టం ఉండవు."

"ముఖస్తుతి కాదు దుర్గా! కావాలంటే—నీ శక్తి సామర్థ్యాలు యెటువంటివో నువ్వే స్వయంగా చూడు" అంటూ టేప్ రికార్డర్ ఆన్ చేశాడు.

హిప్నాసిస్‌లో తను పాడిన "చౌదవీకా చాంద్ హో" అనే పాట, తర్వాత, ఎన్.టి.ఆర్. ఉపన్యాసం వరసగా విని ఆశ్చర్య ఆనందాతిశయాలను పొందింది.

ఆమె మళ్ళీ మళ్ళీ తను పాడిన పాటను విని ఆనందించింది.

# 6

ఉదయం ఆరు గంటలు—

దుర్గ నిద్రలో నుంచి మేల్కొని లైట్ ఎక్సర్‌సైజు చేసి — స్నానాదికాలు ముగించుకొని గదిలో నుంచి బయటకు వచ్చింది.

విజయ్ విహార్ లాన్‌లో గార్డెన్ చైర్లు వేసి ఉన్నాయి. వెళ్ళి కూర్చుంది. ఎదురుగా పెద్ద పెద్ద అశోక వృక్షాలు, ముసుగు వీరుల్లా నిల్చున్నాయి. లైన్ బార్డర్ మొక్కలు — రెండువైపులా తారు రోడ్డు, మధ్యలో పాడవాటి వాటర్ ట్యాంక్—మధ్యలో ఫౌంటెన్స్ దగ్గరలో ఉన్న సత్యనారాయణస్వామి దేవాలయంలో నుంచి—"కౌసల్యా, సుప్రజా రామా పూర్వ సంధ్యా ప్రవ ర్తతే...." సుప్రభాతం మందకొడిగా వినిపిస్తోంది.

వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది-క్యాంటీన్ కుర్రాడు తెచ్చిన కాఫీ త్రాగి—ప్రక్కనే ఉన్న త్రోక్ రైల్స్ పార్ట్రిజు వెళ్ళింది.

అక్కడొక పెద్ద నీటి కొలను ఆ నీటి కొలనుచుట్టూ ఏవేవో చెట్లు.... చెట్ల క్రింద ఇసుక. కొలనుచుట్టూ పెద్ద గోడ.

దుర్గ వెళ్ళి గోడ యెక్కి నిలబడింది. అక్కడ మొసళ్ళను పెంచుతున్నారు. కొలనులో నుంచి మొసళ్ళు బయటికి వచ్చి విశ్రాంతి తీసుకుంటున్నాయి. మొసళ్ళు చాలా భయంకరంగా ఉన్నాయి.

ప్రొద్దున్నే టూరిస్టులుకూడ ఇంకా యెవ్వరూ రాలే దక్కడికి. దుర్గ ఒక్కదానికి ఆ భయంకరమైన జంతువుల మధ్య భయం వేసింది. ఒక్కొక్క మొసలి పది నుంచి పన్నెండు అడుగుల పొడవు ఉన్నాయి.

దుర్గ వాటి కదలికలను చూసి ఆనందిస్తోంది.

సురేష్ దుర్గను వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు.

దుర్గ అతన్ని చూసి ఆనందించింది.

"అంకుల్, ఇక్కడ మొసళ్ళు చూశావా? ఎంత భయంకరంగా ఉన్నాయో?" అంటూ చూపించింది.

"ఓ.స్, ఇవా!" అంటూ చూసాడు.

సురేష్ గోడ ఎక్కి కూర్చున్నాడు.

అక్కడ ఎర్ర అక్షరాలతో పెద్ద బోర్డు రాసి పెట్టారు—"డేంజర్! డోంట్ క్రాస్ ది వాల్!" అని.

"దుర్గా! నేనొక అద్భుతం చేయనా?"

"ఏం అద్భుతం చేస్తావు?"

"చెప్తే నువ్వొద్దంటావు! నేనేం చేస్తానో నువ్వే చూడు."

"అంకుల్! నీకు దండం పెడ్తాను అలాంటి రిస్కులు తీసుకోమాకు!"

"రిస్కు లేదు! ఏమిలేదు. నువ్వు చూస్తూవుండు నేనేం చేస్తానో!" అంటూ గబగబ బట్టలన్నీ వూడదీసి—గోడ దూకాడు.

"అంకుల్! ఏం చేస్తున్నావు, మొసళ్ళు చాలా

ప్రమాదకరమైనవి. అటువైపు వెళ్ళకు!" అంటూ అరవ సాగింది.

సురేష్ గబగబా వెళ్ళి ఆ నీటి కొలనులో దూకాడు.

దుర్గ ఆశ్చర్యపోయింది. ఆ మెకు భయంకూడా వేసింది. సురేష్ ఇక బ్రతకడనుకుంది. మొసళ్ళన్నీ ఒక్క సారిగా అతనిమీద పడ్డాయి.

దుర్గ కళ్ళు మూసుకుని భూనభోంతరాళాలు దద్దరిల్లేటు కవ్వున కేక వేసింది.

నిమిషం తర్వాత — సురేష్ కొలనులోనుంచి బయటికి వచ్చాడు. మొసళ్ళన్నీ భయంకల్లో మరి దేనికో ఓ మూలకు చేరిపోయాయి.

సురేష్ నవ్వుతూ వచ్చాడు.

మొసళ్ళు అతన్ని యేటువంటి హాని జరపకుండా వదిలి వేయడం దుర్గకు ఆశ్చర్యం కలిగించింది — అదే అడిగింది.

అతను 'అసలు' విషయాన్ని దాచేసాడు.

"దుర్గా! అందరూ అనుకుంటున్నట్లు మొసలి ప్రమాద కరమైన జంతువుకాదు. అది మాంసాహారి. కాదనను. ఇది మొదట కీటకాలను, తరవాత చేపలను, కప్పలను, ఎండ్రకాయలను మొదలైనటువంటి వాటిని తింటుంది. మను ష్యులనుకూడ తింటే తినవచ్చు. కానీ — మొదట దానికి అలవాటు కావాలి కదా! ఈ మొసళ్లు ఇంతకుముందే మనిషిని తినడానికి అలవాటు పడివుంటే — బహుశా ఈ పాటికి నన్ను అవి తిని ఉండేవి. అవి ఇంతవరకు మనిషి మాంసాన్ని భుజించి ఉండవని నేను వూహిం చాను. నా ఊహ నిజమే అయింది. ఏది యేమైనా ఇది సాహసోపేతమైన చర్య!"

"కరెక్ట్ అంకుల్! కెమెరా గదిలో వదిలేసి వచ్చాను, కానీ_లేకపోతే_ఫోటోలు తీసేదాన్ని!"

"నీ మొహం కదూ! భయంతో కళ్ళు మూసుకున్న దానివి, కేకలు పెట్టిన దానివి, నువ్వు ఫోటోలు తీస్తావా?" ఇద్దరూ నవ్వుకున్నారు.

తర్వాత ప్రక్కనే ఉన్న లేళ్ళ పార్కువైపు దారి తీసారు.

అక్కడ లేళ్ళను చూసి తిరిగి వాళ్ళు విజయ విహార్ కు దారితీసారు.

## 7

మధ్యాహ్నం పన్నెండు గంటలు.

యాదగిరి, సురేష్, దుర్గ వ్యాన్ లో రైటు బ్యాంక్ కు బయలుదేరారు. అక్కడినుంచి వాళ్ళకు 1-30 గంటలకు లాంచిలో నాగార్జున కొండకు బయలుదేరాల్సి ఉంది.

దారిలో ఎర్తు డ్యామ్ దగ్గర అందమైన పార్కు కనిపించింది. "యాదగిరి ఇక్కడ వ్యాన్ కాస్సేపు ఆపు! కాస్సేపు పార్కు చూసి వెళ్దాం!" అన్నాడు

యాదగిరి వ్యాన్ ఆపాడు.

ముగ్గురూ వ్యాన్ దిగి పార్కులోనికి వెళ్ళారు.

పార్కులో ఎన్నో రకాల మొక్కలున్నాయి. పార్కు చుట్టూ పెద్దగా పెంచిన అశోక వృక్షాలు గుల్ టోవ్, మందార, బతాని పూలతీగలు గులాబి, జినియా, లిల్లీస్, పార్కు మధ్యలో పిల్లనగ్రోవి ఊదేట్లూ మురళీకృష్ణుడి అందమైన శిలావిగ్రహం.

దుర్గకు ఆ పార్కు వాతావరణం ఎంతో నచ్చింది. మురళీ కృష్ణుడి విగ్రహం చెంత నిల్చుని ఒక ఫోటో

తీయించుకొని బయలుదేరారు.

వ్యాన్ కదిలింది. అప్పటి ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూ 10-12-1955 నాడు నాగార్జున సాగర్ కు శంకుస్థాపన దినోత్సవ చిహ్నంగా ప్రతిష్ఠింపబడిన పైలాన్ పిల్లర్ దగ్గరికొచ్చారు.

చుట్టూ అందమైన పార్కు, పార్కు మధ్యలో పొడవాటి రాతిస్తంభం. దుర్గ అక్కడొక ఫోటోలో దిగింది.

యాదగిరిని వ్యాన్ తీసుకుని కాస్త ముందుకెళ్ళమని చెప్పి—సురేష్, దుర్గ డ్యామ్ మీదుగా నడుచుకుంటూ సుందర మానవ నిర్మిత బహుళార్థ సాధక సరోవరాన్ని చూస్తూ ముందుకు నడిచారు.

ఆరువందల మీటర్ల క్రింది భాగంలో దాదాపు ఏడు వందల మెగావాట్ల విద్యుచ్ఛక్తి తయారయ్యే ఓ పెద్ద జలవిద్యుత్ కేంద్రం. ఆ కేంద్రంలో ఉన్న టర్బైన్లు తిరగడానికి కావల్సిన నీరు, రిజర్వాయర్ నుండి—పెన్ స్టాక్ పైపులగుండా వెళుతూంది. "స్ .... స్ ...." మంటూ పెద్ద నీటి శబ్దం. దుర్గ మనస్సు ఆనందంతో పులకించింది, అక్కడి వాతావరణం చూసి.

మధ్యాహ్నం ఒంటిగంటా ముప్పయి నిమిషాలు.

రైటు బ్యాంక్ నుండి నాగార్జున కొండకు వెళ్ళే లాంచ్ ఎక్కారు ముగ్గురూ.

లాంచ్ లో దాదాపు రెండువందల మంది టూరిస్టులు రకరకాల వయస్సులవాళ్ళు, కేరింతలు కొడుతూ-పాటలు పాడుతూ.... జోక్స్ వేసుకుంటూ అపారమైన ఆ జలరాశిని చూస్తూ సంభ్రమాశ్చర్యాలతో యాత్రికులు విహారయాత్ర చేస్తున్నారు.

దుర్గ లాంచ్ లో ఉన్న సీట్లలో కాకుండా పైన డెక్

క్కౌ బైనాక్యులర్‌లో నుంచి ప్రకృతి సౌందర్యాన్ని
లకిస్తోంది. అన్నివైపుల నల్లమలై కొండల శాఖలు
స్తరిల్లి శోభాయమానంగా ఉన్నాయి.

ఇప్పుడు తాను ప్రయాణిస్తున్న నీటి క్రింద అడుగు
గాగంలో ఒకనాడు ఇక్ష్వాకులు పరిపాలించిన విజయపురి
గరం ఉన్న విషయం గుర్తొచ్చి—దుర్గ మనసు బాధతో
లవిల లాడింది. చాలాకాలం వరకు ఈ లోయలో పురా
త్వ సంపద ఉన్న విషయం ఎవరికీ తెలియదు. సర్వే
ఆఫ్ ఇండియాలో పని చేసిన ఏ. ఆర్. సరస్వతిగారు
నిని కనుగొనేంతవరకు సభ్య ప్రపంచానికి ఈ విషయం
తెలియదు.

ఇక్కడ జరిపిన త్రవ్వకాలలో బుద్ధుని విగ్రహాలు
తర అనేక గుర్తులు, సున్నపురాయి చెక్కడాలు దొరి
గాయి. త్రవ్వకాలలో బయల్పడిన నగరం కృష్ణానది
టిలో మునిగిపోయినందుకు ఇక్కడి విగ్రహాలను,
మృణ్మయ పాత్రలు, రాతియుగం నాటి అనేక ఆయు
ధాలు, ఇతర గుర్తులను, కట్టడాలను ప్రక్కనే నాగార్జున
కొండకు తరలించి—అక్కడొక పెద్ద మ్యూజియం
ట్టించి—భద్రపరచారు.

లాంచ్ నాగార్జున కొండకు చేరుకుంది.

యాత్రికులంతా బిలబిల మంటూ లాంచ్ దిగి—నీటి
ధ్య చిన్న దీవిలా ఉన్న ఆ కొండమీద అడుగు
పెట్టారు.

దుర్గ సురేష్, యాదగిరిలతో పాటు ప్రక్క ప్రక్కనే
డుస్తూ అక్కడి పురాతన సౌందర్యాన్ని చూసి ఆనం
స్తోంది.

కాస్సేపట్లో వాళ్ళు మ్యూజియం సమీపాని

కొచ్చారు.

దుర్గ సురేష్ కోరకు చూసింది.

అతను అక్కడ కనిపించలేదు.

"యాదగిరి! అంకుల్ కనిపించడంలేదు. ఎక్కడికి వెళ్ళాడు!" ఉన్నట్టుండి అతను మాయమవటంతో అడిగింది.

యాదగిరి కూడ ఆశ్చర్యపోయాడు.

"ఏమో! నేను కూడా గమనించలేదు. ఇక్కడే యెక్కడో ఉండివుంటాడు. పదండి, మనం వెళ్ళి మ్యూజియం చూద్దాం!" అంటూ యాదగిరి మ్యూజియం లోపలికి దారితీశాడు.

దుర్గ అతన్ని అనుసరించింది.

ఎంట్రెన్స్‌లోనే మ్యూజియంకి ప్లాన్ అత్యద్భుతంగా ఉంది. త్రవ్వకాలలో లభ్యమయిన ప్రదేశాలను కొండమీదకి మార్చి అక్కడ ప్రతిష్టించారు. వాటి మోడల్స్ బాగున్నాయి. నిజానికి మ్యూజియం మొత్తం తిరిగి చూడటానికి ఉన్న ఒక గంట సమయం చాలదు.

ఆ మ్యూజియం గాలరిలలో ఎన్నోరకాల ప్రాచీన బంగారు, వెండి ఆభరణాలు, నాణాలు, సున్నపురాతి చెక్కడాలు మతపరమైన ఉత్సవాలలో ఉపయోగించిన బంగారు వెండి వంట పాత్రలు ఉన్నాయి.

కుడిచేయి విరిగిపోయిన బుద్ధుని ప్రతిమ, అత్యంత ఆకర్షణీయంగా ఉంది—ఈ విగ్రహం దాదాపు 3 మీటర్ల పొడవు ఉంది.

గౌతమబుద్ధుని పుట్టుక. మహానిష్క్రమణం వంటి బుద్ధుని జీవితంలోని ముఖ్య ఘట్టాలెన్నో శిలారూపంలో అక్కడున్నాయి.

రాతియుగపు నాటి మానవుడు ఉపయోగించిన ఆయుధాలు ఎన్నో మనకు అక్కడ కనిపిస్తాయి. చెట్ల కొమ్మలను బరిసెలుగా ఉపయోగించిన ఆయుధాలుకూడా ఉన్నాయి.

మెయిన్ గ్యాలరీలో బుద్ధుని జీవిత చరిత్ర, జాతక కథలను తెలియజేసే సున్నపురాతి చెక్కడాలు సుందరంగా ఉన్నాయి.

దుర్గకు ఆ మ్యూజియంలో ఇంకాస్సేపు గడపాలనిపించింది. కానీ—మరో అరగంటలో లాంచీ తిరిగి వెళ్ళిపోనున్నదని యాదగిరి హెచ్చరించడంతో—దుర్గ అయిష్టంగానే మ్యూజియంలో నుండి బయటికొచ్చింది.

నీటిలో మునిగిపోయే ప్రమాదమున్న స్నానవాటికా, మహాస్థూపం, స్థానిక స్థూపం, హారతి దేవాలయం, కార్తికేయ దేవాలయం మొదలైనవాటి పునర్ నిర్మాణాలను ఆదరబాదరగా చూసి—లాంచ్ దగ్గరికొచ్చేసారు.

సురేష్ యెక్కడ తిరుగుతున్నాడో వారికి అంతుబట్టలేదు.

## 8

దుర్గ కృష్ణవేణిని చూస్తూ చాలాసేపు గడిపి—రాత్రి నిద్ర కుపక్రమించింది.

నిద్ర మెలుకవ కానీ—సుషుప్తావస్థలో దుర్గ ఒక విచిత్రమయిన పరిస్థితిని ఎదుర్కొంది.

కొంతమంది స్త్రీ పురుషులు వచ్చి—తనను నానా అల్లరి పెట్టారు. వాళ్ళు స్త్రీ పురుషుల ఆకారంలో ఉన్న ప్రేతాత్మలు. ప్రేతాత్మలన్నీ సూక్ష్మ ఆకారంలో ఉన్నాయి.

ఆ ప్రేతాత్మలన్నీ తనను కూర్చోబెట్టి—సురేష్ గుణ
గణాల గురించి—అతని దివ్యసాహసాల గురించి పొగిడి—
తన శరీరాన్ని సురేష్కు అర్పించమని కోరుతూ—అలా
చేస్తే తనకు ధన ధాన్య కనక వస్తువాహనాలతో పాటు
ఉత్తమగతులు కలుగుతాయని పదే పదే చెప్పి తనను
కన్విన్స్ చేయడానికి ప్రయత్నించాయి.

దుర్గ సుషుప్తావస్థలోనే అలా చేయడానికి నిరాక
రించింది.

ప్రేతాత్మలకు కోపం వచ్చింది.

ఒక ప్రేతాత్మ కొరడా తీసుకొని కొట్టడాని
ఉద్యుక్తురాలయింది.

మరొకటి భయంకర ఆకారం దాల్చి తనను భయ
పెట్టడానికి ఉపక్రమించింది.

ఇంకొకటి తనను వివస్త్ర చేయాలని చూసింది.

అంతే!

దుర్గ నోట్లోంచి—భగవద్గీతలోని శ్లోకాలు గంగా
ఝరీలా బయటికొచ్చాయి.

మధుర శబ్ద తరంగాలతో ఆ గది అంతా నిం
పోయింది.

ఆ శబ్దాలు పిశాచాలకు కర్ణకఠోరంగా తోచాయి.

అంతే!

ప్రేతాత్మలన్నీ తుపాకీ శబ్దంవిన్న కొంగల్లా చెల్ల
చెదురై పారిపోయాయి.

ఆ తర్వాత దుర్గకు సుఖంగా నిద్రపట్టింది.

## 9

ఉదయం తొమ్మిది గంటలు.

సాయంత్రం వస్తాను అని దుర్గకు చెప్పి—సురేష్

రోజు కూడా నాగార్జున కొండకు లాంచీలో బయలు దేరాడు.

సాధారణంగా నాగార్జున కొండకు వెళ్ళేవాళ్ళంతా—కొండమీద ఉన్న మ్యూజియంను చూడటానికి వెళ్తారు. కాని—సురేష్ మ్యూజియంను చూడటానికి వెళ్ళడంలేదు.

అతనొక అత్యంత రహస్య ప్రదేశానికి వెళ్తున్నాడు.

ఆ ప్రదేశం మ్యూజియానికి దాదాపు రెండు కిలోమీటర్ల దూరంలో ఉంది.

అక్కడొక బండరాతి గుహ ఉంది.

ఆ గుహలో సాయినాథ్, అతని సేవకురాలు గంగావతి ఇద్దరూ ఉంటారు.

ఆ గుహలో నిలువెత్తు దేవీ విగ్రహం వుంది.

వాళ్ళిద్దరూ మంత్రోపాసకులు.

తంత్ర విజ్ఞానాన్ని వాళ్లు కాచి వడపోసారు.

ఆ గుహలో తంత్రానికి కావల్సిన మూలికలు, మాలికలు, హోమ ద్రవ్యాలు, తర్పణ వస్తువులు యెన్నో వున్నాయి.

వారికి కావల్సిన మూలికలు ఆ కొండమీద విశేషంగా లభ్యమౌతాయి. అందుకే వాళ్ళు ఈ కొండను కేంద్రంగా చేసుకున్నారు.

దివ్యదృష్టి, కర్ణపిశాచి, ఉచ్ఛిష్టగణపతి, చేతబడి, మొదలైన విద్యలన్నీ వీరికి కరతలామలకం.

భౌతికమయిన అవయవాలతో చూడలేని విషయాలను సాయినాథ్ చూడగలుగుతాడు. ప్రపంచంలో ఎవరు, ఎక్కడ, ఏం మాట్లాడుకుంటున్నారో అతను కావాలను

ఉంటే కర్ణపిశాచి ద్వారా వినగలడు. జూదములో, వివాదములో, యుద్ధములో పెద్దదైన చోట్ల తేలిగ్గా గెలుపొందుటకు అతని దగ్గర విద్యలున్నాయి. మానవుని తుదముట్టించాలన్నా అతనికి తృణ ప్రాయం.

ఈ విద్యలన్నీ నేర్చుకొని గొప్పవాడిని కావాలనే ఉత్సుకత సురేష్‌కు ఉంది.

ఇప్పటికే అతను కొన్ని చిన్నచిన్న విద్యలు నేర్చుకో గలిగాడు.

ఉదయం పదకొండు గంటలు.

ఎండ మండిపోతోంది.

సురేష్ తుప్పల్లో నుంచి, రాళ్ళలో నుంచి, ఎగుడు దిగుడు దారుల్లోనుంచి, దీక్షగా నడుస్తున్నాడు. కాదు— దాదాపు పరుగెడుతున్నట్టున్నాడు. సాధారణంగా మానవులు ఎవ్వరూ రారు అటువైపు.

దారిలో చిన్న చిన్న రాతిగృహాలు, ఏవో గుర్తు శిథిలావస్థలో ఉన్నాయి.

పరిశోధన నిమిత్తం చేసిన త్రవ్వకాలు, బౌద్ధచైత్య గృహాలు మండపాలు. రీ కన్‌స్ట్రక్టెడ్ మాన్యుమెంట్స్.

ఇరవై నిమిషాల్లో అతను సాయినాథ్ గుహను చేరుకోగలిగాడు.

అప్పుడు—

సాయినాథ్, గంగావతి యిద్దరూ హోమం చేస్తున్నారు.

సురేష్ యెండలో నడిచిరావడంవల్ల చెమటతో పూర్తిగా తడిసిపోయాడు—ఆ గుహలో ఎంత చల్లగా ఉందంటే—ఎయిర్ కండిషన్డ్ గది కూడా ఎందుకూ పనికిరాదు. కృష్ణవేణి తరంగాల చల్లటిగాలి అలలు

అలలుగా సరాసరి ఆ గుహలోకే వీస్తోంది. సురేష్‌కు ప్రాణం లేచివచ్చినట్లయింది.

అక్కడ సింహాసనంలా ఉన్న ఓ గద్దెమీద ఆసీనుడయ్యాడు.

హోమం ముగించుకొని—సాయినాథ్, గంగావతులు లేచి నిలబడ్డాడు.

సురేష్ వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశాడు.

సాయినాథ్ "సకల విద్యాప్రాప్తిరస్తు!" అంటూ దీవించాడు.

సురేష్ లేచి నిలబడ్డాడు.

అంతా వెళ్ళి పులి చర్మాలపై కూర్చున్నారు.

సాయినాథ్ మళ్ళీ ధ్యానంలోకి వెళ్ళాడు. ఆ తర్వాత కానీ—అతను అన్ని విషయాలు మాట్లాడడు.

సురేష్‌కు సాయినాథ్‌తో పరిచయం, ఆ తర్వాత తన కోరికను వెల్లడించడం, మొదలయిన విషయాలు గుర్తొచ్చాయి.

సురేష్ గ్రాడ్యుయేషన్ పూర్తి అయిన తర్వాత ఉద్యోగం కోసం తిరుగుతున్న రోజుల్లో—స్నేహితులతో కలసి నాగార్జునసాగర్ చూడటానికి వచ్చాడు.

మొదట్నుంచి సురేష్‌కు పరిశోధన అంటే చాలా ఆసక్తి.

ఆ రోజు స్నేహితులంతా కలసి నాగార్జున కొండకు వచ్చారు.

స్నేహితులంతా మ్యూజియం చూస్తూ ఉంటే—అది తర్వాత చూడవచ్చని—అడవిలోకి బయలుదేరాడు.

కొండలమీద మునులు, సిద్ధులు ఉంటారని అతనికి గట్టి నమ్మకం. వాళ్ల అనుగ్రహం పొంది, తాను గొప్ప

వాడిని కావాలని అతని ఆశ. అందుకే అలా ముళ్ళ లోంచి, కంపల్లోంచి, డొంకల్లోంచి గమ్యంలేని ప్రయాణాన్ని కొనసాగించాడు.

అలా చాలాదూరం వెళ్ళాడు.

అతనికి మానవమాత్రులు ఎవ్వరూ కనిపించలేదుగానీ— ఒక పులి గాండ్రింపు కర్ణకఠోరంగా వినిపించింది.

భయం భయంగా చుట్టూ చూశాడు. ఇక్కడ పులులు కూడా ఉన్నాయా? అని ఆశ్చర్యపోయాడు.

తనకు రెండువందల గజాల దూరంలో ఆరు అడుగుల పొడవు ఉన్న పులి—కళ్ళు మిటకరిస్తూ తనవైపే వస్తోంది.

సురేష్ తన ప్రాణాలు పోయాయని నిర్ణయించుకున్నాడు. చనిపోయే ముందు ఆ పులితో పోరాడి చావాలని నిర్ణయించుకున్నాడు. అంతే! అతనికి ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది.

జేబులో ఉన్న ఒకే ఒక ఆయుధం బటన్ చాకు తీసి తెరిచి చేతిలో పట్టుకున్నాడు.

పులి పరిగెడుతూ తనవైపు వచ్చేసింది.

సురేష్ అకస్మాత్తుగా సింహనాదం చేశాడు. ఆ నాదానికి పులి తత్తరపాటుపడి, చెంగున ఎగిరి కంగారుగా అతనిమీదికి దూకింది. ఆ దూకుడులో అలర్ట్‌నెస్ లేదు. ఆ వేటలో పరిపూర్ణత్వంలేదు. పులి కేవలం యాంత్రికంగా దూకినట్లే వుంది.

ఆ అవకాశాన్ని అతను బాగా ఉపయోగించుకున్నాడు. చటుక్కున కూర్చుని, బాగా వాడిగా ఉన్న బటన్ చాకును పులి కడుపులో దించేశాడు

పులిపంజా దెబ్బ తగలకుండా తప్పించుకోగలిగాడు.

పులి భయంకరంగా గర్జిస్తూ క్రింద పడిపోయింది. మళ్ళీ లేవడానికి ప్రయత్నించింది. పులికి అటువంటి అవకాశం ఇవ్వకుండా—దాని వీపుమీద కూర్చొని—లెక్కలేనన్ని కత్తిపోట్లు వేసి గాయం చేశాడు.

పులి కిక్కురుమనకుండా చచ్చి పడిపోయింది.

బ్రతుకుజీవుడా అనుకుంటూ అక్కడి నుండి దారి మార్చి దక్షిణంవైపు నడక ప్రారంభించాడు.

అలా కొంతదూరం నడిచిన తర్వాత ఓ పెద్ద మర్రి చెట్టు ఎదురైంది. ఆ చెట్టుక్రింద చక్కని నీడ వుంది. చల్లగా హాయిగా ఉంది. అక్కడ కాసేపు విశ్రాంతి తీసుకొని—తిరిగి వెళ్ళిపోవటానికి నిర్ణయించుకున్నాడు.

అలా నడుం వాల్చాడో లేదో—ఎక్కడినుంచో సన్నగా నవ్వు వినిపించింది.

సురేష్ చటుక్కున లేచికూర్చున్నాడు.

మళ్ళీ శ్రద్ధగా విన్నాడు. ఎవరో స్త్రీ సన్నగా నవ్వుతుంది.

అంతా తిరిగి చూశాడు—ఆ స్త్రీ యెక్కడా కనిపించలేదు.

ఈసారి నవ్వు పెద్దగా వినిపించింది.

శబ్దం చెట్టుపై నుండి వస్తోందా?

సురేష్ తలయెత్తి చూశాడు.

ఒక అందమైన అప్సరోశిరోమణి—కాళ్ళు వూపుతూ తనవైపే చూస్తూ నవ్వుతుంది.

ఆమె దుస్తులు ఈ కాలానికి చెందినట్లుగా లేవు.

ఇక్ష్వాకుల కాలానికి చెందినట్లుగా వున్నాయి.

మ్యూజియంలో చూసిన 'మైథున' ఫిగర్‌లోని అమ్మాయిలా అందంగా వుంది.

"ఎవరు నువ్వు?" ప్రశ్నించాడు సురేష్.

దాదాపు నాలుగు మీటర్ల ఎత్తునుండి చటుక్కున దూకేసింది ఆ అమ్మాయి.

"నా పేరు మైథున!" అన్నది.

సురేష్ ఆశ్చర్యపోయాడు.

ఇందాక అదే పేరును తను తల్చుకున్నాడు.

"మైథునగారు! మీరు ఇక్కడుండుటకు గతంబేమి? ఈ వేష మేమిటి?" గ్రాంధిక ధోరణిలో అడిగాడు.

"మేముండేది యిక్కడే—కాని సురేష్‌గారు మీరు చాలాదూరం నుండి శ్రమపడి వస్తున్నారు."

సురేష్ విభ్రాంతి చెందాడు.

తన పేరు ఈవిడకెలా తెలుసు?

అదే అడిగాడు.

ఆమె నవ్వింది. ముత్యాలు రాలుతాయా అనిపించింది.

"ఇంకా చెప్పాలా? మీది హైద్రాబాద్, మీరు బి.ఏ., ఉద్యోగం లేదు. అశోక్, వినయ్, కృష్ణ, రాఘవ్‌లు మ్యూజియం చూస్తున్నారు. వాళ్ళు మీ వెంట వచ్చారు! వాళ్ళను వదలి మీరు ఇటు వచ్చారు."

అంతే!

సురేష్ ఆవిడ కాళ్ళమీద సాష్టాంగా పడిపోయాడు.

"అరెరే! ఏమిటిది? లేవండి.... లేవండి...." అంది.

సురేష్ లేచి నిలబడ్డాడు.

"మైథునగారు, నా గురించి మీకిన్ని విషయాలు తెలిసాయంటే_ నేనెందుకిలా పిచ్చివాడిలా ఈ రాళ్ళల్లో, రప్పల్లో తిరుగుతున్నానో మీకు బాగా తెలిసే ఉండాలి. దయచేసి ఈ దీనుణ్ణి ఏ మంత్రోపాసకుడి దగ్గరికో తీసి

కాకపోతే—మీ ఋణం తప్పక తీర్చుకుంటాను!"

"ఋణాలు ఏమీ తీర్చుకోనక్కర్లేదు. మీరు మా గురువుగారికి బాగా నచ్చారు. మీ ధైర్యసాహసాలు ఆయనకు బాగా నచ్చాయి. ఆయన పంపించిన మాయ పులిని మీరు అవలీలగా చంపేయగలిగారు. పదండి మనం అటే వెళ్దాం!" అంటూ దారితీసింది.

సురేష్ ఆమెను వెంబడించాడు.

ఓ పావుగంటలో వాళ్ళు గుహను చేరుకోగలిగారు. అక్కడ సురేష్‌కు సాయినాథ్ దర్శనమిచ్చాడు.

సాయినాథ్ ఆరు అడుగుల పొడవు ఉంటాడు. పచ్చని దేహచ్ఛాయ. వయస్సు 40 సంవత్సరాలుంటాయి. జానెడుకన్న ఎక్కువగా పెరిగిన గడ్డం. తల వెంట్రుకలు కూడ బాగా పెరిగి ఉన్నాయి. అతని ముఖంలో యేదో తేజస్సు. అతని గుహ వెనుక కొన్ని విశ్రాంతి గదులున్నాయి. అతని శిష్యులు, శిష్యురాళ్ళు ఉత్తర భారత దేశంనుండి కూడ వచ్చిపోతుంటారు. ఆ వచ్చేవారికోసమే ఆ విశ్రాంతి గదులు.

సాయినాథ్, తనతో చిన్నపాటి ఇంటర్వ్యూ లాంటిది తీసుకున్నాడు.

"నాయనా! నువ్వు యే కార్యము కోరి ఇక్కడకు వచ్చావు? విపులంగా చెప్పు! ధైర్యసాహసాలు కలిగిన నీవంటి శిష్యుడిని కలిగి ఉండటం నాకు యెంతో గర్వకారణం. నీ కోరికకు తగిన విద్యలు నేర్పుతాను!" అన్నాడు.

"నేను బాగా డబ్బు సంపాదించి—చాలా గొప్పవాడిని కావాలి—ఎంతటి గొప్పవాడిని అంటే ప్రపంచం నా గురించి చెప్పుకోగలిగేంత గొప్పవాడిని కావాలి!

గురువుగారు అదే నా కోరిక. దానికోరకు అవసరమైన తంత్రవిద్యలు నేర్పితే ధన్యుడనౌతాను!" అంటూ రెండు చేతులు జోడించాడు.

సాయినాథ్ ధ్యానంలో నుంచి బయటికి వచ్చి కళ్ళు తెరవగానే—సురేష్ మనస్సులో చూస్తున్న గతం నీడలు కరిగిపోయాయి.

"శిష్యా! దుర్గ నీకు ఇంకా వశం కాలేదు కదూ!"

"గురువుగారు మన్నించాలి! నేనెన్ని ప్రయత్నాలు చేసినా దుర్గ నా వశం కావడంలేదు!" బాధగా అన్నాడు.

"ఆ అమ్మాయిని వివాహం చేసుకోకుండా ఆమె ఇష్టంతో నువు మూడు రాత్రులు అనుభవిస్తేగానీ— నువ్వు గొప్పవాడివి కాలేవు! త్వరగా ఆ అమ్మాయిని నీ దారిలోకి మరల్చుకో!"

సురేష్‌కు ఓ చిన్న అనుమానం ఉదయించింది. అది గురువుగారిని అడిగి తీర్చుకోవాలనుకున్నాడు.

"గురువుగారూ! దుర్గకు మారుగా మరో అమ్మాయితో ఆ ఫలసిద్ధి కలుగదా?"

గురువుగారి కళ్ళు ఎర్రబడ్డాయి.

"లేదు! దివ్యదృష్టితో చూసి-దేవి అనుగ్రహం కొరకు ఆ అమ్మాయి సరిపోతుందనే నిర్ణయించాను. ఆ అమ్మాయి తప్పించి మరో అమ్మాయి అస్సలు పనికిరాదు! కాబట్టి నువ్వు ఆ అమ్మాయిని నీ దారిలోకి తెచ్చుకో!"

"గురుదేవా! లౌకిక మార్గాలనేకం నేను చేపట్టి నిష్ఫలులన్నయ్యాను. వశీకరణ మంత్రం యేదైనా ఉపదేశించండి. దానితో తప్పకుండా ఆమె లొంగుతుంది.

మాంత్రికుడు సాయినాథ్ కాస్సేపు యోచించి—

అతనికి ఒక వశీకరణ మంత్రం ఉపదేశించాడు.

సురేష్ "మహా భాగ్యం" అని శిరస్సువంచి నమస్కరించాడు.

ఆ రోజు సాయంత్రమే హైద్రాబాదుకు తిరుగు ప్రయాణమయ్యారు.

## 10

మహా మాంత్రికుడు సాయినాధ్ ఉపదేశించిన వశీకరణ మంత్రాన్ని అమలు పరిచాడు సురేష్. మరుసటి రోజునుండి దుర్గ అతనికి వశం కావాలి. కానీ—దుర్గమీద ఆ మంత్రం విఫలమైంది.

సురేష్ మాత్రం నిష్ఫలం అయినందుకు నిర్ఘాంత పోయాడు.

కారణం యేమిటో అంతు బట్టలేదు అతనికి. అప్పటి వరకు నేర్చుకున్న విద్యలతో వశపరుచుకున్న కర్ణ పిశాచిని అడిగాడు.

"ఆమె దైవభక్తురాలు. ఆమె చుట్టూ ఒక పవిత్రమైన శక్తివంతమైన వలయం ఉన్నది. ఈ క్షుద్రశక్తులేవి ఆమె దగ్గరకి వెళ్ళలేవు. వాటికా శక్తిలేదు. అందుకే ఆమెమీద యెటువంటి విద్యలూ పనిచేయవు. వశీకరణ విద్య నిష్ఫలం అవడానికి అదే కారణం!" అని చెప్పి వెళ్ళిపోయింది కర్ణపిశాచి.

సురేష్‌కు ఏం చేయాలో అర్థంకాక తెల్ల మొహం వేసి అలా కూర్చుండి పోయాడు.

## 11

రాత్రి తొమ్మిది గంటలు.

క్రింది గదిలో గందరగోళంగా ఉంది. సురేష్ స్నేహితులు త్రాగి తందనా లాడుతున్నారు.

పైన సురేష్ ఒక్కడే విదేశీ మద్యం సేవిస్తున్నాడు. అతను హద్దుకు మించి త్రాగి పూర్తి ఔట్ అయ్యే సిటిలో వున్నాడు. అంత త్రాగినా అతనికి విచక్షణా జ్ఞానం నశించలేదు. చాలా చురుగ్గా ఆలోచించగలుగుతున్నాడు. కాకపోతే—అతని శరీరం అతని స్వాధీనంలో లేదు.

మరో పెగ్గు వేసుకున్నాడు.

అతనికి దుర్గ గుర్తొచ్చింది.

దుర్గ పక్క గదిలోనే ఉంది. బహుశా చదువుకుంటూ ఉండి ఉంటుంది.

సురేష్ లేచి నిలబడ్డాడు.

చేతిలో సీసా వుంది.

అతను నడక ప్రారంభించాడు. కాళ్ళు స్వాధీనంలో లేవు—నడక తడబడుతోంది. నాలుగు దారులు నడుస్తున్నాడు. తను నాలుగు దారులు నడుస్తున్నానని, తన కాళ్ళు స్వాధీనంలో లేవు అని అతనికి స్పష్టంగా తెలుస్తోంది. అతను యింకా త్రాగుతున్నాడు. తను కోరుకున్నంత నిషా ఈ మద్యం ఇవ్వడంలేదని అతనికి కసిగా ఉంది. విదేశీ మద్యం అతనికి నచ్చడంలేదు.

ప్రక్క గదిలోకి దారితీశాడు. తలుపు గడియ వేసి వుంది.

కాలింగ్ బెల్ నొక్కాడు.

క్షణంలో తలుపులు తెరుచుకున్నాయి.

ఆమె యేదో పుస్తకం చదువుతూ కూర్చున్నట్లుంది. అందుకే అంత త్వరగా తలుపులు తెరుచుకున్నాయి.

సురేష్ అవతారం చూసి దుర్గ నిట్టూర్చింది. "లోపలికి రా అంకుల్!" అంది అయిష్టంగానే.

కళ్ళు చతురస్రాకారంగా తిరుగుతూ వుండగా—నాలుగు దారులు నడుస్తూ—బెడ్ మీద వాళ్ళి పడి పోయాడు.

దుర్గ సాయంతో మళ్ళీ లేచి కూర్చున్నాడు.

"ఏమిటి అంకుల్! చాలా తాగేసావ్! నీ ఆరోగ్యం యేం కావాలి?"

"నా ఆరోగ్యానికేం కాదు. పాపి చిరాయువు అన్నారు. నేను పాపిష్ఠివాడిని కదా! నేను చాలా కాలం బ్రతుకుతాను. ఈ విషయంలో నువ్వేమీ బెంగ పడక్కర్లేదు!" తడబడుతూ మాట్లాడుతున్నాడు. మాట స్పష్టంగా రావడంలేదు.

"ఈ మాటలన్నీ కుదర్దు వేస్టు. నువ్వు తాగడం మానెయ్యాలి. ఇలా తాగి నా గదిలోకి రావడం కూడా నువ్వు మానెయ్యాలి" సీరియస్ గా అన్నది దుర్గ.

"చూడు దుర్గా! నేను తాగడం, నీ గదిలోకి రావడం ఈ రెండింటి వెనుక చాలా బలవత్తరమయిన కారణాలున్నాయి!"

"బలవత్తరమయిన కారణాలా? ఏమిటవి?"

"నీకు చెప్పాలా?"

"ఔను చెప్పాలి!"

"చెప్పకపోతే—"

"బలవత్తరమైన కారణాలు అన్నారు కనక—వాటిని తెలుసుకుంటే—మనిద్దరికీ మంచిది కదా! నా గదిలోకి రావడానికి గల బలవత్తమైన కారణ మేమిటో నాకు తెలియడం చాలా అవసరం!"

"నీకు కారణాలు తప్పకుండా చెప్తాను!.... చెప్పే

ముందు...." కాసేపాగాడు.

"ఇపుడు....ఇపుడు నేను నీ గదిలో నాట్యం చేస్తాను, నువ్వు అభ్యంతరం పెట్టకూడదు!"

"నాట్యమా!" దుర్గ ఆశ్చర్యంగా చూసింది.

"యస్! నాట్యమే! నీకేమైనా అభ్యంతరమా?"

"నువ్వు నాట్యం కూడా చెయ్యగలవా?" నమ్మలేనట్టు చూసింది దుర్గ.

"నాకు కూచిపూడి, భరతనాట్యం, మణిపురి, ఒడిస్సీ బాగా తెలుసు. అవసరార్థం నేర్చుకున్నాను."

"అవసరమా!"

"యస్!"

"నీకు నాట్యంతో ఏమవసరం! కొంపదీసి సినిమాల్లో చేరాలనే అభిలాష కలిగిందా?"

"నో....నో....నో....అలాంటి ఆశలు అభిలాషలు ఏమీ లేవు. నేను ఈ గదిలో నాట్యం చెయ్యొచ్చా, లేదా చెప్పు?"

"చెయ్యండి. నాట్యం చేస్తానంటే ఎవరైనా వద్దంటారా? అయినా ఈ స్థితిలో మీరు నాట్యం చెయ్యలేరనుకుంటాను."

"నేను ఒకసారి నాట్యం చెయ్యడం మొదలుపెట్టానంటే—నా స్థితి బాగుపడుతుంది. నాట్యం పూర్తి అయిన తర్వాత—నువ్వు నా గదిలోకి రావాలి!"

"గదిలోకా? అక్కడి కెందుకు?"

"నిన్ను నగ్నంగా చూడటానికి!"

"ఏమిటా పాడు మాటలు, నీకు నిషా తలకెక్కినట్టుంది!"

"నిజం చెప్పాలంటే—నేను 'వీరేంద్రుడి'ని కావా

లనుకుంటున్నాను" అతని కళ్ళు మెరిశాయి.

"వీరేంద్రుడివి కావాలనుకుంటున్నావా? ఏమిటో నీ మాటలు బొత్తిగా అర్థం కావడంలేదు, బాగా నే ఎక్కినట్లుంది నీకు!"

సురేష్‌కు రవ్వంత కోపం వచ్చింది.

"నీకు అర్థం కాలేదా? అర్థమౌతుందనుకొని చెప్పాను. స్పష్టంగా చెప్పాలంటే — నాట్యం పూర్తి అయిన తర్వాత నీతో రతికేళి జరపాలి!" స్పష్టంగా అన్నాడు.

దుర్గ వినలేనట్లు చెవులు మూసుకుంది.

అతని వింత ప్రవర్తనకి విస్తుపోయింది.

"నా విల్లింగ్ లేకుండా....అటువంటి నీచానికి ఒడిగడితే—నువ్వు నరకానికి వెళతావు—నువ్వు అనుకున్నది ఏదీ కాదూ—దయచేసి వెళ్ళిపో!"

"ఆల్‌రైట్! నీ విల్లింగ్ లేకుండా ఏ పనీ చెయ్యను. విల్లింగ్ ఉన్న స్త్రీలు క్రిందిగదిలో చాలామంది ఉన్నారు. నేను అక్కడికే వెళ్తాను. వెళ్ళేముందు నేను ఎందుకిలా ప్రవర్తించానో కారణం చెప్పి వెళతాను-?"

శ్లో॥ "మద్యం మాంసం తథా మత్స్యం
ముద్రా మైథున మేవచ మకార
పంచకం చైవ దేవతా ప్రీతి కారకం!" అంటూ గది తలుపు తెరచుకుని బయటికి వెళ్ళాడు.

ఆమె నోరు తెరిచి ఆశ్చర్యంగా అతనివైపే చూస్తూ నిలబడింది.

## 12

ఉదయం ఆరు గంటలు.

దుర్గ స్నానాదులు ముగించుకుని పూజ చేసుకుంటుంది. సురేష్ ఆమె రాక కొరకు హాల్లో పేపరు చూస్తూ

కూర్చున్నాడు.

దాదాపు పావు గంట తర్వాత—

దుర్గ పూజ ముగించుకొని—హాల్లోకి వచ్చింది.

"దుర్గా! రా!" అంటూ ఆప్యాయంగా పిలిచాడు సురేష్.

దుర్గ వచ్చి సోఫాలో కూర్చుంది.

"నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి!"

సీరియస్ గా కనిపించాడు. నిజంగానే ఇదేదో ముఖ్య విషయం అయి ఉంటుందనుకుంది.

"మాట్లాడు అంకుల్! నేను ఫ్రీగా ఉన్నాను!" అంది.

"నీ ఫ్యూచర్ ప్లాన్స్ యేమైనా ఉన్నాయా?"

క్రొత్తగా మాట్లాడుతున్నట్లనిపించింది.

ఆమె క్షణంసేపు ఆలోచించి-"ఉన్నాయి!" అన్నది.

"ఏమిటవి?" సీరియస్ గా అడిగాడు.

"త్వరగా పెళ్ళిచేసుకోవడం! ఓ ఇద్దరు పిల్లలకు తల్లి కావడం! ఇవి నా ఫ్యూచర్ ప్లానులు!"

"ఓస్ అంతేనా.... నేనూ అదే విషయం మాట్లాడా లనుకుంటున్నాను" అని కాస్సేపాగాడు.

"యాదగిరి గురించి నీ అభిప్రాయ మేమిటి?"

"వెరీ నైస్ పర్సన్!"

"అతనిదీ మన కులమే!"

"కావచ్చు...."

"అతను నీ భర్త కావడం నీ కిష్టమేనా?"

దుర్గ తలెత్తి సురేష్ ముఖంలోకి సూటిగా చూసింది.

ఆమె ముఖంలో యే భావమూ లేదు.

తల వంచుకొని—రెండు నిమిషాలు ఆలోచించి—ఆ

తర్వాత "నీ ఇష్టం అంకుల్!" అన్నది.

"అలా కాదు! నీ ఇష్టా ఇష్టాల విషయం కావాలి!"

"నా కిష్టమే కానీ—నా కొరకు అతన్నే యెందుకు ఎంచారో తెలుసుకోవాలనుకుంటున్నాను!"

"యాదగిరి మొదట్నుంచి నాకు బాగా తెలుసు. మంచి మనసున్నవాడు, ఎటువంటి చెడు అలవాట్లు లేవు. మనింట్లో మనిషిగా మనవాడుగా నమ్మకంగా ఉంటాడు. అందుకే ఈ నిర్ణయానికి వచ్చాను!"

దుర్గ మౌనంగా విని ఏమీ వ్యాఖ్యానించలేదు.

అప్పుడే యాదగిరి వచ్చాడు.

"రా! రావోయ్ కూర్చో!" అంటూ ఆహ్వానించాడు.

అతనొచ్చి కూర్చున్నాడు.

క్రితం రోజే—అన్ని విషయాలు ఇద్దరు మాట్లాడుకున్నారు.

దుర్గను చేసుకోవడానికి యాదగిరి తన సంసిద్ధతను తెలియజేసాడు.

దుర్గ అతన్ని ఈ వేళ క్రొత్త కోణంలోనుంచి పరిశీలించి చూసింది.

తన భర్త హోదాలో యెలా ఉంటాడని చూసింది.

అతను ఆమెకు నచ్చాడు.

యాదగిరి అయిదు అడుగుల యెనిమిది అంగుళాల పొడవు. చామనఛాయ,ఎత్తుకు తగిన లావుతో—నీట్ గా డ్రస్ చేసుకొని ఉన్నాడు.

డబ్బు గురించి తనకు యెలాంటి బాధలేదు. దాదాపు పాతిక లక్షల ఆస్తి సంపాదించారు నాన్నగారు. అది వివిధ రూపాల్లో వుంది.

దాన్ని సంరక్షించడమేకాదు — పెంచేటటువంటి

శక్తి సామర్థ్యాలు యీదగిరికి ఉన్నాయి. అంతకన్నా తనకు కావల్సినదేమీ లేదు.

బ్రాహ్మణుల్ని పిలిచి ముహూర్తాలు నిర్ణయించుకున్నారు. పెళ్ళికొడుకు తరఫుగానీ, పెళ్ళికూతురు తరఫుగానీ— పెద్దలు యెవ్వరూ లేరు. అంతా మిత్రబృందమే. వారం రోజుల్లో పెళ్ళి వైభవంగా జరిపించాడు సురేష్.

పెళ్ళి తర్వాత జరిగే శుభకార్యం—

శోభనం—....

ఆ రోజే నూతన దంపతులకు శోభనం.

జీవితంలో అత్యంతి మధురమైన ఘట్టాల్లో శోభనం ఒకటి. ఇది ఎందరికో ఆనందప్రదాయమైతే—కొందరికి విషాదాన్నికూడా కలిగిస్తుంది. దానికి కారణాలు అనేకం.

కొందరికి జెనిటికల్ డిఫెక్ట్స్ ఉంటాయి. ఈ జెనిటికల్ డిఫెక్ట్స్ స్త్రీలకు ఉండొచ్చు — పురుషులకు ఉండొచ్చు. డిఫెక్ట్స్ ఎవరికున్నా ఆ రాత్రి కాళరాత్రే అవుతుంది.

మరి కొందరికి సైకాలాజికల్ డిఫెక్ట్స్ ఉంటాయి. ఈ డిఫెక్ట్స్ స్త్రీకున్నా, పురుషుడికున్నా ఆ నూతన దంపతులు ఆశాభంగాన్ని యెదుర్కోక తప్పదు. తను స్త్రీని సంతృప్తిపరచలేనేమో నన్న అనుమానముంటే చాలు—అతను ఆ రాత్రి ఫెయిల్ అయ్యే అవకాశముంది. కాకపోతే మరుసటి రోజు ప్రయత్నంద్వారా అతను సక్సెస్ కావచ్చు. స్త్రీలలో కొందరికి జడత్వం (ఫ్రిజీడిటి) ఉంటుంది. వాళ్ళు సెక్సువల్ గా యెంత మాత్రం స్పందించరు.

దుర్గలో శారీరకంగా, మానసికంగా ఏ లోపంలేదు.

ఆమె పరిపూర్ణ స్త్రీ.

యాదగిరిలోనే యేదో లోపం ఉన్నట్లుంది, అతను ఎంత ప్రయత్నించినా ఆ గోడా సక్సెస్ కాలేకపోయాడు.

దుర్గ ముందు సిగ్గుతో చచ్చిపోయాడు. ఆత్మహత్య చేసుకోవాలని మొదటిసారిగా అనిపించింది. అతను తల దించుకున్నాడు.

ఆమె ఏమీ అనలేకపోతోంది.

ఆమె తన ప్రయత్న లోపమేమీ లేకుండా అతనికి పూర్తిగా సహకరిస్తోంది.

అయినా యేమీ ప్రయోజనం కలుగలేదు.

పాపం ఆ దంపతులు తెల్లవార్లు నిద్రలేకుండా గడిపారు.

భళ్లున తెల్లవారింది.

దుర్గ పూజ ముగించుకొని—గదిలోకి వచ్చింది.

యాదగిరి తల పట్టుకొని కూర్చున్నాడు.

ఆమె దగ్గర కెళ్ళి కూర్చుంది.

యాదగిరికి బెరుగ్గా, భయంగా ఉంది.

దుర్గ సన్నగా గొంతు సవరించుకొని—"ఏమండీ...." అంది.

యాదగిరి ఉలిక్కిపడి—తల తిప్పి చూసాడు.

"ఏమిటి?"

"డాక్టర్ దగ్గరికి కెళ్దామా!"

"వూఁ వెళ్దాం! నేనూ అదే ఆలోచిస్తున్నాను!"

ఆ రోజే వారు డాక్టర్ని సంప్రదించారు.

డాక్టరుగారు, అన్ని పరీక్షలు చేసి — "చూడండి యాదగిరిగారు, మీకు శారీరకంగా ఎటువంటి లోపమూ కనిపించడంలేదు. సెక్సుకు కేంద్రం మనస్సు—మనస్సు

మీద మీరు కంట్రోల్ ఉంచుకోవాలి. మానసికమైన ఇబ్బంది ఉంటే, దాన్ని మీరు తొలగించుకుంటే-మీరు తేలికగా సెక్సులో పాల్గొనవచ్చు!" అన్నాడు.

"డాక్టరుగారు! నేను మానసికంగా యెటువంటి బాధను అనుభవించడంలేదు. మరి ఎందుకు నాకీ బాధ!"

"మీరు ఇంతకుముందు యెప్పుడైన — సెక్సులో పాల్గొన్నారా!"

"నో! లేదు, నాకా అవకాశం చిక్కలేదు!"

డాక్టర్‌గారు అతన్ని మరికొన్ని ప్రశ్నలువేసి— ప్రిస్క్రిప్షన్ రాసి ఇచ్చి—"ఈ మందులు వాడండి.... ఈ రాత్రికి తప్పకుండా ఫలితం కనిపిస్తుంది!" అన్నాడు.

నూతన దంపతులిద్దరూ—ప్రిస్క్రిప్షన్ తీసుకొని వెళ్ళిపోయారు.

ఆ రోజు సాయంత్రమే అర్జంటు పనిచెప్పి యాదగిరిని బొంబే పంపించాడు సురేష్.

## 13

రాత్రి పది గంటలు.

దుర్గ 'దాంపత్యదీపం' అనే పుస్తకం చదువుతూ కూర్చుంది.

ఆమెకు తమ దాంపత్యం గురించి బెంగపట్టుకొంది.

కాలింగ్ బెల్ మ్రోగింది.

ఆమె పుస్తకం మూసేసి—ఒక్క అడుగులో తలుపు దగ్గరికెళ్ళింది. తన భర్త వచ్చాడనే వూహాలో ఉంది.

తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా సురేష్, అతని చేతిలో విదేశీ మద్యం బాటిల్ ఉంది.

ఆమె తలుపు దగ్గరే నిల్చొని "ఏంటి అంకుల్, ఇలా

వచ్చావేం?" అని అడిగింది.

సురేష్ తిన్నగా నిలబడలేకపోతున్నాడు.

వూగుతున్నాడు.

"దారికి అడ్డం నిలబడ్డావు! లోనికి రానివ్వవా?" ఇంటాక్సికేటడ్ కండిషన్‌లో ఉండటంవల్ల మాట తడబడుతోంది.

"లోని కెందుకు, పద నీ బెడ్‌రూంలో వదిలేసి వస్తాను!" అన్నది.

సురేష్ చేయి అందించాడు.

అతని చేతిని తన భుజంమీద వేసుకొని—పడకగది లోకి తీసుకు వెళ్ళింది.

తన పడక గదిలోకి వెళ్ళిన తర్వాత—సురేష్ వెనక్కు తిరిగి తలుపులు మూసి బోల్టు వేసేసాడు.

"అంకుల్, ఏమిటిది? తలుపులు తెరువు!" గట్టిగా అరిచింది.

"అరె, ఎందుకలా భయపడ్డావ్! నువ్విలా రా!" అంటూ బెడ్ దగ్గరికి తీసికెళ్ళాడు.

దుర్గ భయపడుతూనే బెడ్ దగ్గరికి వొచ్చింది.

"నిన్నేం చేయను. రాత్రి యేం జరిగిందో, నాకు పూసగుచ్చినట్లు చెప్పాలి!"

ఆమెకు కోపం వచ్చింది.

"ఏం జరుగుతుంది, అందరి పడకగదుల్లో ఏం జరుగుతుందో—అదే జరుగుతుంది. అది అడగవలసిన విషయమేనా?" చీదరించుకుంది.

"నో....నో....నో! అందరి పడక గదుల్లో జరిగినట్లు జరిగితే—నిన్ను ఇలా అడగవల్సిన అవసరం ఉండదు. మీ గదిలో కొద్దిగా నూతనత్వం ఉంది. అదే....అదే

నేను తెలుసుకోవాలనుకుంటున్నాను. కమాన్ చెప్పు!"

"నేను చస్తే చెప్పను!" అంటూ లేచిపోబోయింది.

సురేష్ నవ్వాడు—

"చూడు దుర్గా! నువ్వు చెప్పక్కర్లేదు. ఏం జరిగిందో నేను చెప్తాను. నువ్వు విను....విని, నిజమో కాదో చెప్పు!"

దుర్గ తల వొంచుకుంది.

అతను జరిగింది జరిగినట్లుగా చెప్పసాగాడు.

దుర్గ నిర్ఘాంతపోయి చూసింది.

"ఛీ! దుర్మార్గుడా! అలా చూడటానికి నీకు సిగ్గు వేయలేదు. నువ్వు మనిషివి కాదూ...." కోపంతో వూగిపోయింది.

"దుర్గా! నీకు ఇంకొక విషయం చెప్పనా! అతను నిన్ను ఈ జన్మలో సుఖపెట్టలేడు. అతను మగవాడు కాడు...." వికటట్టహాసం చేసాడు.

దుర్గ అవమాన భారంతో యేడుస్తూ కూర్చుంది.

"అంచేత నీకు .... మగదిక్కుని నేనే! రా!!" అంటూ దుర్గను మంచంమీదికి లాగాడు.

"ఛీ! దుర్మార్గుడా వదిలెయ్!" అంటూ గింజుకుంది.

సురేష్ ఆమె జాకెట్టు చించెయ్యడానికి ప్రయత్నించాడు. కానీ లాభంలేకపోయింది.

ఆమె మీదపడి మానభంగం చేయడానికి ప్రయత్నించాడు. కానీ అతనా పని చేయలేకపోయాడు.

ఆమె తప్పించుకొని—ఆ గదిలోంచి బయటపడి బయట బోల్టు వేసింది.

ఆ రాత్రి అతను మళ్ళీ తన గదిలో నుంచి బయటికి వెళ్ళలేకపోయాడు.

# 14

ఉదయం తొమ్మిది గంటలకు బొంబాయినుండి ఫ్లైట్‌లో ఇంటికొచ్చాడు యాదగిరి.

స్నానాదులు ముగించుకొని — దుర్గ పడకగదిలోకి వచ్చాడు—

యాదగిరిని చూడగానే ఆమెకు దుఃఖం ఆగలేదు.

అగి....అగి....అగ్నిపర్వతం బ్రద్దలై లావా బయటికి చిమ్మినట్లు ఆమె అతనిమీద పడి భోరున యేడ్చేసింది.

యాదగిరి ఆమెని పొదివి పట్టుకున్నాడు.

జరిగిందేమిటో తెలియక కంగారు, భయం అతన్నావహించాయి.

"దుర్గా! ఏమైంది....ఎందుకేడుస్తున్నావ్!"

అదే కంగారుతో అడిగాడు.

ఆమె దుఃఖం మరింత యెక్కువై గంగాఝరిలా ప్రవహిస్తోంది.

ఆమెను కాస్సేపు అలా యేడ్వనిచ్చాడు.

దుఃఖం పూర్తి అయిన తర్వాత నిమిత్తంగా కూర్చుంది.

ఆమె కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా వున్నాయి.

యాదగిరి మళ్ళీ అడిగాడు—"ఎందుకేడుస్తున్నావు!"

దానికి సమాధానంగా — "యేమండి, మనం ఈ ఇంట్లోంచి వెళ్ళిపోదామండీ!" అన్నది.

"ఎందుకేడుస్తున్నావు అని అడిగితే ఇంట్లోంచి వెళ్ళిపోదామంటావేమిటి? అసలు ఏం జరిగిందో నాకు చెప్పు!" అని రెట్టించి అడిగాడు.

"అంకుల్ రాత్రి....నన్ను బలత్కారం చేయబోయాడు. ఎలాగో తప్పించుకొని బయటపడ్డాను. ఈ ఇంట్లో వుంటే— నేను అతని పాశవిక ప్రవృత్తికి బలికాక

తప్పదు ...మనం ఇక్కడ్నుంచి వెంటనే వెళ్ళిపోదాం!"
అంది.

యాదగిరి కోపోద్రిక్తుడయ్యాడు.

"ఇంత మదాంధుడై ఎందుకు ప్రవర్తిస్తున్నాడో నా కర్థం కాలేదు— మేనకోడలు, పైగా స్నేహితుని భార్య అనే ఇంగితజ్ఞానం కూడా లేదా, అతనికి! ఇటువంటి వ్యక్తి ఉండడి ఇంట్లో ఉండటంకూడ మంచిదికాదు, పద వెళ్లాం!"

దుర్గ తన సామానంతా సర్దుకుంది.

సురేష్‌వచ్చి రాత్రి యేదో త్రాగిన మైకంలో తాను అలా చేశానని క్షమించమని కోరాడు.

వాళ్ళు ససేమిరా ఆ ఇంట్లో ఉండటానికి ఒప్పుకో లేదు.

"ఆల్ రైట్, మీకు ఇంట్లో ఉండటం అంత కష్టంగా ఉంటే వెళ్ళిపోండి, కానీ— ఈ సురేష్‌ని మరవకండి!" అన్నాడు బాధగా.

వారు మారు మాట్లాడకుండా— తట్టబుట్టా సర్దుకొని యాదగిరి స్వంత ఇంటికి వెళ్ళిపోయారు.

మూడు గదుల చిన్న యిల్లు అది.

అచ్చం బ్రహ్మచారి ఇల్లులాగే వుంది. అంతా దుమ్ముగా ఉంది. ఇంట్లో రెండు మామూలు ఫోల్డు మంచాలు, కొన్ని స్టీలుకంచాలు, కిరసనాయిలు స్టౌ, గోడలకు ప్రకృతి చిత్రాల పోస్టర్లు అందంగానే ఉన్నాయి.

సూట్ కేసులు ప్రక్కన పెట్టి— పునరుద్ధరణ కార్య క్రమాన్ని చేపట్టారిద్దరూ.

బండలు కడగాల్సి వచ్చింది. ఇంట్లో ట్యాప్ లేదు. వందగజాల దూరంలో గవర్నమెంటువారి బోరింగ్

వుంది. నీళ్ళు అక్కడినుండి తెచ్చుకోవాలి.

ఇద్దరూ కలిసి బోరింగు నుంచి నీళ్ళు మోసారు.

దుర్గ ఇల్లంతా బాగా కడిగి—ఇంటిముందు నీళ్ళు చల్లి ముగ్గులు వేసింది.

మొత్తానికి ఇల్లు నీట్ గా తయారైంది.

యాదగిరి బజారుకు వెళ్ళి — బియ్యం, నూనె, కూరగాయలువంటి పెద్ద లిస్టు ఒకటి రాసుకొని వెళ్ళి రిక్షాలో అన్ని తెచ్చిపడేశాడు.

దుర్గకు వంటలో సాయం చేశాడు యాదగిరి.

మొత్తానికి ఇద్దరూ కలిసి - చక్కని భోజనం సిద్ధం చేసుకున్నారు.

అందరు నూతన దంపతుల్లాగే వాళ్ళు సూర్యాస్తమయం ఎప్పుడౌతుందా అని యెదురు చూడసాగారు.

వాళ్ళు యెదురు చూసిన సూర్యాస్తమయమైంది.

దురదృష్టవశాత్తూ - ఆ దంపతులకు మళ్ళీ ఆ రాత్రి కాళరాత్రే అయింది.

యాదగిరి యెందుకో - తన కార్యక్రమంలో విజయం సాధించలేకపోతున్నాడు.

"ఏమండీ, మీరు యేమీ అనుకోనంటే - ఓ మాట అడుగుతాను!" అంది అతని ముఖంలోకి చూస్తూ.

"అడుగు!" అన్నాడు నిర్లిప్తంగా.

"వైద్యపరంగా ప్రయత్నించాము, యేమీ ఫలితం కనిపించలేదు. తీర్థయాత్రలకు వెళ్ళి - పుణ్యక్షేత్రాలను, సాధువులను దర్శించుకుందామండీ, ఏమైనా ఫలితం కనిపించవచ్చు!" అన్నది.

దుర్గ చెప్పిన సూచన అతనికి నచ్చింది.

అతను తన సమ్మతిని ఆమెకు తెలిపాడు.

మర్నాడు - దుర్గ బ్యాంకుకు వెళ్ళి పాతికవేలు డ్రా చేసింది. కొంత క్యాష్, మిగతాది ట్రావెలర్స్ చెక్ రూపంలో. ఆ రోజే వారి ప్రయాణం మొదలైంది.

ఋషికేశ్ సమీపంలో భవతారిణి అనే సన్యాసిని కలుసుకున్నారు. ఆమె ధ్యానంలో నిమగ్నమైంది. కషాయాంబరధారిణి. నలభై యేళ్ళుంటాయి. ముఖంలో బ్రహ్మతేజస్సు.

దుర్గ, యాదగిరి వెళ్ళి ఆమె సమీపంలో కూర్చున్నారు.

కాసేపటి తర్వాత భవతారిణి కళ్ళు తెరచి - ప్రసన్నంగా వాళ్ళవైపు చూసింది.

ఆ నవ దంపతులిద్దరూ ఆమె కాళ్ళమీబడి సాష్టాంగ నమస్కారం చేశారు.

ఆమె "సుపుత్ర ప్రాప్తిరస్తు!" అని దీవించింది.

వాళ్ళిద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు.

కాస్సేపు నిశ్శబ్దం.

భవతారిణి యోగశక్తిచేత వాళ్ళచ్చటికి రావడానికి గతమేమిటో తెలుసుకోగలిగింది. అంతేకాదు - వాళ్ళిద్దరి వృత్తాంతమంతా ఆమెకు తెలిసిపోయింది.

"యాదగిరిజీ! మీరు దేని గురించో తీవ్రంగా బాధ పడుతున్నారు? ఏమిటి మీ బాధ!" స్వచ్ఛమైన హిందీ భాషలో అడిగింది.

యాదగిరి చెప్పదామని నోరు విప్పాడు-కానీ - యెలా చెప్పాలో తెలియక-తికమక పడిపోయాడు. తన పేరు అడగకుండా ఉచ్చరించిన ఆమె శక్తిని చూసి అబ్బుర పడ్డారు ఇద్దరూ.

"దాంపత్య సంబంధమైన బాధను అనుభవిస్తున్నావు.

ఇది తాత్కాలికమే! సాయినాథ్, సురేష్‌లు కలసి నీ మీద ఒక పిశాచాన్ని ప్రయోగించారు. తాంత్రిక శక్తితో"!

వాళ్ళ ఆశ్చర్యానికి అంతులేదు భవతారిణి యిన్ని వాస్తవాలు చెబుతున్నందుకు. సురేష్ యెంత క్రూరుడో తెలిసి అసహ్యించుకున్నారిద్దరూ.

"మాతా, భవతారిణీ! మీరు చెప్పిందంతా అక్షరాల నిజం. ఈ కష్టంనుండి మీరే మమ్మల్ని గట్టెక్కించాలి!" అన్నారిద్దరూ ముక్త కంఠంతో.

భవతారిణి నవ్వింది.

"ఈ విభూతి రాసుకొని - మంత్రజలం సేవించండి- నిన్ను పీడిస్తున్న పిశాచం పారిపోతుంది. మీ జీవనం సుఖమయమౌతుంది!" అని విభూతి, మంత్రజలం వారికి ప్రసాదించింది.

"మహా ప్రసాదం!" అంటూ వారు దాన్ని స్వీకరించారు.

"మాతా! మీరు క్షమిస్తే, ఒక మాట అడగాలని ఉంది. నన్ను నానా బాధలు పెట్టిన మా అంకుల్ సురేష్‌కు బాగా బుద్ధి చెప్పాలని వుంది. మార్గం, దయ చేయి మాతా!" అని వేడుకొన్నది.

భవతారిణి నర్మగర్భంగా నవ్వి—"నీ కోరిక తప్పక నెరవేరుతుంది!" అభయమిచ్చింది.

"మరి! ఆ తాంత్రికుడు సాయినాథ్ ...." అర్థోక్తిలో ఆగిపోయాడు యాదగిరి.

"ఆ కార్యం నీవే నెరవేర్చాలని భగవదేచ్ఛ! అందుకు సహాయకంగా ఈ మాల ధరించు-ఇది నీకు సర్వవేళల రక్షగా ఉంటుంది!" అని ఓ రుద్రాక్షమాల తన మెడ

లోంచి తీసి అతనికి ఇచ్చింది భవతారిణి.

మహా ప్రసాదంగా స్వీకరించాడతను. మెడలో ధరించాడు దాన్ని.

తీర్థయాత్రలు ముగించుకొని తిరిగి హైద్రాబాదు చేరుకున్నారిద్దరూ.

## 15

ప్రక్కనే ఉన్న పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లోకి దూరింది దుర్గ.

సురేష్‌కు రింగ్ చేసింది.

అవతల రిసీవర్ ఎత్తారు.

"హలో, సురేష్ స్పీకింగ్" అన్నాడు.

"గుడ్ మార్నింగ్! నేను దుర్గను అంకుల్!"

"వెరీ గుడ్ మార్నింగ్, తీర్థయాత్రలకు వెళ్ళారని విన్నాను. ఎప్పుడొచ్చారు!"

"రెండు రోజుల క్రితమే వచ్చాము. నీకు ఫోన్ చేయడానికి వీల్లేక పోయింది!"

"ఔనూ, చెప్పా పెట్టకుండా వెళ్ళి వచ్చారేమిటి?"

"అనుకోకుండా ఫిక్సైంది ప్రోగ్రాం!"

"కొత్తగా పెళ్ళయిన జంట, హనీమూన్‌కు వెళ్ళడం విన్నాంగానీ-తీర్థయాత్రలకు వెళ్ళడం ఏమిటి?"

ఆమె నవ్వి-"ఇదో వెరైటీ, భక్తి, రక్తి అన్నమాట!" అన్నది.

"భక్తి లభించిందేమో కానీ-నీకు రక్తి లభించడం దుస్సాధ్యం."

"ఎందుకు సాధ్యం కాదు. నీలాంటి వారు ఒకరికో దొరక్కపోతారా!" అంది కవ్వింపుగా.

ఎదురు చూడని ఆ సమాధానానికి, సురేష్ ఖంగు

తిన్నాడు. ఏమీ అనలేక ఊరుకున్నాడు.

"మా వారు లేరు-ఇవేళ రాత్రికి వస్తావా అంకుల్!" అన్నది.

సురేష్ నిర్ఘాంతపోయాడు _ ఈ మాటలు అంటున్నది దుర్గేనా? చాలా మారిపోయింది. తమ మాత్రం యేం చేస్తుంది. భర్త నపుంసకుడు కదా!

"నువ్వు పిలవడమూ నేను రాకపోవడమునా! తప్పకుండా వస్తాను-ఎపుడు రమ్మంటావ్?"

"నైన్ ఓ క్లాక్! ఎదురుచూస్తుంటాను, బై..." అని ఫోన్ పెట్టేసింది.

సరిగ్గా తొమ్మిది గంటలకు సురేష్ వచ్చాడు.

దుర్గ లోనికి ఆహ్వానించింది.

పాత యిల్లే అయినా—చాలా నీట్ గా సర్ది ఉంది.

గదిలో ఒకవైపు టేబుల్. దానిమీద అందమైన టేబుల్ క్లాత్, విదేశీ మద్యము సీసాలు రెండు గ్లాసులు, మాంసము, జీడిపప్పు ఐస్ క్యూబ్స్.

అక్కడి హంగామా అంతా చూసి సురేష్ చాలా సంతోషపడ్డాడు.

"ఏమిటీ, ఈ యేర్పాట్లన్నీ నాకేనా!" అనుమానంగా అడిగాడు.

"నీవు కాకపోతే నాకా!"

"నువ్వు కూడా తీసుకో! అందులో తప్పేముంది?"

దుర్గ తియ్యగా నవ్వుతూ—బాటిల్ ఓపెన్ చేసి గ్లాసులో అతనికి సర్వ్ చేసి—ఐస్ క్యూబ్స్ వేసింది.

తను కూల్ డ్రింక్స్ తీసుకొని 'ఛీర్స్' చెప్పి—మందో పాసనకు అంకురార్పణ చేసింది.

"నీ పొందుకోసం నేను ఎంత ప్రయత్నించానో—ఆ భగవంతుడికే తెలియాలి. అందినట్లే అంది దూరమై పోయేదానివి. ఇన్నాళ్ళకు ఈ దేవత కరుణించింది. ఎన్ని జన్మల పుణ్యమో కదా!" విదేశీ మద్యం అతనిమీద పని చేయడం ప్రారంభించింది. ఒక సీసా మొత్తం ఖాళీ అయిపోయింది. ఆ టేబుల్ మీద ఇంకొక క్రొత్త సీసా వెలసింది.

దుర్గ గ్లాసు నింపి అందిస్తోంది.

సురేష్ పొట్ట నింపేస్తున్నాడు.

ఎడతెగకుండా—ఆ కార్యక్రమం అలా కొనసాగుతూనే ఉంది.

గోడగడియారం పదకొండు గంటలు కొట్టింది.

సీలింగ్ ఫ్యాన్ అతని కళ్ళలాగే గిరగిరా తిరుగుతోంది.

దుర్గ జడలోని మల్లెపూల గుబాలింపు అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

"దుర్గా! ఇకచాలు. బెడ్ రూంలోకి వెళ్దాం!" మాట తడబడుతోంది.

"ఊఁ ఊఁ, ఈ ఒక్క సీసా కానివ్వండి—వెళ్దాం!" అంది.

దుర్గ మాటను తీసి పారవేసే శక్తి ప్రస్తుతానికి అతనికి లేదు. దుర్గ టేప్ రికార్డర్ బటన్ నొక్కింది.

"అంకుల్! నీ గురించి నాకో చిన్న డౌటు చాలా కాలంగా ఉంది. అది తీర్చుకుందామని ఎప్పటినుంచో అనుకుంటున్నాను కానీ—యిన్నాళ్ళకు గానీ అవకాశం రాలేదు...."

"ఊఁ అడుగు చెప్తాను!" అన్నాడు.

"అయిదేళ్ళ క్రితం, నువ్వు చాలా పూర్‌వి. ఒక్క మాటలో చెప్పాలంటే—తినడానికి రెండు పూటలా సరిగ్గా భోజనం కూడా లభించేదికాదు! అంత పావర్టీలో నుంచి—ఏదో అద్భుతం జరిగినట్టు, ఇంత పెద్ద ఫర్నిచర్ షాపు ఎలా పెట్టగలిగావ్! ఇంత బ్యాంకు బాలెన్స్.... ఎలా సాధ్యమైంది నీకూ!" ఆసక్తి గల విద్యార్థినిలా ప్రశ్నించింది.

'ఛన్' మంటూ శబ్దం—

చేయి తగిలి గాజుగ్లాసు క్రింద పడింది. దాంతోపాటు మద్యం కూడ ఒలికింది.

"ఐయామ్ సారీ....! చేయి తగిలింది."

"నెవర్ మైండ్!" అంటూ ఇంకో గ్లాసులో మళ్ళీ మద్యం నింపింది.

సురేష్ ఇంకొకసారి సిప్ చేశాడు.

దుర్గ విషయాన్ని మళ్ళీ గుర్తుచేసింది. "అదా!" అంటూ పెద్దగా నవ్వాడతను.

"ఏం లేదు. వెరీ సింపుల్! కర్ణపిశాచి ఉంది కదా!" అంటూ ఆగాడు.

కర్ణపిశాచి అంటే ఏమిటో దుర్గకు అర్థం కాలేదు. కానీ—"అదంటే ఏమిటి?" అని ప్రశ్నిస్తే—ఏదీ చెప్ప కుండా దాటేస్తాడేమోనని భయంకొద్దీ—

"ఆఁ, ఉంది!" అంది.

"నాకు వశమయ్యాక మొదటిరోజు పిలిస్తే అక్కడి విశేషాలు, ఇక్కడి విశేషాలు....ఆ రహస్యాలు, ఈ రహస్యాలు చెప్తాను, అంది. అవన్నీ ఏమీ వద్దూ, ఈ చుట్టుపట్ల ఏమైనా నిధీ నిక్షేపాలు ఉంటే చెప్పు" అని అడిగాను!

"ఓ!" అన్నది కర్ణపిశాచి.

"నేషనల్ హైవే, 9 లో, 65_వ మైలు రాయికి ఉత్తరదిక్కున సరిగ్గా రెండువందల మీటర్ల దూరంలో ఒక పాడుబడిన దిబ్బవుంది. ఆ దిబ్బను అయిదు మీటర్ల లోతు త్రవ్వించు. అక్కడ నీకు రెండు లంకెబిందెలు దొరుకుతాయి. ఆ రెండు బిందెల నిండా నైజాం కాలమునాటి బంగారు నాణాలు దొరుకుతాయి!" అని చెప్పింది.

"అంతే. ఓ ఆటో అద్దెకు తీసుకొని—ఇద్దరు కూలీ వాళ్ళను తీసుకెళ్ళి—అక్కడ త్రవ్వించాను—కర్ణపిశాచి చెప్పినట్లుగా రెండు లంకెబిందెలు, వాటి నిండా బంగారపు నాణాలు దొరికాయి—ఆ తర్వాత నేను లక్షాధికారి నవ్వడం, ఫర్నిచర్ షాపు పెట్టడం జరిగింది—!" అని చెప్పి మరో పెగ్గు పుచ్చుకున్నాడు.

"అబ్బ! భలే గమ్మత్తుగా ఉందే! మరి నువ్వు క్రోకడైల్ కొలనులో ఈదడం, నీకు తెలియని గేయాలు చదవడం ఇవన్నీ ఎలా సాధ్యం అయ్యాయి!"

"చెప్పానుగా! ఇవన్నీ క్షుద్రశక్తుల సహాయంతో చేసినవే! అంతా మా గురువుగారి దయ!"

"అయనెవరు?" ఆసక్తి కనిపించకుండా అడిగింది.

"ఆయన.... ఆయన.... సాయినాథ్...." అంటూ ఇంకా యేదో చెప్పబోయాడు.

అంతే! ఆ తర్వాత అతను మాట్లాడలేకపోయాడు. అతని నోరు పడిపోయింది. కుర్చీలోనుంచి దభీమని క్రింద పడిపోయాడు.

దుర్గ స్పృహలేకుండా పడివున్న సురేష్‌ను ఆటోవాడి

సహాయంతో లేపి—ఉస్మానియా జనరల్ హాస్పిటల్ కు తరలించింది.

## 16

స్పెషల్ వార్డ్!

డాక్టర్ గారు పరీక్షించి—షీట్ మీద ట్రీట్ మెంట్ రాసి వెళ్ళిపోయారు.

నర్స్ వచ్చి సెలైన్ ఎక్కించింది.

సెలైన్ నెమ్మదిగా అతని రక్తంలో కలిసి పోతోంది.

సురేష్ స్పృహ లేని స్థితిలో ఉన్నాడు.

నర్సు ఎక్కడికో వెళ్ళింది.

దుర్గ కూడా ప్రక్కనే ఉన్న బాత్ రూంలోకి వెళ్ళింది.

అయిదు నిమిషాలు గడిచాయి.

దుర్గ బాత్ రూంలో నుంచి—స్పెషల్ వార్డులోకి వచ్చింది.

అంతే!

అక్కడి దృశ్యాన్ని చూసి 'కెవ్వున' కేక వేసింది.

ఆ కేకతో దిక్కులు పిక్కటిల్లాయి.

డాక్టర్లు, నర్సులు, వార్డ్ బోయ్ లు ఆ కేక విని గబ గబా అక్కడికి పరుగెత్తుకొచ్చారు.

అక్కడి దృశ్యాన్ని చూసి వారికి ఒళ్ళు గగుర్పొడిచింది. భయపడిపోయారు. వాళ్ళు ఎన్నో అటాప్సీలు చేశారు. ఎంతో భయంకరంగా యాక్సిడెంట్లు అయి వచ్చినవారికి ట్రీట్ మెంట్ లు కూడా చేశారు. అయినా వాళ్ళు యెపుడు యింతగా భయాందోళనకు లోను కాలేదు.

ఆ గదిలో సురేష్ లేడు.

అతని శవముంది.

కటిక వాడు జంతువును కోసి పేగులన్నీ బయట పార వేసి యే భాగానికా భాగం విడి విడిగా తీసి—ముక్కలు ముక్కలుగా నరికినట్లు—సురేష్ శవాన్ని — ఖండ ఖండాలుగా నరికి పేగులన్నీ సీలింగ్ ఫ్యాన్‌కు వ్రేలాడ దీశారు. సెలైన్ సీసా ఉన్నచోట అతని తల వ్రేలాడు తోంది. చేతులు ఒకచోట, కాళ్ళు ఒకచోట—డొక్క చించివేసిన దేహం ఒకచోట, కడు భయంకరంగా వ్రేలాడుతున్నాయి.

గది అంతా రక్తమయం.

ఒక డాక్టర్‌కు కర్తవ్యమేమిటో వెంటనే స్ఫురించి నట్లుంది.

ఫోన్ దగ్గరికి పరుగెత్తి—గబ గబా కంట్రోల్ రూంకు ఫోన్ చేశాడు.

పది నిమిషాల్లో హాస్పిటల్‌కు పోలీసులు వచ్చారు.

వాళ్ళు హాస్పిటల్లోని దృశ్యాన్ని చూసి—హడలి పోయారు.

ఫింగర్ ప్రింట్స్ బ్యూరోవాళ్ళు వేలిముద్రల కోసం గాలిస్తున్నారు.

పోలీసు ఫోటోగ్రాఫర్లు, ప్రెస్ ఫోటోగ్రాఫర్లు అక్కడి బీభత్స దృశ్యాన్ని కెమేరాలో బంధిస్తు న్నారు.

దాదాపు రెండు గంటల వృధా ప్రయాస తర్వాత— ఎటువంటి ఆధారాలు దొరక్క—హంతకు లెవరో మహా తెలివి కలవారుగా నిర్ణయించేశారు పోలీసులు.

సబ్ ఇన్స్పెక్టర్ రాజు పంచనామాలో అక్కడి

ప్రతి దృశ్యాన్ని — కాగితంమీదకు ఎక్కిస్తున్నాడు.

ఇన్ స్పెక్టర్ రవి, దుర్గను ప్రశ్నిస్తున్నాడు.

"మీ .... పేరు?"

"దుర్గ!"

"హతుడికి మీ రేమవుతారు?"

"మేన కోడలిని!"

"అతని వెంట యింకెవరయినా ఉన్నారా? మీ రేనా?"

"నే నొక్కదాన్నే!"

"అతని భార్య ..."

"విడాకుల కోసం, కోర్టులో కేసు అండర్ ట్రయిల్ వుంది....ఇందాక వాళ్ళింటికి ఫోన్ చేశాను. బహుశ మరో పావుగంటలో యిక్కడికి రావచ్చు!"

ఇన్స్పెక్టర్ రవి తల పంకించి—

"ఆవిడ పేరు...." నోట్ చేసుకోవడానికి సిద్ధమౌతూ అడిగాడు.

"లావణ్య!"

ఇన్ స్పెక్టర్ రవి ఆమె పేరు నోట్ చేసుకున్నాడు.

"పేషెంటు వెంట మీరే వున్నారు కదా! అతన్ని విడిచి మీ రెక్కడికి వెళ్ళారు?"

చెప్పింది....

"ఎంత సేపు వెళ్ళారు?"

"కొద్ది సేపే....బహుశా ఐదు నిమిషాలు?"

"అయిదు నిమిషాల్లో, ఈ ప్రేగులు తీయడం, తల నరకడం ఇవన్నీ యెలా సాధ్యమౌతాయి? యెంత ప్రవీణుడైనా కటికవాడైనా గంట తీసుకుంటాడు!"

"ప్రామిస్ అండీ! అయిదు నిమిషాల కంటే ఎక్కువ

సేపు నేను బయటికి వెళ్ళలేదు!" అన్నది అరచేయి తల మీద పెట్టుకుంటూ.

"మీ రెప్పుడైనా మాంసం కొట్టుకు వెళ్ళారా!"

"ఓ చాలాసార్లు వెళ్ళాను!"

"షాపు కీలో మాంసమో, ఖీమో ఇవ్వమంటే వాడు యెంత టైము తీసుకుంటాడు. సరిగ్గా షాపు గంట........ వాళ్ళెవరో గానీ - ఇతన్ని ఖీమా చేశారు కదా! అయిదు నిమిషాల్లో ఇదంతా ఎలా సాధ్యమౌతుంది....మీరు తప్పకుండా పొరపడ్డారు!"

"లేదు ఇన్‌స్పెక్టర్! మీరు కనకాంబరం నర్సును కనుక్కోండి, నేను పొరపడ్డా—ఆవిడ పొరపడటానికి వీలులేదు కదా!"

"ఆల్‌రైట్, నేను ఆ విషయం ఆమెను ప్రశ్నిస్తాను! నిజం చెప్పండి, ఈ హత్యతో మీ కేమైనా సంబంధం వుందా?"

"నాకు ఎటువంటి సంబంధం లేదు, నేను అలాంటి కసాయిదానిలా కనిపిస్తున్నానా, ఇన్‌స్పెక్టర్?" దుర్గ కళ్ళలో నీరు వచ్చాయి.

"నేరసుడు దొరికే వరకు మా కందరూ అనుమానితులే! బైదిబై మీ అంకుల్ ఆస్తి ఎవరికి చెందుతుంది?"

"ఆయన వీలునామా యెవరికి రాసున్నారో.... నాకు తెలియదు. బహుశా, ఆయన భార్యకే చెందవచ్చును. అతని ఆస్తికొరకు ఆశపడాల్సిన అవసరం నాకు లేదు. నేను ఇప్పటికే పాతిక లక్షల ఆస్తికి వారసురాలిని. అతని ఆస్తి యెవరికి దక్కుతుందో, యేమిటో ఆలోచించాల్సిన అవసరం నాకు లేదు?" అని ఫ్రాంక్‌గా చెప్పింది.

సురేష్ హత్య వార్త తెలిసి — యాదగిరి లావణ్య హాస్పిటల్ కు వచ్చారు.

ఆదే అదనుగా ఇన్ స్పెక్టర్ లావణ్యను అక్కడే ప్రశ్నించాడు.

"మీ పేరు?"

"లావణ్య!"

"హతుడికి మీ రేమౌతారు!"

"భార్యను. ప్రస్తుతం అతడితో విడాకులు తీసుకొనే ప్రయత్నంలో వున్నాను!"

"కారణ మేమిటి?"

"అతను త్రాగుబోతు, తిరుగుబోతు, భార్యను కామాన్ని తీర్చే యంత్రంగా మాత్రమే చూడడం తెల్సినవాడు. కానీ.... కానీ అతను బ్రతికి ఉంటే— కాంప్రమైజ్ అయిపోదామనే అభిప్రాయానికి కొద్ది రోజుల క్రితమే వచ్చాను!"

"కారణం!" ఇన్ స్పెక్టర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"భర్త యెలాంటివాడైనా - అతను ఉంటేనే ఆడదానికి విలువ, లేకపోతే అందరూ వాడుకోవడానికి చూస్తారూ, పైగా విహ్యంగా మాట్లాడుకుంటారు. ఆ బ్రతుకు నరకం అని అనుభవంమీద తెలుసుకున్నాను!"

"ఆల్ రైట్, మీరు వెళ్ళవచ్చు" అన్నాడు ఇన్ స్పెక్టర్.

లావణ్య నమస్కారంచేసి అక్కడినుండి వెళ్ళిపోయింది.

తర్వాత ఇన్ స్పెక్టర్ యాదగిరిని కూడ ప్రశ్నించి-అవసరమైన మేరకు సమాచారాన్ని సేకరించుకున్నాడు.

# 17

నాగార్జున కొండ.

మ్యూజియానికి ఒక మైలు దూరంలో యాదగిరి బీటు వేసి కూర్చున్నాడు.

సాయినాథ్ గుహ యెక్కడుందో - తెలుసుకొని, అతనికి శిష్యుడిగా చేరడం యాదగిరి లక్ష్యం.

భవతారిణి ఇచ్చిన రుద్రాక్షమాల తప్పించి అతనికి వేరే ధైర్యమేమీ లేదు. బ్యాగులో సాయినాథ్ బృందం మృత్యువు తప్ప!

ఆ దిక్కుగా మనుషు లెవరైనా వస్తారేమోనని కళ్ళల్లో ఒత్తులు పెట్టుకొని చూస్తున్నాడు. అటు వచ్చే వాళ్ళు తప్పకుండా - సాయినాథ్ శిష్యులేనని అతని నమ్మకం.

సూర్యాస్తమయమైంది.

అతనికి ఆ రాత్రి అక్కడే విశ్రమించక తప్పలేదు.

ఏ అవాంతరము లేకుండా - చంద్రకాంతిలో అక్కడున్న ఇసుక పర్రలమీద, ఆ రాత్రంతా పడుకున్నాడు.

భళ్ళున తెల్లవారింది.

యాదగిరి కళ్ళు నులుపుకుంటూ లేచి చుట్టూ చూశాడు. అల్లంత దూరమునుండి ఒక వ్యక్తి, వేగంగా తనవైపే వస్తున్నాడు.

అతను దగ్గరికి వచ్చాడు.

యాదగిరి అలాగే నిశ్చింతగా కూర్చున్నాడు.

"ఎవరు మీరు?" హిందీలో ప్రశ్నించాడా వ్యక్తి.

"నా పేరు యాదవ్, సాయినాథ్ గుహవైపు వెళ్తూ ఇక్కడ కాసేపు కూర్చున్నాను, మీరెవరూ?" యాదగిరి హిందీలోనే సమాధానమిచ్చాడు.

అతని కళ్ళు మెరిశాయి.

"అరె అలాగా! నేనూ ఆయన శిష్యుణ్నే. నా పేరు శేఖర్, అటే వస్తున్నాను, పదండి వెళ్దాం!" అన్నాడు.

తన పాచిక పారినందుకు సంతోషించి యాదగిరి చటుక్కున లేచాడు.

వాళ్ళిద్దరూ నడక ప్రారంభించారు.

శేఖర్ కు ఆ దారి కొట్టిన పిండి. అతను గబగబా నడుస్తున్నాడు. గుహకు దారి తెలిసినందుకు యాదగిరి లోలోపల సంతోషిస్తున్నాడు. రుద్రాక్షమాలను ఒకసారి కళ్ళకు అద్దుకున్నాడు.

"మీ సాధన పూర్తి అయిందా?" శేఖర్ అడుగుతున్నాడు.

"ఇంకా ఎక్కడ. గురువుగారి గురించి, ఓ మిత్రుడు చెప్పాడు. ఆయన ఉపదేశం పొందుదామని, ఇలా బయలుదేరాను!" అన్నాడు యాదగిరి.

"ఎవరా మిత్రుడు" అడిగాడు అతను.

యాదగిరికి ఏం చెప్పాలో చప్పున బోధపడలేదు.

అంతలోనే-అతనికి సురేష్ గుర్తువచ్చి - అతని పేరు చెప్పాడు.

"ఓహో, అతనా! చాలా ఇంటలిజెంట్! చాలా త్వరగా సాధన పూర్తిచేసుకొని—ఇంకా పెద్ద పెద్ద విద్యలు నేర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు! గురువు గారికి సంస్కృతం తెలిసిన ఒక శిష్యుడు కావాలన్నాడు. మీకు వచ్చా?" అని అడిగాడు.

"వచ్చు" అన్నాడు ఏదో ఆలోచిస్తూ.

అలా మాట్లాడుకుంటూ ఓ పావుగంటలో వాళ్ళు గుహను చేరుకోగలిగారు,

తీరిగ్గా కూర్చున్న మాంత్రికుడు సాయినాథ్ దగ్గరికి వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశారు.

సాయినాథ్ యాదగిరిని కొత్తగా చూస్తూ—"శేఖర్! ఇత నెవరూ?" అని ప్రశ్నించాడు.

యాదగిరి మళ్ళీ చటుక్కున సాష్టాంగ నమస్కారం చేసి—"అయ్యా! నేనొక సంస్కృత పండితుణ్ని. సురేష్ నా మిత్రుడు. మీ శిష్య పరమాణువులలో నేనూ చేరడానికి సంకల్పించి ఇటు వచ్చాను!" అన్నాడు.

"మీరు సంస్కృత పండితులా?"

సాయినాథ్ ముఖం ఆనందంతో వెలిగిపోయింది.

అతనికి సంస్కృత పండితుని అవసరం చాలా వుంది. సాయినాథ్ దగ్గర మంత్ర తంత్రాలకు సంబంధించిన బోలెడు సంస్కృత గ్రంథాలు ఉన్నాయి. వాటిని అధ్యయనం చేసి—క్రొత్త విద్యలు సాధన చేయాలని అతని ప్రగాఢమైన కోరిక.

వీటిని అధ్యయనం చేయడానికి అతనికి నమ్మకస్థులైన కొంతమంది సంస్కృత పండితులు కావాలి! అందుకే సాయినాథ్ అతన్ని ఆదరించాడు.

సాయినాథ్ అతన్ని గుహలోనే ఉన్న గ్రంథాలయంలోకి తీసికెళ్ళాడు. అందులో సుమారు రెండు మూడు వందల సంస్కృత తాళపత్ర గ్రంథాలున్నాయి.

"చూడండి యాదవ్ గారు! ఈ గ్రంథాలయంలోని యేదో ఒక గ్రంథంలో మృత్యువును జయించే తాంత్రిక విద్య ఉన్నదనే విషయాన్ని కర్ణపిశాచి చెప్పగలుగుతోంది. ఆ గ్రంథ మేదో, యెక్కడుందో చెప్పలేకపోతుంది. మీరు వీటిని అక్కడక్కడ పరిశీలించి వీలైనంత త్వరగా ఆ గ్రంథ మేదో పట్టుకోవాలి!" అని అత

నికి పని పురమాయించాడు.

యాదగిరి తలపూపి—పుస్తకాలు పరిశీలించడానికి ఉపక్రమించాడు.

మాంత్రికుడు సాయినాథ్ గుహలోనికి వెళ్ళిపోయాడు.

అతనికి ప్రాణభయం పట్టుకొంది.

సురేష్ చనిపోవడానికి ముందురోజు జరిగిన సంఘటన గుర్తొచ్చింది అతనికి.

ఆ రోజు—

సురేష్ త్రాగిన మైకంలో తన గురించి దుర్గకు చెపుతున్నాడు—

అదే సమయంలో—

తన గుహలో పిశాచాల ఆక్రందన, గుహ దద్దరిల్లేటట్లు హాహాకారాలు చేస్తున్నాయి అవి.

గాఢనిద్రలో ఉన్న తనూ, గంగావతి యిద్దరూ లేచారు. "ఏమిటి? ఏం జరిగింది?" తను కంగారుగా అరిచాడు.

ప్రమాద సంకేతంగా పిశాచాలు అలా అరుస్తున్నాయి అని తనకు తెలుసు.

తన గురించి అన్ని వివరాలు సురేష్—దుర్గకు తెలియచేస్తున్నాడు అని పిశాచాలు చెప్పాయి.

తన గురించి వివరాలు దుర్గకు తెలిసిన వారం రోజుల్లో తనకు మృత్యువు తప్పదని కర్ణపిశాచి చెప్పింది.

"మీరేం చేస్తున్నారు!" తను కోపంగా గర్జించాడు.

"అతని నోరు పడిపోయేటట్లు చేశాం!" అని సమాధానమిచ్చాయి.

"వాడి నోరు కాదు, వాడి ప్రాణాలు పీక్కుతినండి, వెళ్ళండి!" తను ఆదేశించాడు.

మరుక్షణమే సురేష్ ప్రాణాలు అనంత ఆకాశంలో కలిసిపోయాయి.

సురేష్‌ను లోక భీకరంగా వధించాయి.

ఆరురోజులు గడిచిపోయాయి.

యాదగిరి ఉరఫ్ సంస్కృత పండితుడు యాదవ్ మృత్యువును జయించే తాంత్రిక విద్య ఉన్న గ్రంథాన్ని కనుక్కోలేకపోయాడు.

సాయినాథ్ ప్రాణభయంతో వణికిపోతున్నాడు. తనను మృత్యువు ఏ రూపంలో కబళించబోతుందో అతను వూహించలేకపోయాడు.

ఏడవరోజు—

ఈ రోజు దాటిపోతే—కర్ణపిశాచి చెప్పింది అబద్ధమౌతుంది. తన ప్రాణానికి ఎటువంటి ఢోకా ఉండదు.

మృత్యుభయంతో—ఆ రోజంతా అతను దేవీపూజలో నిమగ్నమయ్యాడు.

సాయంత్రం ఆరుగంటలు.

సూర్యాస్తమయం అయింది.

యాదగిరి తాంత్రిక గుహాలవు రెండుమైళ్ళ దూరంలో ఓ పెద్ద మర్రిచెట్టు ఎక్కి—గుహాలవైపు గడియారంవైపు చూస్తూ కూర్చున్నాడు.

మరొక అయిదు నిముషాలలో ఆ గుహ నేలమట్టం కాబోతోంది.

నిముషాలు గడుస్తున్నాయి.

యాదగిరిలో ఉద్వేగం పెరుగుతోంది.

ఆరుగంటల అయిదు నిముషాలు.

రెండు మైళ్ళ దూరంలో ఉన్న యాదగిరికి భూన భోంతరాళాలు దద్దరిల్లేట్లు భయంకరమైన శబ్దం వినవచ్చి-గుహ శిథిలాలు చెల్లాచెదురుగా పడిపోతున్న దృశ్యం కనిపిస్తోంది.

తాను పెట్టిన ఎక్స్‌ప్లోజివ్స్ చక్కగా పని చేశాయి అనుకున్నాడు.

గుహ నేలమట్టమయింది.

గుహతో పాటు సాయినాథ్, గంగావతి అతని శిష్యులూ నేలమట్టమయ్యారు.

యాదగిరి సంతృప్తిగా చెట్టు దిగి—గృహోన్ముఖుడయ్యాడు.

—: అయిపోయింది :—

# యోగాశ్రమం

సుంకరి రాంప్రసాద్

యజ్ఞశాల భక్తులతో కిటకిటలాడి పోతోంది.

ఆశ్రమం ఆవరణలో పార్క్ చేసిఉన్న ఖరీదైన కార్లు భక్తుల హోదాని చాటి చెబుతున్నాయి.

విశాలంగా వేయబడ్డ తాటాకు పందిళ్ళ మధ్య గోమయంతో అలికి ముగ్గులు పెట్టబడ్డ యజ్ఞగుండం. చుట్టూ హోమద్రవ్యాలు పొందికగా పేర్చబడ్డాయి. ఋత్విక్కుల వేదమంత్రాలతో యజ్ఞశాల మారుమ్రోగి పోతోంది.

'వేగుచుక్క' దినపత్రిక రిపోర్టర్ మూర్తికి ఈ తంతు అంతా ఓ వింతగా వుంది. ఈ యజ్ఞశాల వాతావరణం అంతా చూస్తుంటే—'తను కలియుగం నుండి ఒక్కసారిగా ఏ త్రేతా యుగానికో వెళ్ళిపోయాడా' అని పిస్తోంది మూర్తికి.

"స్వామీజీ వస్తున్నారు....!"

"స్వామీజీ వస్తున్నారు....!!"

భక్తులలో సన్నగా కల, కలం చెలరేగింది. మూర్తి కెమెరా సర్దుకొన్నాడు.

స్వామీ యోగానందది నిలువెత్తు విగ్రహం. ఎర్రని దేహచ్ఛాయ. పాదాలపై జీరాడుతున్న కాషాయ రంగు వస్త్రం. గుండెలమీదకు జారిపడుతున్న నల్లటి నిడుపాటి గడ్డం. విశాలమైన నుదుటిపై కుంకుమబొట్టు. ఆయన కళ్ళలో ఏదో తెలియని వింత కాంతి.

అప్రయత్నంగా చేతులు జోడిస్తున్నారు భక్తకోటి. సాష్టాంగప్రణామాలు చేస్తున్న భక్తులను దీవిస్తూ, యజ్ఞశాలలోకి ప్రవేశించారు స్వామీ యోగానంద.

ఎందరో లక్షాధికార్లు, రాజకీయ నాయకులు, చివరకు రాష్ట్రమంత్రులు కూడా స్వామీజీ భక్తకోటిలోని వారే. విశాఖ సాగరతీరాన నిర్మింపబడ్డ ఆ 'యోగాశ్రమానికి' ఆ రోజు రాష్ట్రం నలుమూలల నుండీ స్వామీజీ భక్తులు వచ్చారు.

తన యోగశక్తితో ఎన్నో మహత్తులను చూపించిన స్వామీ యోగానంద ఈ రోజు మరో అద్భుతాన్ని చేయనున్నారు. అది దర్శించడానికే ఈ భక్త జన సందోహం.

యజ్ఞగుండం ముందు పరచిన పులి చర్మంపై ఆశీనులయ్యారు స్వామీజీ. ఋత్విక్కులు మంత్రోచ్చాటన ఆపేశారు. యజ్ఞశాలంతా చీమ చిటుక్కుమంటే వినిపించేటంతటి నిశ్శబ్దం.

స్వామీజీ పెదవులు విప్పారు. మంత్రముగ్ధుల్లా భక్తులు ఆయన మాటలు వినసాగారు.

"భక్తులారా!

నీరు, అగ్ని, వాయువు, భూమి, ఆకాశము ఇవి పంచ భూతములు. వీటి కలయికే సృష్టి మానవుడు ధ్యానము చేత, ఆధ్యాత్మిక చింతన చేత, సాధన చేత, యోగశక్తి సంపన్నుడౌతున్నాడు. ఆ యోగశక్తితో ఈ సృష్టినే శాసింపగలుగుతున్నాడు.

మన పూర్వీకులు ఆ యోగశక్తితోనే వర్షాలు కురిపించారు. గాలిని బంధించారు. భూమిని కంపింపజేశారు.

ఆ యోగశక్తిని నేను ఈ క్షణం మీ ముందు ప్రదర్శించబోతున్నాను. పంచభూతములలో ఒకటైన అగ్నిని నేను శాసిస్తున్నాను. ఈ యజ్ఞగుండంలోకి ప్రవేశించమని ఆజ్ఞాపిస్తున్నాను."

భక్తులందరూ ఊపిరి బిగబట్టి మరీ ఉత్కంఠతో చూస్తున్నారు.

'ఎవరూ వెలిగించకుండా యజ్ఞగుండంలోకి అగ్ని దాని అంతట అదే ఎలా పుడుతుంది? దానికి సైంటిఫిక్ రీజనింగ్ యేమిటి?' ఇదికాదు మూర్తిని వేధిస్తున్న అసలు సమస్య. 'తనకు యేదో వాసన వేస్తోంది.... ఇబ్బందికరంగా వున్న యేదో తీయని వాసన. ఏమిటది....? ఏమిటది....? అది.... కెమికలా....? కెమికల్ అయితే ఈ యజ్ఞశాలలో కెమికల్‌తో పనేమిటి?' మూర్తి ఆలోచనలలో కొట్టుకుపోతున్నాడు.

స్వామీజీ పెదవులు మెల్లగా యేవో మంత్రాలను ఉచ్చరించసాగాయి. మెల్లగా కుడిచేతితో ఆజ్యపుకుండలోని నేయిని గరిటతో యజ్ఞగుండంలోకి వేశారు స్వామీజీ. ఋత్విక్కులు కూడా స్వామీజీతో గొంతు కలిపారు. మంద్రంగా వినిపిస్తున్న ఆ మంత్రాల ఘోష భక్తులను వివశుల్ని చేస్తోంది. స్వామీజీ రెండవసారి

గరిటతో నేయిని పోశారు.

భక్తులలో క్షణ క్షణానికీ 'క్యూరియాసిటీ' పెరిగి పోతోంది. మూర్తి కుర్చీలో అసహనంగా కదిలాడు.

స్వామీజీ మూడవసారి గరిటతో నేయి పోశారు.

అంతే!!!

యజ్ఞగుండంలో ఒక్కసారిగా సన్నని మంట లేచింది. భక్తులందరూ హాహాకారాలు చేశారు.

"స్వామీ యోగానందకూ.... జై!"

"స్వామీ యోగానందకూ జై!"

భక్తులు జయ, జయ ధ్వానాలు చేస్తున్నారు.

తను చూస్తున్నది కలో....నిజమో తేల్చుకోలేని స్థితిలో వున్నాడు మూర్తి. 'తాను చూస్తూనే వున్నాడు. ఎవరూ దానిని వెలిగించలేదు. మరి, మరి....యజ్ఞ గుండంలోకి ఆ మంట ఎలా వచ్చింది?' సుడులు తిరుగుతున్న ఆలోచనలను తనలోనే దాచుకొని ఫోటోలు తీయడానికి లేచాడు మూర్తి.

రెండు, మూడు ఫోటోలు తీశాక, స్వామీజీ ఫోటో ఒకటి క్లోజప్ లో తీసుకోవడానికి యజ్ఞగుండానికి దగ్గరగా వెళ్ళాడు మూర్తి. మోకాలుపై వంగి పొజిషన్ తీసుకున్నాడు. మోకాలుకు ఆజ్యపుకుండ తగులుతూంది. నేతిజిడ్డు అంటకుండా కర్చీఫ్ తో ఎత్తి ఆజ్యపుకుండను ప్రక్కకు పెట్టాడు మూర్తి.

స్వామీజీ చిద్విలాసంగా నవ్వుతున్నారు.

కెమేరా....'క్లిక్' మంది.

అందరూ వెలుగుతున్న ఆ యజ్ఞగుండాన్నీ, ఆ మంటల వెలుగులలో మెరిసిపోతున్న స్వామీజీనే చూస్తున్నారు. కాని నేతికుండలోనికి జారిన కర్చీఫ్ చివర్లను ఎవరూ గమ

నించలేదు.

ఫోటోలు తీయడం పూర్తిచేసుకొని ఆశ్రమం బయటకు వచ్చాడు మూర్తి. అంతవరకూ భద్రంగా దాచిన కర్చీఫ్‌ను పైకి తీశాడు. అదే వాసన. తనను ఇంతవరకూ వేధిస్తున్న ఇబ్బందికరమైన తీయని వాసన.

కర్చీఫ్ నుండి వస్తున్నది నేతివాసన కాదు!

అంటే — యజ్ఞగుండంలో వేసింది .... నేయి కాదా!?

నేయి కాకపోతే మరేమిటి?

అదేమిటో తేలాల్సింది 'లాబ్'లో అనుకున్నాడు మూర్తి.

## 2

మరునాడు 'వేగుచుక్క' దినపత్రికలో ప్రచురింపబడ్డ ఓ వార్త మొత్తం రాష్ట్రంలోనే సంచలనం సృష్టించింది. సంచలనం కాదు. మరీ.... స్వామీ యోగానందులవారి మహత్తునే శంకించడమంటే మాటలా....!

స్వామీజీ చూపించే మహత్తులన్నీ కేవలం బూటకాలనీ, కొన్ని రసాయన ప్రయోగాలతో ప్రజలను స్వామీజీ మోసం చేస్తున్నాడంటూ మూర్తి చేసిన పరిశోధనా వివరాలు ప్రచురించబడ్డాయి 'వేగుచుక్క' దినపత్రికలో.

స్వామీజీ భక్తులలో కలవరం.

స్వామీజీ ఆశ్రమం తండోపతండాలుగా వస్తున్న భక్తులతో నిండిపోతోంది. అందరి మనస్సులలో ఆత్రం....

'ఇది నిజమా....? నిజమేనా....?

దీనికి స్వామీజీ యిచ్చే సమాధానం ఏమిటి?'

అందరి మనస్సులలో యివే ప్రశ్నలు. కానీ స్వామీజీ దర్శనం మాత్రం ఎవరికీ దొరకటంలేదు. అందరికీ ఒకటే సమాధానం—"స్వామీజీ ధ్యానంలో వున్నారు. దర్శనానికి ఎవరినీ అనుమతించడం జరుగదు" అని.

స్వామీజీ తన ప్రత్యేక కుటీరంలో పట్టు బాలీసులపై జారబడి వున్నారు. ఒక యువతి స్వామీజీ కాళ్ళు వత్తుతూంది. ఇంకో యువతి విస్కీని గ్లాసులో పోసి, ఐస్ క్యూబ్స్ వేసి స్వామీజీకి అందిస్తూంది.

ఆ యిద్దరు యువతులూ బట్టలు యేవీ ధరించలేదు. పూర్తిగా నగ్నంగా వున్నారు. అయినా వారిలో ఆ ఫీలింగ్ ఉన్నట్లు ఎక్కడా కన్పించటం లేదు. యాంత్రికంగా తమ పనులను తాము చేసుకుంటూ పోతున్నారు. కాని జీవంలేని వారి కళ్ళలో మాత్రం నిస్తేజత కొట్టవచ్చినట్లు కన్పిస్తూంది.

స్వామీజీ ప్రత్యేక కుటీరంలోకి యెవ్వరికీ ప్రవేశ అనుమతి ఉండదు. స్వామీజీ సేవకోసం ప్రతిరోజూ ఇద్దరు యువతులు ఆ కుటీరంలోకి పంపబడతారు. ఆ కుటీరంలో ప్రవేశించగానే ఆ యువతులు వివస్త్రలై నగ్నంగానే స్వామీజీకి సేవలు చేయాల్సి వుంటుంది.

కానీ-స్వామీజీ ఈ రోజు వారి అందాలను పట్టించుకొనే స్థితిలో లేదు. ఎదురుగా టీపాయ్‌పై వున్న వేగుచుక్క దినపత్రికలో, తన గురించి ప్రచురింపబడ్డ న్యూస్ వైపు చూస్తున్నాడు. ఒక్కసారి వంగి దినపత్రికను చేతిలోకి తీసుకున్నాడు.

ప్రత్యేకంగా బాక్స్‌లో ప్రచురింపబడ్డ ఆ మాటర్‌ని మరోసారి చదువుకున్నారు స్వామీజీ.

134

## యజ్ఞ గుండంలోకి మంటలెలా వచ్చాయి .......?

యజ్ఞ గుండంలో వేయబడ్డ సమిధలు, హోమ సామగ్రిలో ముందుగానే 'పొటాషియం పర్మాంగనేట్' కలపబడింది. నెయికి బదులు 'గ్లిజరిన్' ఆ యజ్ఞ గుండంలో వేయటంచేత ఆ రెండు రసాయనాల సమ్మేళనం వలన యేర్పడ్డ రసాయనిక చర్య వలన సహజంగానే మంటలు ఏర్పడ్డాయి.

"యూ....బ్లడీ రిపోర్టర్!

యూ....ఆర్ టూ ఇంటలిజంట్."

స్వామీజీ పెదవులు కోపంతో వణుకుతున్నాయి. ఆయన చేతిలోని 'వేగుచుక్క' దినపత్రిక నలిగి నలిగి ముక్కలయిపోతుంది.

## 3

బీచ్ నిర్మానుష్యంగా వుంది.

దూరంగా ఓ మొగలి పొద చాటున ఓ జంట కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

సన్నగా వెన్నెల కురుస్తూంది.

నీలి చీరపై నేసిన వెండి జలతారులా వెన్నెల వెలుగుల్లో మరింత మెరుస్తున్న తెల్లని కెరటాల నురుగు. చల్లగా వీస్తున్న పిల్లగాలికి ప్రాణం లేచి వస్తూంది.

అలా వెన్నెల రాత్రిలో బీచ్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకోవడం ఆ జంటకు యెంతో యిష్టం. రాత్రి తొమ్మిది దాటుతున్నా వారు 'టైమ్'ను గమనించినట్లు లేదు.

వారి ఏకాంతాన్ని భంగంచేస్తూ చిన్నగా యెవరో దగ్గారు. తలెత్తి చూశాడా యువకుడు. యెదురుగా

బలంగా, ఎత్తుగా కనిపిస్తున్న యొవకో అపరిచితుడు.

"ఎక్స్‌క్యూజ్ మీ సర్. మీరేనా 'వేగుచుక్క' దిన పత్రిక రిపోర్టర్ మూర్తిగారు" అని వినయంగా అడిగాడు ఆ అపరిచితుడు.

"అఫ్‌కోర్స్.... నేనే.... ఏం....?" అంటూ ప్రశ్నార్థకంగా చూశాడు మూర్తి.

"అంటే - ఈ రోజు స్వామీజీపై పబ్లిష్ చేయబడ్డ న్యూస్ కవర్ చేసెంది....ఆ పరిశోధన చేపింది మీరేకదు సార్" మరింత నమ్రతతో అడిగాడా అపరిచితుడు.

నవ్వుతూ అవునన్నట్లు తలాడించాడు మూర్తి.

అంతే! ఆ అపరిచితుడు కొట్టిన దెబ్బకు మూర్తి పళ్ళు కదిలిపోయాయి. దబ్బున వెనక్కి తూలి పడ్డాడు.

కోపంతో మూర్తి కండరాలు బిగుసుకున్నాయి. తన మీదకు పడబోతున్న ఆ అపరిచితుని గుండెలపై చాచి తన్నాడు. ఊహించని ఈ ఎదురు దెబ్బకు ఆ అపరిచితుడు ఇసుకలో దొర్లుకుంటూ పడ్డాడు.

ఈ గలాటాకు గాభరాగా లేచిన భార్య మణి చేతిని గట్టిగా పట్టుకున్నాడు మూర్తి.

చేతులకు అంటిన యిసుకను దులుపుకుంటూ లేచాడు ఆ అపరిచితుడు. అడుగుకూడా ముందుకు వేయకుండా అక్కడినుండే ఆ జంట వంక క్రూరంగా చూశాడు.

భయంతో వణికిపోతుంది మణి. మూర్తి గుండెల్లోకి ప్రాకుతున్న పిరికితనం. యిలాంటి కొట్లాటలలో అత డెప్పుడూ తలదూర్చలేదు

రెండడుగులు వెనక్కి వేసి, గట్టిగా విజిల్ వేశాడు ఆ అపరిచితుడు. మరుక్షణంలో దూరంగా ఓ పొదచాటు నుండి కొన్ని నల్లని ఆకారాలు తమవైపే పరుగెత్తుకొని

రావటం చూశాడు మూర్తి.

పరిస్థితి విషమించిందని గ్రహించాడు మూర్తి.

"కమాన్ మణీ....క్విక్" అంటూ భార్య చేతిని చేతిలోకి తీసుకొని పరుగె త్తసాగాడు.

"హెల్ప్!..హెల్ప్! పోలీస్! పోలీస్! హెల్ప్!" మూర్తి, మణి గొంతు చించుకొని అరుస్తున్నారు. ఆ రాత్రి ఆ నిర్మానుష్యమైన ప్రదేశంలో వారి ఆక్రందనలు అరణ్య రోదనలే అయ్యాయి. వారి వెనుకే ఆకలిగొన్న సింహాల్లా దూసుకు వస్తున్నారు ఆ ఆగంతకులు.

ఒక వాస్తవాన్ని నిర్భయంగా ఓ పత్రికలో ప్రకటించిన పాపానికి, ప్రాణభయంతో ఓ పత్రికా విలేఖరి తన భార్యతో సముద్ర తీరాన పరుగెడుతున్నాడు.

పరుగెడుతున్న మణి చీర కుచ్చిళ్లు కాలికి తగిలి క్రింద పడిపోయింది. భార్యను లేవనెత్తడానికి ఒక్క క్షణం ఆగాడు మూర్తి. అప్పటికే వారిని చుట్టుముట్టారు ఆగంతకులు. వారి చేతిలోని స్టీల్ రాడ్స్ వెన్నెల్లో తళ, తళ మెరుస్తున్నాయి.

మొదటి దెబ్బకే తల పగిలిపోయింది. వెచ్చని రక్తం చెంపలమీదకు కారుతుంటే నేలమీదకు వాలిపోయాడు మూర్తి. అప్పటికే ఆ దారుణ దృశ్యం చూసిన మణి స్పృహ తప్పిపోయింది. స్పృహ తప్పిన మణిని చుట్టుముట్టారు ఆ ఆగంతకులు.

## 4

## రిపోర్టర్ మూర్తి దుర్మరణం!

"సింహాచలంలో దేవుని దర్శనం చేసుకొని స్కూటర్ పై కొండ దిగివస్తున్నాడు 'వేగుచుక్క' దినపత్రిక రిపోర్టర్ మూర్తి.

పోలీసుల కథనం ప్రకారం స్కూటర్ బ్రేకులు ఫెయిల్ కావడంతో స్కూటర్ కొండవాలునున్న పిట్ట గోడను గుద్దుకొని మూర్తి లోయలోకి దొర్లిపోయాడు. అంత యెత్తునుండి తలక్రిందులుగా పడటంలో మూర్తి తల ఓ బండరాయికి గుద్దుకోవడంవలన తలపగిలి అక్కడి కక్కడే మరణించాడు.

అయితే-మూర్తి భార్య మణి నిన్నటినుండి విచిత్రంగా అదృశ్యమయింది. ఆమెకోసం పోలీసులు తీవ్రంగా గాలి స్తున్నారు."

చదువుతున్న పేపరును నేలమీదకు విసిరి వికటంగా నవ్వసాగాడు స్వామీ యోగానంద. స్వామీజీ ప్రక్కనే బెడ్ మీద కూర్చుని వెక్కి, వెక్కి యేడుస్తుంది మూర్తి భార్య మణి. ఆమె వంటిమీద నూలుపోగైనా లేదు. ఫ్లోరసెంట్ దీప కాంతితో ఆమె నగ్న దేహం నిగ, నిగా మెరుస్తూంది.

'నీ భర్త ఆత్మ శాంతికోసం మరో సారి' అంటూ వెనుగులాడుతున్న మణిని బలవంతంగా తనవైపు త్రిప్పు కున్నాడు స్వామీజీ.

కాని స్వామీజీకి ఆ క్షణం తెలియదు. మూర్తి చావుతో తను యింకో బలమైన ప్రత్యర్థిని యెదుర్కొనబో తున్నానని.

ఆ ప్రత్యర్థి....మూర్తి అన్న రాంకుమార్. సి.ఐ.బి. ఆఫీసర్!-

హోటల్ ఛాల్సన్‌లో తన రూమ్‌లో పచార్లు చేస్తు న్నాడు రాంకుమార్. ఆలోచనలు యెంతకూ ఓ కొలిక్కి రావటంలేదు. పోలీస్ కమీషనర్‌తో ముందే చెప్పడం చేత తన ఐడెంటిటీ తను మూర్తి అన్నననే విషయం

రహస్యంగా వుంచబడ్డాయి.

టేబిల్ మీద పాడ్ తీసి తన ఊహాలను పాయింట్స్‌గా వ్రాయసాగాడు రాంకుమార్.

1. కొండమీద నుండి.... అంత ఎత్తు నుండి పడ్డ మూర్తి తలమీద ఏర్పడ్డ రక్తగాయం తప్ప వంటిమీద మిగిలిన గాయాల నుండి రక్తం కారలేదు.

   ఎందుచేత? గాయాల నుండి ఎప్పుడు రక్తం కారదు? బహుశా.... రక్తప్రసరణ ఆగిపోయాక ఆ దెబ్బలు తగిలి వుంటాయి. అంటే మూర్తిని ఎక్కడో తలమీద కొట్టి చంపేసి తరువాత ఆ శవాన్ని కొండ మీద నుండి తోసేసి వుంటారు.

2. ఎవరు....? ఎవరికా అవసరం వుంది?

3. మూర్తి మరణం రాత్రి 9.30 - 10.00 గంటల మధ్య సంభవించి వుంటుందని డాక్టర్ రిపోర్ట్. కాని కొండమీద నుండి యేదో లోయలోకి పడిన శబ్దం రాత్రి 12 గంటల ప్రాంతంలో వినిపించిందని గుడి మెట్లమీద పడుకునే ముష్టివాళ్ళు చెబుతున్నారు.

4. రాత్రి పదిగంటల తరువాత కొండమీదకు స్వామి యోగానంద ఆశ్రమానికి సంబంధించిన వాన్ తప్ప యింకే యితర వాహనాలు పోలేదని గేట్ మాన్ చెబుతున్నాడు.

5. ఎవరీ .... యోగానంద ....? మూర్తిని అతనెందుకు చంపిస్తాడు?

6. 'వేగుచుక్క' దినపత్రిక ఎడిటర్ యిచ్చిన ఇన్ఫర్మేషన్ ప్రకారం - ఆ ప్రమాదం జరిగిన ముందు రోజే స్వామి యోగానంద గుట్టును రట్టు చేస్తూ 'వేగుచుక్క'లో న్యూస్ కవర్ చేయబడింది. దాని

రిపోర్టర్ మూర్తి.

అంతవరకూ వ్రాసిన పాయింట్స్‌ను మరోసారి చదువుకున్నాడు రాంకుమార్. లైటర్ తీసి పేపర్‌కు ఒక కొసను ముట్టించాడు. పూర్తిగా కాలాక నుసిచేసి టాయిలెట్‌లో వేసి వాటర్ కొట్టాడు.

స్వామీ యోగానందే ఈ హత్య చేయించి వుంటారా?

దానిని నిరూపించడం ఎలా?

ముఖ్యంగా మూర్తి భార్య మణి ఏమయినట్లు?

అన్నీ ప్రశ్నలే.... రాంకుమార్ మెదడును వేధిస్తున్న ప్రశ్నలు.

ఆ ప్రశ్నలకు సమాధానాలకోసం నిన్న రాంకుమార్ యోగాశ్రమం వెళ్ళాడు.

ఒక్క ప్రార్థనా మందిరం తప్ప మిగిలినవి ఏవీ చూడలేకపోయాడు.

ఆశ్రమంలోని మిగిలిన ప్రదేశాలకు వెళ్ళడానికి స్వామీజీ అంతరంగిక భక్తులకు మాత్రమే ప్రవేశ అర్హత వుందట. కొందరు మాత్రమే చూడగలిగే రహస్యాలు 'యోగాశ్రమం'లో ఏమున్నాయి? అది తెల్సుకోవడానికి తను స్వామీజీ అంతరంగికుడిగా యోగాశ్రమంలో ప్రవేశించాలి!

'కాని ....ఎలా....? ఎలా....?'

ఆలోచిస్తూ తన గదిలో పచార్లు చేస్తున్నాడు.

## 5

గత పది రోజులుగా విభూతి బాబా గూర్చి పట్టణంలో విపరీతంగా ప్రచారం జరుగుతూంది....ఎక్కడ విన్నా బాబా చేసిన మహత్తుల కబుర్లే.

బాబా కర్ణాటక ప్రభుత్వం కోరికపై బెంగళూర్‌లో వర్షాలు కురిపించారట. ఆగ్రాలో యమునా నదిపై నడిచారట. తన అంతరంగిక భక్తులకు ఆత్మలింగాలను గాలిలో సృష్టించి యిస్తారట. తన సంపూర్ణ భారత యాత్రలో ఓ భాగంగా విశాఖపట్టణం విచ్చేసారట విభూతి బాబా.

ప్రస్తుతం విశాఖలో బాబా చూపిస్తున్న మహత్తు నాణేలపై విభూతిని సృష్టించడం.

తన దగ్గరకు వచ్చే భక్తులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క నాణెం యిస్తారు బాబా. అవి ప్రభుత్వ టాంకశాలలో తయారైన సాధారణ నాణేలే. భక్తుల అరచేతులలో ఆ నాణేలను వుంచాక బాబా ఓ మంత్రం పఠిస్తారు. అంతే! కొద్ది క్షణాలలో ఆ నాణేలపై బూడిద ప్రత్యక్షమవుతుంది.

తమ అరచేతులలోనే అద్భుతంగా సృష్టింపబడుతున్న ఆ బూడిద భక్తులను విపరీతంగా ఆకర్షిస్తోంది.

క్రొత్త ఒక వింత.... పాత ఒక రోత అన్నారు.

ఓ ప్రక్క విభూతి బాబా దగ్గరకు భక్తులు కుప్పలు, తెప్పలుగా వచ్చిపడుతుంటే.... యింకో ప్రక్క స్వామి యోగానంద ఆశ్రమానికి భక్తులే కరువయ్యారు.

భక్తులు లేక 'యోగాశ్రమం' చిన్నబోయింది.

స్వామి యోగానంద ఆలోచనలో పడ్డారు.

స్వామీజీ ఆలోచన తన ఆశ్రమానికి రాని భక్తుల గురించి కాదు. విభూతి బాబా సంపాదించుకుంటున్న ప్రాచుర్యాన్ని గురించి అంతకన్నా కాదు.

యింత పాప్యులారిటీ వున్న విభూతి బాబాను తనతో కలుపుకుంటే కలిగే లాభ నష్టాలగూర్చి. బాబా తన

వ్యాపారానికి యెంతవరకూ ఉపయోగపడతాడు....?"
ఇదీ స్వామీజీ ఆలోచిస్తున్నది.

"ఆ శోజా సామ్రాజ్యం .... 'ఒక్కసారి తమ ఆశ్ర
మానికి విచ్చేయమని' స్వామీ యోగానంద నుండి
విభూతి బాబాకు ఆహ్వానం వెళ్లింది.

ఆ ఆహ్వానాన్ని చిరునవ్వుతో అంగీకరించారు విభూతి
బాబా.

## 6

హోటల్ డాల్ఫిన్.

రూం నెంబర్ 119 కిటికీ కర్టెన్ తొలగించి పైకి
చూశాడు రాంకుమార్. ఎదురుగా వున్న 111 వ రూం
తలుపువద్ద ఛెయిర్ వేసుకొని కూర్చున్నాడో ఆగంతకుడు.
అతని చూపులన్నీ 119 రూం తలుపులవైపే కేంద్రీక
రింపబడి వున్నాయి.

రాంకుమార్ అతనిని ఉదయంనుండీ గమనిస్తున్నాడు
అక్కడే కదలకుండా తన రూమ్‌నే వాచ్ చేస్తున్నాడు.

'అప్పుడే తన మీద నిఘా ప్రారంభమయిందన్న
మాట' అనుకొని చిన్నగా నవ్వుకున్నాడు రాంకుమార్.

ఢిల్లీ ఆఫీసుకు మెసేజ్ పంపాలి. తనమీద నిఘా
వేసినవారు తన ఫోన్ కాల్స్‌ని వదులుతారా? వాటినీ
టేప్ చేస్తారు — సాలోచనగా తల పంకించాడు రాం
కుమార్.

తన హోల్డాల్ తెరచి అందులో నుండి మనిషి ఆకా
రంలో కుట్టబడ్డ ఓ రబ్బరు కవర్ తీశాడు. చెవి భాగంలో
వున్న హోల్ నుండి గాలి ఊదుతుంటే అది బెలూన్‌లా
ఉబ్బసాగింది. పూర్తిగా మనిషి ఆకారం వచ్చేసరికి
మూడు నిమిషాలు పట్టింది. ఆ బొమ్మను తన బెడ్ మీద

పడుకోబెట్టి తలమీదుగా దుప్పటి కప్పాడు రాంకుమార్.

బెడ్ లైట్ మాత్రం వేసి మిగిలిన లైట్లు ఆర్పేసాడు. రూం లోపలినుండి లాక్ చేసి రూమ్ వెనుకవైపు నడిచాడు. చుట్టూ ఒకసారి చూసి యెవరూ తనను గమనించటం లేదని నిశ్చయించుకున్నాక పిట్టగోడ అంచులను పట్టుకొని ప్రాకుతూ ప్రక్క రూమ్ తలుపు దగ్గరకు చేరాడు. తలుపును నెమ్మదిగా తోశాడు.

అది రూం నెంబర్ 120. రూమ్ లోపలకు ప్రవేశించిన వెంటనే తలుపు మూసి గడియ పెట్టాడు. అక్కడ వున్న బ్రీఫ్ కేస్ తెరచి చక, చకా తన రూపం మార్చుకోసాగాడు. పది నిమిషాల్లో రాంకుమార్ స్థానంలో ఓ యాభై యేళ్ళ సిక్కు ప్రత్యక్షమయ్యాడు.

తన ఆకారాన్ని మరోసారి అద్దంలో చూసుకొని తృప్తిపడ్డాక రూం బైటకు నడిచాడు రాంకుమార్. రూంను లాక్ చేస్తూ 111వ రూంవైపు ఓరగా చూశాడు. పట్టువదలని విక్రమార్కుడిలా 119వ రూంవైపే చూస్తున్నాడు ఆ ఆగంతకుడు. చిన్నగా నవ్వుకుంటూ మెట్లు దిగసాగాడు రాంకుమార్.

కానీ రాంకుమార్కు తెలియదు ఆ ఆగంతకుడు ఓ పోలీస్ కాన్స్టేబులనీ.... అతన్ని నియమించింది పోలీస్ కమీషనర్ స్వామీ యోగానంద అంతరంగిక శిష్యుడనీ.

తను జస్వంత్ సింగ్ పేరుతో 120వ రూమ్కూడా తీసుకుంటున్నట్లు పోలీస్ కమీషనర్తో చెప్పలేదు. అదే రాంకుమార్ చేసిన తెలివైన పని.

రాంకుమార్ మెట్లు దిగి వెళ్ళిపోయిన రెండు నిమిషాల తర్వాత ఆ ఆగంతకుడు లేచాడు. 119వ రూంకీ హోల్ నుంచి చూశాడు. రూం లోపల హాయిగా

నిద్రపోతున్న రాంకుమార్‌ను చూసి తృప్తిగా నిట్టూర్చాడు.

## 7

స్వామీ యోగానంద కుటీరం.

స్వామీజీ, విభూతి బాబా యెదురెదురుగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. అది వారు అరవసారి సమావేశం కావడం. ఇద్దరు యువతులు ఖాళీయైన గ్లాసులను విస్కీతో నింపుతున్నారు. వారి నగ్న సౌందర్యాన్ని ఆకలిగా చూస్తున్నాడు విభూతి బాబా.

"నా నేలపై ఆ విభూతి ఎలా వస్తూందీ మీరు చెప్పనే లేదు" అన్నారు స్వామీజీ.

"అది ట్రేడ్ సీక్రెట్ .... ఎవ్వరికీ చెప్పకూడదు స్వామీజీ...." అంటూ ఒక్క క్షణం ఆగాడు విభూతి బాబా.

స్వామీజీ ముఖం మ్లానమయింది. స్వామీజీ ముఖంలోని మార్పులను ఓరకంటితో గమనించాడు విభూతి బాబా.

"అయినా మనం యెలాగూ పార్ట్‌నర్స్ కాబోతున్నాం కాబట్టి ఆ రహస్యాన్ని మీకు చెబుతున్నాను" చిన్నగా నవ్వుతూ అన్నారు బాబా.

స్వామీజీ సైగతో ఆ కుటీరం బయటకు నడిచారు ఆ యువతులిద్దరూ. విభూతి బాబా చెప్పడం ప్రారంభించాడు.

"ఇటీజ్ వెరీ సింపుల్ ట్రిక్. నా నేలకు ముందుగా మెర్క్యురిక్ క్లోరైడ్ పూయబడుతుంది. భక్తుల అరచేతిలో ఆ నా నేలను వుంచుతాం. నా వేలకు పూయబడ్డ మెర్క్యురిక్ క్లోరైడ్ గాలితో సంయోగం చెంది పొడిగా

మారుతుంది. దానినే భక్తులు పవిత్రమైన బూడిదగా స్వీకరిస్తారు. మనం చేయాల్సిందల్లా.... భక్తులకు అర్థం కాని యేవో మంత్రాలను ఉచ్ఛరించడమే."

"యూ ఆర్ రియల్లీ గ్రేట్ బాబా! ఇంత చిన్న ట్రిక్‌తో ప్రజలను మీరు ఆకట్టుకోగలుతున్నారంటే సింప్లీ యూ ఆర్ ఎ జీనియస్" — స్వామీజీ మెచ్చుకోలుగా బాబా భుజం తట్టారు.

బాబా చిరునవ్వులు చిందిస్తూ గ్లాసులోకి విస్కీని వంపుతున్నారు.

"బాబా! మీరు చేస్తున్నది 'హెరాయిన్' వ్యాపారం అని కదూ చెప్పారు" బాబా గ్లాసులోని విస్కీలో ఐస్‌క్యూబ్స్ వేస్తూ అడిగారు యోగానంద.

"ఎంతసేపూ నా వివరాలు అడగటం తప్ప మీ అమ్మాయిల వ్యాపారం గూర్చి మీరు పెదవి విప్పటం లేదు" నవ్వుతూ అడిగారు విభూతి బాబా.

చురుగ్గా చూశారు స్వామీజీ బాబావైపు. విభూతి బాబా పెదవులపై అదే చెరగని చిరునగవు. ఒక్క క్షణం బాబా వంక సాలోచనగా చూసి చిన్నగా తలపంకించారు యోగానంద.

"చెప్పడం కాదు. చూపిస్తాను నాతో రండి బాబా" అంటూ చివాలున లేచి కుటీరం బైటకు దారితీశారు స్వామీ యోగానంద.

అతని వెనుకే మెల్లగా నడవసాగారు విభూతి బాబా-

అనాథలైన అందమైన యువతులను నమ్మించి. మోసపుచ్చి ఆశ్రమంలో చేర్పించడానికి రాష్ట్రంలోని అన్ని ముఖ్య పట్టణాలలో స్వామీజీ బ్రోకర్లు వున్నారు. ఒక్కొక్కసారి వీలునుబట్టి అందమైన అమ్మాయిలను

కిడ్నాప్ చేసి మరీ ఆశ్రమానికి అప్పగిస్తుంటారు ఆ బ్రోకర్లు. అమ్మాయిల అందాన్నిబట్టి వారికి ప్రతిఫలం ముడుతుంది.

ఆశ్రమంలో చేర్చబడ్డ ఆ యువతులను కొట్టి, హింసించి తమ దారిలోకి తెస్తారు స్వామీజీ అనుచరులు. తమ అవసరాలకు వినియోగించుకున్నాక ఆధ్యాత్మిక ప్రచారం పేరుతో ఆ అమ్మాయిలు శ్రీలంక, సింగపూర్, మలేషియా దేశాలకు పంపబడతారు. అక్కడినుండి వారు 'గల్ఫ్ దేశాలకు' యెగుమతి చేయబడతారు — ఇదీ స్థూలంగా స్వామీజీ చేసే అమ్మాయిల వ్యాపారం.

ఆశ్రమం వెనకవైపు ఆ అనాథ యువతులకోసం ప్రత్యేకంగా ఓ యాభై కుటీరాలు నిర్మింపబడ్డాయి. ఆ కుటీరాల చుట్టూ బలమైన ఐరన్ ఫెన్సింగ్ వేయబడింది. ఆ ఫెన్సింగ్ లోపల, ఆ కుటీరాల చుట్టూ కాషాయ వస్త్రాలు ధరించిన పదిమంది దృఢకాయులు యెప్పుడూ పహారా కాస్తుంటారు.

తప్పించుకు పోదామని ప్రయత్నించే ఏ యువతికైనా ఒకటే శిక్ష....ఆ రాత్రి ఆమె పాలిట కాళరాత్రి అవుతుంది.

—ఆశ్రమం అంతా చూశాక విభూతి బాబాకు మతిపోయింది. ఇంత పకడ్బందీగా .... ఇన్ని యేర్పాట్లతో స్వామీజీ ఈ ఆశ్రమాన్ని నిర్వహిస్తున్నాడంటే స్వామీజీకి ప్రభుత్వ వర్గాల్లో సైతం ఎంతో పలుకుబడి వుండివుండాలి.

స్వామీజీని తను చాలా తక్కువగా అంచనా వేశాడా....? రేపు పూర్ణిమ నాడు 'పూర్ణాహుతి' కార్యక్రమం జరుగుతుందట. తనను తప్పక రమ్మని ఆహ్వానిం

చాడు. ప్రతి పున్నమి రాత్రి పూర్ణాహుతి పేరుతో జరిగే ఆ కార్యక్రమం ఏమిటి?

ఆలోచనలతో ఆ రాత్రంతా నిద్రపట్టలేదు విభూతి బాబాకు.

ఆ రాత్రంతా యోగానందకుకూడా నిద్రపట్టలేదు.

విభూతి బాబాను ఎలా వినియోగించుకోవాలి? అమ్మాయిల వ్యాపారానికి తోడు హెరాయిన్ వ్యాపారం కూడా కలిస్తే ఇంకేముంది ఒక్క సంవత్సరంలో తను కోటీశ్వరుడు అయిపోతాడు. ముందు ఆ హెరాయిన్ బిజినెస్ పూర్తిగా తన చేతిలోకి వస్తే, విభూతి బాబాను తన దారినుండి తొలగించడం నిమిషాల మీద పని!

కాని, దానికి బాబాను పూర్తిగా తన చేతిలోకి తీసుకోవాలి.

అందుకే 'బాబాను' రేపు పూర్ణాహుతికి పిలిచింది. తనలో తాను క్రూరంగా నవ్వుకున్నాడు స్వామీజీ.

కాని .... రేవు 'పూర్ణాహుతి' నాడు తనమీదకు ముంచెత్తుకు వస్తున్న ప్రమాదాన్ని ఏమాత్రం పసిగట్టినా బహుశా స్వామీజీ అంత హాయిగా నవ్వుకునేవారు కాదేమో!

# 8

పోలీస్ కమీషనర్, రాంకుమార్‌ను చాలా తక్కువగా అంచనా వేశాడు. అందుకే రాంకుమార్ విషయం స్వామీజీతో చెప్పకుండా నిర్లక్ష్యం చేశాడు. తాను రాంకుమార్ పై యేర్పాటు చేసిన నిఘా చాలు అనుకున్నాడు.

కమీషనర్‌కు అర్థంకాని విషయం ఒక్కటే. రాంకుమార్ ఏం చేస్తున్నట్లు? ఒక్క భోజనానికి తప్ప....

అతడు రూం నుండి బైటకు రావటంలేదట. యెవ్వరికీ కనీసం ఫోన్ కూడా చేయటంలేదట. తనతో కూడా యే విషయం చెప్పటంలేదు. మరి అతడు చేస్తున్న పరిశోధన ఏమిటి?.... రేపు ఒకసారి రాంకుమార్ ను పిలిపించాలి— అనుకున్నాడు కమీషనర్.

'రేపు పౌర్ణమి' అని మరుక్షణంలో గుర్తుకువచ్చింది.

అంటే పూర్ణాహుతి కార్యక్రమం రేపే .... తనకు ఆహ్వానం అందింది. పూర్ణాహుతి కార్యక్రమం యిచ్చే 'కిక్' గుర్తుకు వచ్చాక తను తప్పక ఆశ్రమానికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు కమీషనర్ —

ప్రతి పౌర్ణమి రాత్రి .... ఆశ్రమంలో పూర్ణాహుతి కార్యక్రమం జరుగుతుంది. ఆ కార్యక్రమానికి కొంత మంది అంతరంగిక భక్తులకు మాత్రమే ప్రవేశం ఉంటుంది. అదీ ఖచ్చితంగా ముప్పైమంది పురుషులకుమాత్రం.

ఆ కార్యక్రమం కోసమే ప్రత్యేకంగా ఆశ్రమం మధ్యలో ఓ కుటీరం నిర్మింపబడింది. నిజానికి అది కుటీరం కాదు. పైకప్పులేని ఓ హాలు. ఆ హాలు నలువైపులా పది అడుగుల ఎత్తుగా నిర్మింపబడ్డ దృఢమైన గోడలు.

ఆ హాలులో తెల్లని పాలరాతి గచ్చుమీద యెర్రని రంగుతో పెయింట్ చేయబడ్డాయి ముప్పయివృత్తాలు. ప్రతి వృత్తం మధ్య ఓ పసుపు పచ్చని తివాచీ పరుచబడి వుంటుంది. ఒక్కొక్క తివాచీపై మూడేసి వెండి పళ్ళెరాల్లో వివిధ రకాల పుష్పాలు అమర్చబడి వుంటాయి.

ప్రకృతి సహజమైన పున్నమి వెన్నెల వెలుగులో ముప్పైమంది పురుషులు నగ్నంగా ఆ హాలులోకి ప్రవేశించాలి. ప్రతి వృత్తంచుట్టూ ఒక్కొక్కరు చొప్పున మోకరిల్లి కూర్చుంటారు.

తరువాత ఆశ్రమంలోని ముప్పయిమంది అందమైన యువతులు నగ్నంగా ఆ హాలులోకి ప్రవేశిస్తారు. ఒక్కొక్క యువతి ఒక్కొక్క వృత్తం మధ్య పద్మాసనం వేసుకొని కూర్చుంటారు.

హాలుకు తూర్పువైపున వున్న వేదికపై వేయబడ్డ ముఖ్‌మల్ పరుపులపై స్వామీజీ ఆసీనులౌతారు.

'పూర్ణాహుతి' పూజా కార్యక్రమం ప్రారంభానికి గుర్తుగా కంచు గంట మ్రోగించబడుతుంది. గోడలకు అమర్చబడ్డ స్టీరియో బాక్సుల నుండి మత్తెక్కించే ఓ రకమైన సంగీతం ప్రసారం చేయబడుతుంది.

అదే సమయంలో హాలు నలువైపుల నుండీ ఓ రకమైన ధూపం వదలబడుతూంది. అది మత్తునిచ్చే కొన్ని అడవి మూలికల మిశ్రమ ధూపం.

హాలులో కూర్చున్న స్త్రీ పురుషులకు ఆ వాతావరణంలో ఓ వివశత్వం కలుగుతూంది. పురుషులు ఆ వృత్తం మధ్యలో కూర్చున్న యువతిని తమ ముందువున్న వెండి పళ్లెరాల్లోని పూలతో పూజిస్తారు. ఆ తరువాత యిద్దరూ కలిసి—అన్ని జంటలూ డాన్సు చేస్తారు. తర్వాత రాసక్రీడలు....

హీనయాన బౌద్ధమతంలోని కాపాలికులు చేసే మండల పూజావిధానాన్ని కొద్ది మార్పులతో 'పూర్ణాహుతి' పేరున తన ఆశ్రమంలో ప్రవేశపెట్టారు స్వామీజీ.

ఒక్కసారి స్వామీజీ అంతరంగిక భక్తునిగా యీ 'పూర్ణాహుతి' కార్యక్రమంలో పాల్గొన్న వారెవరైనా....యెంత గొప్పవారైనా స్వామీజీ గుప్పిటలో పూర్తిగా చిక్కినట్లే.

ఎందుచేతనంటే ఆ పూర్ణాహుతి కార్యక్రమం అంతా వీడియో కెమెరాతో సినిమాగా తీయబడుతుంది. ఆ ఫిల్ములను చూపి ఎందరో లక్షాధికారులను, ప్రభుత్వాధికారులనూ తన అవసరాలకు వుపయోగించుకుంటున్నారు స్వామీజ్.

## 9

ఢిల్లీ పాలం విమానాశ్రయంలో ఎయిర్ ఇండియా వారి బోయింగ్ విమానం టేక్ ఆఫ్ తీసుకుంది. అది ఢిల్లీ నుండి మద్రాసుకు పోయే మార్నింగ్ ఫ్లయిట్.

తన సీటు యెదురుగా వున్న ట్రేలో నుండి 'ప్రోబ్' తీసి పేజీలు తిరగవేయసాగారు సి.ఐ.బి. చీఫ్ కరుణాకర్. అతని కోటుజేబులో 'ఓ నేవీ బ్లూ' కవర్ వుంది. అందులో 'కరుణాకర్ ఆర్డర్స్ పాటించమని—ఈస్టరన్ నేవల్ ఫ్లీట్ కమాండర్, వైస్ ఎడ్మిరల్ దేవకీనందకు ఎడ్రస్ చేస్తూ....' అడ్మిరల్ జనరల్ ఆఫ్ ఇండియన్ నేవీ వ్రాసిన లెటర్ వుంది.

కరుణాకర్‌తోపాటు మరో ముగ్గురు సి.ఐ.బి. ఆఫీసర్లు కూడా అదే ఫ్లయిట్‌లో వైజాగ్ వస్తున్నారు.

అయితే, కరుణాకర్‌కు అర్థంకాని విషయం ఒక్కటే—ఆ స్మగ్లర్‌ను పట్టుకోవడానికి స్టేట్ పోలీస్ ఫోర్స్ సహాయం వద్దని, ఇంత శ్రమపడి సెంట్రల్ ఫోర్స్ అయిన 'నేవీ'నే రంగంలోకి దింపాలని రాంకుమార్ ఎందుకు కోరినట్లు?

రాంకుమార్‌కు స్టేట్ పోలీస్ ఫోర్స్‌మీద ఏమైనా అనుమానాలు వున్నాయా? ఆలోచనల్లో మునిగిపోయారు సి.ఐ.బి. చీఫ్ కరుణాకర్.

# 10

పున్నమి రోజు—

పూర్ణాహుతి కోసం ఆశ్రమంలో ఏర్పాట్లు చురుకుగా సాగుతున్నాయి. పూర్ణాహుతిలో పాల్గొనే ముప్పయి మంది ఆంతరంగిక భక్తుల లిస్టు, ఫొటోలతో సహా.... హాలు గేట్ కీపర్‌కు అందజేయబడింది.

ముప్పయిమంది యువతులు సెలక్టు చేయబడ్డారు. ఆ ఎంపిక స్వామీజీయే స్వయంగా చేస్తారు. ఆశ్రమంలోని యువతులందరూ ఓ హాలులో వరుసగా నిలబడతారు. తన చేతిలోని కంచీ కర్రతో నగ్నంగా వున్న వారి దేహాలపై అక్కడక్కడ పొడిచి వారి అవయవాల గట్టితనాన్ని పరీక్షిస్తారు స్వామీజీ.

17-వ శతాబ్దిలో బానిసలను కొనడానికి బానిస వ్యాపారులు కూడా అదే పద్ధతి అవలంబించేవారట.

స్వామీజీచేత ఎంపిక చేయబడ్డ ఆ ముప్పయిమంది యువతులూ ఓ ప్రత్యేక కుటీరంలో వుంచబడ్డారు.

అలా ఎంపిక చేయబడ్డవారిలో మూర్తి భార్య 'మణి' లేదు.

రాత్రి పది గంటలైంది—

యోగాశ్రమం ఆవరణ అంతా నిర్మానుష్యంగా వుంది. మెయిన్ గేట్ లోపలివైపు పెద్ద తాళంకప్ప వ్రేలాడుతోంది. ఆశ్రమం చుట్టూ వున్న చెట్లచాటున దూర, దూరంగా కూర్చుని వున్నారు ఇరవై మంది సన్యాసులు. పున్నమి వెన్నెలలో తళ, తళా మెరుస్తున్నాయి వారి ప్రక్కనున్న పంజాబీ తల్వార్‌లు.

పూర్ణాహుతి కార్యక్రమం ఆరంభానికి గుర్తుగా మూడు గంటలు కొట్టబడ్డాయి.

ఆశ్రమం మధ్యనున్న హాలులోకి పూర్ణాహుతి కార్య
క్రమంలో పాల్గొనే పురుషులు ఒక్కొక్కరే నగ్నంగా
ప్రవేశించసాగారు. ఆఖరి వ్యక్తి కూడా హాలులోకి
ప్రవేశించాక వారిచ్చిన ఐడెంటిటీ కార్డులను లెక్క పెట్టు
కున్నాడు గేటుదగ్గర వున్న గార్డు. వాటిని తన భుజానికి
వున్న సంచిలో వేసుకొని నెమ్మదిగా తలుపును మూసి,
లాక్ చేశాడు.

హాలు ముందున్న వేదికపై స్వామీ యోగానంద
కూర్చున్నారు. ప్రక్కనే ఈసారి విభూతి బాబా కూడా
వున్నారు.

"టంగ్ ....టంగ్ ....టంగ్ ...."

రెండవసారి గంటలు మ్రోగించబడ్డాయి.

వేదిక ప్రక్కనున్న ద్వారం తెరుచుకుంది. నెమ్మదిగా
నడచుకుంటూ ముప్పయిమంది యువతులు హాలులోకి
ప్రవేశించారు. పున్నమి వెన్నెల వెలుగులలో వారి నగ్న
దేహాలు నిగ, నిగా మెరుస్తున్నాయి.

తమ, తమ వృత్తాలలోకి యెవరు వస్తారో అని
ఆత్రంగా చూస్తున్నారు వృత్తాల చుట్టూ మోకరిల్లిన
పురుషులు.

సరిగ్గా అప్పుడే గోడలకున్న స్టీరియోలగుండా విని
పించసాగింది ఆఫ్రికన్ కాంగో డ్రమ్స్ శబ్దం.

## 11

రాత్రి సరిగ్గా పదకొండు గంటలు—

మొదటి బాచ్ ఏభయిమంది నేవెల్ కాడెట్లు
ఆశ్రమం ముందుభాగం నుండి కంచె దాటి ఆ పొదల్లో
నెమ్మదిగా ముందుకు ప్రాకసాగారు.

రెండవ బాచ్ ఏభయిమంది ఆశ్రమం వెనకవైపు

కంచె దాటి యువతులు ఉంచబడ్డ కుటీరాల దిక్కుగా నీడల్లా కదిలారు.

మూడవ బాచ్ నూరుమంది గార్డెట్లు ఆశ్రమం ఆవరణ చుట్టూ ఓ వలయంలా యేర్పడ్డారు. ఆశ్రమం నుండి ఒక్క పిట్టయినా పైకి పోకూడదని వారికి స్ట్రిక్టు ఆర్డర్స్ యివ్వబడ్డాయి.

హాలులో ప్రారంభమయిన సంగీతం, డ్రమ్స్ మోతలతో ఆశ్రమంలో ప్రవేశించిన కేడట్ల కదలికల సవ్వడులు కలిసిపోయాయి. కాపలాకాస్తున్న సన్యాసులు ఆ సంగీతం వింటూ లోపల జరుగుతున్న తతంగాన్ని ఊహించుకొని ఉద్రేకపడుతున్నారు.

క్షణాలు భారంగా దొర్లుతున్నాయి.

ఒక్కొక్క అంగుళం ప్రాకుతుంటూ నెమ్మదిగా ముందుకు జరుగుతున్నారు నేవల్ గార్డెట్లు. రైఫిల్స్‌ను పట్టుకొని ప్రాకటంలో మోచేతులు కొట్టుకు పోతున్నాయి.

హాలులోంచి వస్తున్న సంగీతం తారాస్థాయికి చేరుకుంది. చిన్నగా, కేకలు, మూలుగులు వినిపిస్తున్నాయి. వింటూ కాపలాకాస్తున్న సన్యాసులకు నరాలు జివ్వుమంటున్నాయి.

అలా ఊహల్లో తేలిపోతున్నవారు ప్రక్కనే అలికిడి అయ్యేసరికి ఉలికిపడ్డారు. ప్రక్కనే వున్న తల్వార్‌లు తీద్దామని చేతులు చాచారు ఆ సన్యాసులు. కాని అప్పటికే వారి గుండెలకు ఆనించబడ్డాయి రైఫిల్ బారెల్స్—

హాలు తలుపుకున్న 'కీ హోల్' నుండి లోపల జరుగుతున్న తంతును చూస్తూ తన్మయుడవుతున్నాడు హాలు

గేటు దగ్గరున్న గార్డు. ఎవరో తన వీపు తట్టినట్లయి చిరాగ్గా వెనక్కి తిరిగాడు.

ఎదురుగా యమకింకరునిలా నిలుచున్న వైస్ అడ్మిరల్ దేవకీనంద. అతని చేతిలోని రివాల్వర్ గార్డు గుండెలకు గురి పెట్టబడి వుంది. దేవకీనంద వెనుకే బిల, బిలమంటూ లోపలికి ప్రవేశిస్తున్నారు నావెల్ కాడెట్లు.

స్టీరియో బాక్స్ల నుండి వినిపిస్తున్న సంగీతం ఒక్కసారి ఆగిపోయేసరికి హాలులోని వారంతా ఒక్కక్షణం నిశ్చేష్టు లయ్యారు. అప్పటికే కామోద్రేకంతో వేదెక్కిన భక్తులు ఒక్కసారి చిరాగ్గా వేదికవంక చూశారు 'ఏం జరిగిందన్నట్లు.'

స్వామీ యోగానందకు కూడా యేం జరిగిందో అర్థం కాక తెల్లముఖం వేశారు.

అంతలో హఠాత్తుగా హాలు తలుపులు తెరుచు కున్నాయి. బిల, బిలమంటూ లోపలికి ప్రవేశించి హాలు చుట్టూ వలయంలా యేర్పడ్డారు నావెల్ కాడెట్లు. వారి చేతిలోని రైఫిల్స్ హాలులోని వారికి గురి పెట్టబడి వున్నాయి.

ఏం జరుగుతూందో యెవరికీ అర్థం కావటంలేదు.

అంతా అయోమయంగా వుంది.

సరిగ్గా అప్పుడు స్టీరియో బాక్స్ల నుండి ఓ హెచ్చ రిక వినిపించింది. కేవలం రెండే రెండు వాక్యాలు.

"ఎవరూ మీ... మీ....స్థానాల నుండి దయచేసి కదలవద్దు. కదిలితే నిర్దాక్షిణ్యంగా కాల్చివేయబడ తారు—"

ఆ గొంతు సి.ఐ.బి. చీఫ్ కరుణాకర్ ది.

తాము అరెస్టు కాబడ్డామన్న నిజం మెల్ల, మెల్లగా

ఆ హాలులోనివారికి అర్థం కాసాగింది. అసలు ఆ షాక్ నుండి తేరుకోవడానికే కొన్ని నిముషాలు పట్టింది వారికి.

అంతవరకూ వారు పట్టించుకోనిదీ, వారికి గుర్తురానిదీ ఓ విషయం సరిగ్గా అప్పుడే గుర్తుకు రాసాగింది ప్రతి ఒక్కరికీ.

అది తాము ఇంతవరకూ నగ్నంగా వున్నామనే విషయం.

అదీ పరాయివారి ఎదుట.

అప్పుడు ముంచెత్తుకువచ్చింది వారిలో విపరీతమైన సిగ్గు. కాని కప్పుకోవడానికి ఆ హాలులో చిన్న గుడ్డపీలిక కూడా లేదు.

స్వామీ యోగానందకు ఆ షాక్ నుండి తేరుకోవడానికి రెండు నిముషాలు పట్టింది. తేరుకున్న మరుక్షణం మెల్లగా లేచాడు.

అతడు యిప్పుడు ఆలోచిస్తున్నది—యిదంతా యెలా జరిగిందని కాదు. ఇప్పుడు యెలా తప్పించుకుని బయట పడటం అని!

గిరుక్కున వెనక్కు తిరిగాడు. వేదిక వెనుక వున్న ద్వారంవైపు అడుగు వేశాడు. కాని అప్పటికే అతని యెడమ కణతకు ఆనించి వుంది రివాల్వర్ బారెల్.

నమ్మలేనట్లు చూశారు యోగానంద.

ఎదురుగా నవ్వుతూ నిలుచున్న విభూతి బాబా.

అదే క్షణంలో—

వేదిక పక్కనున్న ద్వారంగుండా లోపలికి ప్రవేశించారు సి.ఐ.బి. ఛీఫ్ కరుణాకర్, ఈస్టరన్ నేవల్ ఫ్లీట్ కమాండర్, వైస్ అడ్మిరల్ దేవకీనంద.

"కంగ్రాట్స్ రాంకుమార్ ....రియల్లీ యూ డిడ్ ఇట్ -" ఆనందంగా విభూతిబాబా భుజం తట్టారు కరుణాకర్.

అంతవరకూ తన నగ్న దేహాన్ని చూపించలేక సిగ్గుతో కుంచించుకుపోతున్న పోలీసు కమీషనర్ చివ్వున తలెత్తాడు.

సన్నగా నవ్వుతూ తన పెట్టుడు గడ్డం, మీసాలను తొలగిస్తున్నాడు విభూతి బాబా.... ఉరఫ్ రాంకుమార్.

# 12

హోటల్ ఛాల్విన్‌లోని కళింగా రెస్టారెంట్‌లో కబుర్లు చెప్పుకుంటూ డిన్నర్ తీసుకుంటున్నారు సి.ఐ.బి. చీఫ్ కరుణాకర్, వైస్ అడ్మిరల్ దేవకీనంద, రాంకుమార్. మిగిలిన సి.ఐ.బి. ఆఫీసర్లు, ఆపరేషన్‌లో పాల్గొన్న రెండువందలమంది నేవల్ కాడెట్లతో ఆ రెస్టారెంట్ కళ కళ లాడుతోంది.

ఆ రాత్రి రెస్టారెంట్ కళింగా వీరి కోసమే ప్రత్యేకంగా రిజర్వ్ చేయబడింది.

ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ నాగభూషణ రావుకు అన్ని సాక్ష్యాలతో ఆ కేసు అప్పగించబడింది. అంతటితో సి.ఐ.బి. వారి పని ముగిసినట్లే. ఇక కేసుని కోర్టు డీల్ చేస్తుంది.

ఆ రెస్టారెంట్‌లోని వారందరి ముఖాలలోను ఓ ఎడ్వెంచర్ చేసిన సంతృప్తి తాండవిస్తూంది.

"ఒకే ఒక్క సందేహం నన్ను పీడిస్తోంది రాంకుమార్." చేతిలోని స్పూన్‌తో టొమేటో సూప్‌ను కలుపుతూ అన్నారు కరుణాకర్.

"స్టేట్ పోలీస్ ఫోర్స్‌ను కాకుండా, కేవల్ ఫోర్స్‌ను రంగంలోకి దింపడం గురించే కదా?" నవ్వుతూ అడిగాడు రాంకుమార్.

'అవునన్నట్లు' మెచ్చుకోలుగా రాంకుమార్ వైపు చూశారు కరుణాకర్.

చేతిలోని స్పూన్‌ను సూప్ డిష్‌లో పడేసి చెప్ప సాగాడు రాంకుమార్.

"నిన్న అరెస్టు అయినవారిలో ఎవరెవరు వున్నారో మీరు చూశారుగా. పోలీస్ కమీషనర్, ఓ స్టేట్ మినిష్టర్, ఇద్దరు ఎం.ఎల్.ఏ.లు, ఒక ఎం.పీ., యింకా యెందరో ప్రభుత్వ ఉన్నతాధికార్లు, బిజినెస్ మాగ్నెట్‌లూ. వీరందరూ స్వామీజీ అంతరంగిక భక్తులే.

విభూతి బాబాగా స్వామీజీ ఆశ్రమంలో ప్రవేశించిన నాకు ఆశ్రమంలోని ఏర్పాట్లు, స్వామీజీ చేస్తున్న వ్యాపార విషయాలు తెలిశాక, ప్రభుత్వంలోని కీలక స్థానాల్లో వున్నవారి సహాయ సహకారాలు లేకుంటే స్వామీజీ యింత నిర్భయంగా, పకడ్బందీగా తన వ్యాపారాన్ని కొనసాగించలేడనిపించింది.

స్వామీజీ ఆశ్రమానికి వస్తున్న భక్తులలో కొందరిని చూసేసరికి నాకు నిజంగా మతిపోయింది. వారిని చూశాక నాకు ఒక విషయం రూఢి అయింది. నేను స్వామీజీ గురించి యే కంప్లయింట్ చేసినా.... ఆ వార్త ఖచ్చితంగా ఎలాగో, ఒకలా స్వామీజీకి అందజేయబడుతూంది. అప్పుడు నా ప్రయత్నమంతా వృధా అవుతూంది.

రాష్ట్ర ప్రభుత్వానికి తెలియకుండా.... రాష్ట్ర పోలీస్ ఫోర్స్ సహాయం తీసుకోకుండా.... ఈ 'ఆపరేషన్' పూర్తి చేయాలి.

ఎలా....? అదే ఆలోచించసాగాను.

అంతలో సడన్‌గా గుర్తుకువచ్చింది వైజాగ్‌లోని నేవల్ ఫోర్స్ విషయం. నేవల్ సెంట్రల్ ఫోర్స్ కదా. దాని సహాయం తీసుకుంటే — అనిపించింది. అయితే ఈ విషయం ఎట్టి పరిస్థితులలోనూ రాష్ట్ర ప్రభుత్వానికి తెలియకూడదు. వెంటనే అన్ని వివరాలతో మిమ్మల్ని కాంటాక్టు చేశాను."

ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టారు సి.ఐ.బి. ఛీఫ్ కరుణాకర్.

—: అయిపోయింది :—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

ఆమె మాటలు యింకా పూర్తికానేలేదు.

ఒక్కసారిగా యెక్కడ్నుంచో సింహగర్జన వినిపించింది. మొదట్లో అది సింహగర్జన కాదేమోననుకున్నారు. కాని వారి అనుమానాలను నివృత్తిచేస్తూ మృగరాజు కళ్ళ ముందు మెరుపు వేగంతో ఎగరటం కనిపించింది.

దుప్పిని వేటాడిన సంబరంలో వున్న ఆటవికులమీదికి ఏ మూలనుంచో అమాంతం దూకింది సింహం. దూకుతూనే ఒకడ్ని నేలకరిపించి, మరొకడి కంఠం కసుక్కున కొరికి రక్తం పీల్చేసింది. మూడోవాడ్ని పంజాతో ముఖంమీద కొట్టింది. పెద్ద మాంసఖండాన్ని నోట కరచుకుంది.

సౌమ్య కెవ్వున కేక వేయబోయింది. ఆమె కేక గొంతులోనే ఆగిపోయింది. మిగిలిన యిద్దరు ఆటవికులు కకావికలై తలోదిక్కు ప్రాణభీతితో పరుగులు పెట్టారు.

సింహం ముగ్గుర్నీ చంపేసింది. తనకొక్కావలసినంత మాంసం తిని కళేబరాల్ని అలాగే వదిలేసి వచ్చినంత వేగంగానూ ఎటో మాయమైపోయింది!

పెద్దపులి ఒకసారి వేటాడిన జంతువును దాచుకుని కళ్ళబెట్టుకొని తింటుంది. సింహం అలా కాదు. ఎప్పుడు కావలిస్తే అప్పుడు! అప్పటికప్పుడు వేటాడి ఆహారాన్ని సంపాదించుకుంటుంది. మిగిలిన ఆహారం అలా వదిలేసి పోతుంది.

జీవితంలో మొదటిసారిగా సింహం వేటాడటం స్వయంగా చూశారు నవీన్, సౌమ్య. సింహానికి మృగరాజనే పేరెలా వచ్చిందో గ్రహించారు వాళ్ళు.

"ఈ అడవిలో లేని జంతువు లేదంటే అతిశయోక్తి కాదేమో! క్రూరమృగాలకి ఆటపట్టులాగా వున్నది. నేల మీదికి దిగేకన్నా యీ చెట్టు మీదే సురక్షితంగా వున్నట్టుంది...."

నవీన్ మాటలు పూర్తికానేలేదు. సౌమ్య అతన్ని భుజంపట్టి పక్కకులాగింది. ఆ ఊపుకు నేలమీదకు పడిపోయేవాడే!

సౌమ్య చూపుల్లో భయం కొట్టొచ్చినట్టు కనిపించింది. నవీన్ ఆమె చూపులు ప్రసరించిన వైపుని చూసి త్రుళ్ళిపడ్డాడు.

పైకొమ్మమీది నుంచి సరాసరి తన మొహందాకా వచ్చిన కొండచిలువ కొండ గుహలాంటి నోరు తెరుచుకుని తనని కబళించటానికి సిద్ధంగా వుంది. సరిగ్గా అదే సమయంలో తనని పక్కకి లాగింది సౌమ్య.

చుట్లు చుట్లుగా పైకొమ్మకు చుట్టుకొని వున్నది కొండచిలువ. ఒకేసారి మనిషిని మింగేసి జీర్ణం చేసుకోగల

మహాకాయంగల చిలుక అది!

మెరుపు వేగంతో సౌమ్యను తీసుకొని కింద కొమ్మకి దానిపైనుంచి నేలమీదకి దిగిపోయాడు నవీన్. అంతా క్షణాల్లో జరిగిపోయింది!

నవీన్ సింహం వేటాడిన స్థలం వైపు అడుగులు వేస్తుంటే "అటు ఎక్కడికి? అక్కడ సింహం ..." అని సౌమ్య యేదో అనబోతుండగా ఆమె చేతిని మెల్లగా నొక్కి, చిన్నగా నవ్వి "సింహం ఈరోజు మరి వేటాడదు. దానికి అత్యాశ లేదు. మళ్ళీ ఆకలయ్యే వరకు ఆహారం జోలికి పోదు. దానికి యిప్పట్లో ఎటూ ఆకలి వెయ్యదు" అన్నాడు.

• • •

ఆ దృశ్యం చాలా బీభత్సంగా వుంది.

శరీర భాగాలన్నీ శస్త్ర చికిత్స చేసినట్టు ముక్క ముక్కలయిపోయిన ఆటవికుల కళేబరాలు రక్తంతో తడిసి భయోత్పాతం కలిగిస్తున్నాయి. జుగుప్సతో కళ్ళు మూసుకుంది సౌమ్య.

నవీన్ కిందపడివున్న ఆటవికుల విల్లులు రెండు తీసుకున్నాడు. మూడోది విరిగిపోయింది. అంబుల పొదులు కూడా చెదిరిపడిపోయాయి. వాటినికూడా సేకరించాడు.

"నీకు విల్లుపయోగించటం వచ్చా?" అన్నాడు నవీన్. రాదని తల అడ్డంగా తిప్పింది.

"నాకు వచ్చు. ఏరో షూటింగ్ చాలా ఇంట్రెస్టింగ్ ఆర్ట్. నేను హైద్రాబాద్‌లో నేర్చుకున్నాను" అన్నాడు నవీన్. సౌమ్య అతని వంకే చూస్తోంది.

"సరే అంబులపొది, ఓ విల్లు నీ దగ్గరుంచు ప్రస్తుతం ప్రాణరక్షణకు మనకివే ఆయుధాలు!" అన్నాడు చిన్నగా

నవ్వి.

వాళ్ళిద్దరు ఆ స్పాట్ నించి పదిగజాలు ముందుకు వెళ్ళారో లేదో, శవాలని పీక్కుతినటానికి ఎక్కడెక్కడున్నంచో నక్కలు రాబందులు హాజరై పోయాయి.

"తొందరగా నడు. రాబందులు బతికున్నవాళ్ళ కళ్ళు కూడా పొడిచేస్తాయని విన్నాను" అన్నాడు నవీన్ సౌమ్య చేతిని పట్టుకొని ముందుకు నడుస్తూ.

ఓ ఫర్లాంగు దూరం గమ్యంలేకుండా అలాగే సాగిపోయారు.

ముందుకు అడుగు వెయ్యబోయి చటుక్కున ఆగిపోయాడు నవీన్. సౌమ్య ప్రశ్నార్థకంగా చూసిందతని వంక.

ఎదురుగా ఆకులు అలములతో కప్పి వుంచిన పెద్ద గొయ్యిని చూపించాడు నవీన్. సౌమ్య ఆశ్చర్యంగా చూసింది.

జంతువులకోసం పెట్టిన మాటు అది! బహుశా యిందాకటి అయిదుగురు ఆటవికులు జంతువుల్ని వేటాడటానికి మాటు పన్నారన్నమాట! నాగరికులే కాదు, ఈ ఆటవికులుకూడా వేటలో అధునాతన పద్ధతులు నేర్చారా? లేక యీ ఆటవికుల్నించే నాగరికులు నేర్చుకున్నారా? ఏమో ....!

నేలమీద ప్రతి అంగుళం జాగ్రత్తగా చూసుకుంటూ నడుస్తున్నారు — అదే సన్నని కాలిబాట వెంట. రాను రాను దారి మరీ యిరుకై పోయింది. ఈ దారి అసలు యెక్కడికిపోతోంది? అంతా అగమ్యగోచరంగా

వున్నది!

కొద్దిదూరం నడిచాకో లేదో ఎక్కడ్నుంచో 'ధాఢా' మంటూ అడవి కుక్కలు పరుగెత్తుకుంటూ వచ్చాయి. ఒక్కొక్కటి మూడు అడుగుల ఎత్తులో నాలు గడుగుల పొడవుతో, అడుగు పొడవు నాలుకలను బయటకు చాచి అల్సేషన్ కుక్కలను తలదన్నేలాగా బలిష్టంగా, క్రూరంగా వున్నాయి. వాటి ముఖాలను దేంతోనో చదును చేసేసినట్టు బల్లపరుపుగా వున్నాయి. రెండంగుళాల పొడవున్న కోరలు స్పష్టంగా బయటకి కనిపిస్తున్నాయి.

దూరం నించి తోడేళ్ళేమో అనుకున్నారు. మరి కాస్త దగ్గరకొచ్చాకగాని అవి అడవి జాగిలాలన్న విషయం వాళ్ళ మెదడుకు తాకలేదు.

నవీన్ ఒక్క క్షణంకూడా వృధా చెయ్యలేదు. చకచక అమ్ములపొది నుంచి బాణాలుతీసి విల్లు సంధించి చకచక గురిచూసి వదిలాడు.

అంతే! అతని బాణాలు ఒక్కొక్క జాగిలాన్ని నేలమీద దొర్లింపచేశాయి. అంబులపొదిలోంచి తీసే లోపల సౌమ్య తన చేతనున్న అంబులపొదినుంచి బాణాలు సిద్ధంగా అందించింది. దాదాపు పది పన్నెండు జాగిలాలు నేలకరిచాక తక్కినవి తోకలు ముడిచి యెటో పారి పోయాయి.

ఊపిరి పీల్చుకోకుండా బాణాలు సంధించి వదిలిన నవీన్ శారీరకంగా బాగా అలిసిపోయాడు. ఒకదాని వెంట మరొకటి సినిమారీళ్ళలా మహావేగంగా జరిగిపోతున్న సంఘటనలు అతని మానసిక శారీరక క్లేశానికి కారణా

అయ్యాయి.

సౌమ్య జాలిగా చూసిందతనివంక. "కాసేపు అలసట తీర్చుకోనవీ, బాగా సైరయిపోయావు" అన్నది లాలనగా.

"ఊహూం. మనకి విశ్రాంతి సరిపడదు. అడవిదాటి అడుగు బయటపెట్టాక ఓ రోజంతా పూర్తిగా విశ్రాంతినే కేటాయిస్తాను. అంతదాకా మన డిక్షనరీలో ఆ మాటకి అర్థమే లేదు" గంభీరంగా ధ్వనించిన అతని మాటలకు, లోలోన గర్వించింది సౌమ్య.

* * *

దూరంగా పొగ పైకిలేస్తూ కనిపించింది.

"బహుశా అక్కడ యీ ఆటవికులు నివసిస్తూండ వచ్చు. అటు వెళ్ళటం ప్రమాదకరం!" అన్నాడు నవీన్ చూపుని గుచ్చి చూస్తూ.

సౌమ్య పరీక్షగా చూసి తలూపింది. "అవును, అది మరో గూడెంలాగా వున్నది. ఇది మనకి అలవాటయిన ప్రదేశం కాదు కాబట్టి నిశ్చయంగా అది ఇంకో గూడెం!" అన్నది.

"అయితే యీ చుట్టుపక్కల ఎక్కడో నీరు దొరుకు తుంది. ముఖం కాళ్ళు కడుక్కుంటే గాని అలసట తీరదు. రాత్రినుంచి చాలా దాహంగా వున్నదికూడా!" అన్నాడు నవీన్.

చకచక పక్కనున్న చెట్టెక్కి చుట్టూ పరికించి చూశాడు. వెంటనే కిందికి దిగివచ్చి, "పద, మన కుడి వైపు చాలా దగ్గర్లోనే ఏదో సెలయేరు కనిపించింది. పోయి చూద్దాం" అన్నాడు.

ఇద్దరు పదినిమిషాల తర్వాత నీటి చరియ దగ్గరకు చేరుకున్నారు. గతంలో పెద్దపులి నీరు తాగిన సెలయేరు నించి ఒకపాయి విడిపోయి ఆ వైపునించి ప్రవహించినట్టు గ్రహించారు.

నీటిని చూడగానే సౌమ్యకి ప్రాణం లేచివచ్చింది. ఆనందంగా సెలయేట్లో దిగింది. ముఖం, కాళ్ళు చేతులు కడుక్కుని దోసిట్లో నీళ్ళు తీసుకుని తాగింది. తియ్యగా వున్నాయి నీళ్ళు. నిరంతరం అలా ప్రవహిస్తూనే వుండడం వల్లనో యేమో స్ఫటికంకన్న స్వచ్ఛంగా, తెల్లగా వున్నాయి నీళ్ళు. ఇసుక, గులకరాళ్ళు అడుగునుంచి కనిపిస్తున్నాయి.

"స్నానం చేస్తావా?" అన్నాడు చిలిపిగా సౌమ్య వంక చూస్తూ నవీన్.

సౌమ్య చిరుకోపం ప్రదర్శించింది. "ఏమిటి నీ ఉద్దేశ్యం? నీ యెదురుగా స్నానం చెయ్యమంటావా? హౌ డేర్ ఆర్యూ?" అన్నది.

నవీన్ నవ్వేశాడు. వాళ్ళకి ఆ క్షణంలో తామున్న పరిస్థితి గుర్తులేదు, కష్టం సుఖం కలబోసుకుని రెండు రోజులుగా ఎంతో సన్నిహితంగా మెలగటంవల్ల యిద్దరు ఒకర్నొకరు అర్థం చేసుకోవటమేకాక, యిద్దరిమధ్య రహస్యం అన్నదే లేకుండా ఒకటిగా కలిసిపోయారు.

నవీన్ మాత్రం శుభ్రంగా నీటిలో మునిగి అలసట తీరేవరకూ స్నానం చేశాడు. పైకొచ్చాక గుడ్డలు విప్పి పిండుకున్నాడు.

"ఏయ్, నా ముందర అలా నించోకు, నాకు సిగ్గేస్తోంది" అన్నది సౌమ్య సిగ్గుపడుతూనే అతని నగ్న

సౌందర్యాన్ని తనివితీరా చూస్తూ.

ఆజానుబాహువైన నవీన్ కసరత్తువల్ల సంక్రమించిన దృఢమైన బాహువులతో విశాలమైన ఛాతీతో సమ్మోహన పరిచేలా వున్నాడు. చామన ఛాయతో దాదాపు అరడుగుల ఎత్తు విగ్రహంతో సౌమ్యకి కన్నులపండుగ చేస్తున్నాడు.

"నేను పిండనా గుడ్డల్ని?" అన్నది అలవోకగా అతనివంక చూస్తూ.

"ఆ రోజులు ముందున్నాయి. ప్రస్తుతానికి సెల్ఫ సర్వీస్!" అంటూ తడిచిన గుడ్డల్ని ఆరకుండానే అలాగే వేసేసుకున్నాడు నవీన్. సౌమ్య అతని భుజాల దగ్గరకు వచ్చింది. ఆమెను పొదివి పట్టుకొని నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె గువ్వలా అతని గుండెలమీద తల పెట్టుకొని అరమోడ్పు కన్నులతో అతని కళ్ళలోకి పరవశంగా చూసింది.

"సౌమ్యా, మనదేనాటి బంధమో! అనుకోకుండా కలిశాము. అనుకోకుండా అడవిపాలబడ్డాము. ప్రమాదాల నట్టనడుమ, మృత్యువుకి వెంట్రుకవాసిలో నించున్నాము. అయినా మనకి భయంగాని, బతుకుమీద తీపిగాని లేవు. బతికితే కలిసి జీవితాంతం బతుకుదాం. లేదా కలిసి మృత్యువుని కౌగలించుకుందాం" అన్నాడు నవీన్.

సౌమ్య అతని భుజాలమీదుగా అతని వీపుమీదకి చేతుల్ని మునివేళ్ళతో బంధించింది.

సరిగ్గా అదే సమయంలో వారి పక్కగా ఏదో అలికిడి అయింది. ఉలిక్కిపడి యిద్దరు విడిపోయారు.

కళ్ళెదుట కనిపించిన దృశ్యం వాళ్ళని నిర్ఘాంతపోయేలా చేసింది.

* * *

బత్తాయికాయ పరిమాణంలో వున్న తేనెటీగలు ఝుమ్మంటూ శబ్దం చేసుకుంటూ వారివైపు రివ్వురివ్వున వస్తున్నాయి.

రాక్షస తేనెటీగల్లా విపరీతమైన పరిమాణంలో వున్న వాటిని చూడగానే యిద్దరికీ ప్రాణాలు అవిసిపోయాయి. అంగుళం పొడవున్న వాటి తొండాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అయితే అదే సమయానికి అటుగా నాలుగు కుందేళ్ళు పరిగెత్తుతూ వచ్చాయి. రాక్షస తేనెటీగలు ఒక్కసారిగా కుందేళ్ళమీదికి దాడిచేశాయి. తెల్లటి కుందేళ్ళు ఒక్కసారిగా నల్లగా మారిపోయినట్టు వాటి దేహాలమీద తేనెటీగలు ఏమాత్రం సందులేకుండా వాలిపోయాయి. కుందేళ్ళు ముందుకు కదల్లేనట్టు అలాగే ఆగిపోయాయి. సరిగ్గా అయిదు నిమిషాల తర్వాత తేనెటీగలు కుందేళ్ళ మీదినుంచి ఝుమ్మంటూ లేచాయి. కుందేళ్ళ స్థానంలో ఉత్త బొమికలు మాత్రం మిగిలాయి.

నవీన్, సౌమ్య ఆశ్చర్యంగా చూశారా దృశ్యాన్ని రక్తమాంసాలు పీల్చే ఆ రాక్షస తేనెటీగలు తమను చుట్టుముడితే జరగబోయే పర్యవసానం గ్రహింపురాగానే యిద్దరు ఒకేసారి పరుగుపెట్టసాగారు.

ఏదైనా జంతువో మరేదైనా అయితే విల్లు ఎక్కుపెట్టి బాణం వదిలేవాడు నవీన్. కాని ఆ తేనెటీగల్ని బాణాలతో నాశనం చేయటం సాధ్యంకాని పని

ఏదైనా వెడల్పాటి టెన్నిస్ బ్యాట్‌లాంటిది వుంటే వాటిని కొటాడవచ్చు. కాని ఆ అడవిలో అలాంటి సాధనం ఎలా వస్తుంది?

నవీన్, సౌమ్యలను రాక్షస తేనెటీగలు వెంటాడుతున్నాయి. వందల సంఖ్యలో బారులుతీరి ఎగురుతున్న ఆ తేనెటీగలు పక్షుల గుంపులు ఆకాశంలో యెగురుతున్న దృశ్యాన్ని తలపింపచేస్తున్నాయి. వాటి ఝుమ్మనే నాదం విమానం ప్రొపెల్లరు శబ్దాన్ని మించిపోయింది.

శబ్దం ఆగిపోవటంతో ఇద్దరు చటుక్కున ఆగి వెనక్కి చూశారు. రాక్షస తేనెటీగలు ఏదో జంతువుమీదికి దాడిచేశాయి. పరీక్షగా చూశారు.

అడవిదున్న! పోతరించి భీకరంగా వున్నది! అది తమని వెంటాడి పరుగెత్తుకొస్తున్నట్టుంది. ఈలోపల రాక్షస తేనెటీగలు దాన్ని చుట్టుముట్టేశాయి.

అడవిదున్న శరీరం పూర్తిగా నల్లటి ముసుగు వేసుకున్నట్టు దాని శరీరం నిండా తేనెటీగలు ఆక్రమించుకున్నాయి. అడవిదున్న యిష్టం వచ్చినట్టు అటు యిటు పిచ్చిగా పరుగెడుతోంది. కాని అప్పటికే తేనెటీగలు దాని రక్తమాంసాలు పీల్చేయటం మొదలెట్టాయి.

అడవిదున్న అమాంతం నేలమీద పడిపోయింది.

"ఈ రాక్షస ఈగల రొదలో మనకి అడవిదున్న వెంటాడిన శబ్దంకూడా వినిపించలేదు. నిజంగా ఆ దున్నకి ఈగలు అడ్డుపడకపోతే యీపాటికి ఆ దున్న మనల్ని నేలమీద పొర్లించి చంపేసి వుండేది. ఓ విధంగా ఈ తేనెటీగలు మనకి మహోపకారమే చేశాయి" అన్నాడు నవీన్.

"ఇవి తేనెటీగల్లా కనిపిస్తున్నాయిగాని, నిజానికి తేనెటీగలు కాదు. ఏదో భయంకర జాతికి చెందిన కీటకాలు. తేనెటీగలైతే తేనెపట్టు పెట్టుకుంటూాయి. తుట్టను రేపితేగాని అవి రెచ్చిపోయి మనుషుల్ని కుట్టవు. ఇవి రక్తమాంసాల్ని పీల్చే ఏవో కీటకాలు. వీటిని మనం యెప్పుడూ చూడలేదు" అన్నది సౌమ్య.

"అవి అడవి దున్నమీది నుంచి మనమీదికి మళ్ళీ లోపల యేదైనా సురక్షిత స్థావరానికి చేరటం అన్ని విధాలా శ్రేయస్కరం."

"అదిగో, ఆ ఎదురుగా రెల్లు గడ్డితో నేసిన గుడిసెలు కనిపిస్తున్నాయి. అనుకోకుండా రాక్షస ఈగలచేత తరమబడి యిక్కడికే వచ్చేశాం."

"అవును. మళ్ళీ కోయల చేతుల్లో చిక్కుకోవటం మంచిది కాదు. మరో దారిన వెళ్ళే ప్రయత్నం చేద్దాం."

"ఆ ఎగుడు దిగుడు కొండదారి తప్పితే మనకి మరో దారి కనిపించటం లేదు. నలిగిన రహదారిన రావటం వల్లనే యీ గూడెం చేరుకున్నాం."

"సరే, ఆ కొండదారినే ప్రయత్నిద్దాం."

ఇద్దరు మిట్ట పల్లాలతో ఎగుడు దిగుడుగా వున్న దారి పట్టారు. ఎటు చూసినా రకరకాల చెట్లు! పేరు తెలీని చెట్లు అనేకం. ఎక్కువగా మత్తిచెట్లు, మామిడిచెట్లు, జువ్విచెట్లూ కనిపిస్తున్నాయి. తక్కిన చెట్లని యింతవరకు యెన్నడూ వాళ్ళు చూడలేదు!

మామిడిచెట్లునిండా పచ్చగా పండిన పళ్ళు! ఎవరూ కోయకుండా అలాగే వదిలేస్తూన్న సూచనగా చెట్లకింద గుట్టలుగుట్టలుగా పడిన పళ్ళు. కుళ్ళిపోయిన పళ్ళు, పిట్టలు

సగం తిని పారేసిన పళ్ళు లెక్కకు మించి వున్నాయి.

చెట్లకి చేతికి అందేటంత కిందుగా వున్న పళ్ళను కోశాడు నవీన్. సౌమ్యకందించాడు. చెట్టునే మాగిన పళ్ళు ఘుమఘుమలాడుతున్నాయి. పళ్ళని చూడగానే అంతర్గతంగా వున్న ఆకలి మేల్కొంది.

ఇద్దరు కడుపునిండా మామిడిపళ్ళు తిన్నారు. సెలయేరు దాటి చాలాదూరం వచ్చేసినందువల్ల దాహంగా వున్నా నీళ్ళు లభించలేదు.

* * *

ఎత్తుగా వున్న కొండను ఏటవాలుగా ఎక్కవలసి రావటంతో సౌమ్య బాగా అలిసిపోయింది.

ఇంకా నాలుగైదు గజాలు యెక్కితే అవతల తట్టున యేముందో చూడటానికి వీలయ్యేది. కాని యింతలోనే వాళ్ళ కళ్ళకు కనిపించిన దృశ్యం కాళ్ళకు బ్రేకులు వేసింది. అకస్మాత్తుగా నిల్చుండిపోయి అలే చూడసాగారు.

అక్కడ బండరాళ్ళను చుట్టుకొని పదుల సంఖ్యలో పాములు వేలాడుతున్నాయి. గోధుమ తాచు, నల్లతాచు, రక్తపింజర, కట్లపాములు—రకరకాల పాములు వులవుల్లాడుతూ తిరుగుతున్నాయి. చుట్టూ ఎటు చూసినా కలుగులున్న పుట్టలు!

ప్రత్యేకం అక్కడ పాములకే నిలయమన్నట్టు ఎటు చూసిన అవే! కొన్ని అరడుగుల పొడవు మరి కొన్ని ఎనిమిది అడుగులు అంతకుమించి పొడవు వున్నాయి. చూడటానికి భయంకరంగా, ఊపిరి విడిచిన శబ్దంవింటే యెక్కడ తమని చుట్టుముట్టుతాయోనన్నంత బీభత్సమైన వాతావరణం చూసి కొద్దిక్షణాలు శిలాప్రతిమల్లా నిల్చుండి

పోయారు నవీన్, సౌమ్య.

కొన్ని సర్పాలు చుట్టచుట్టుకొని వుంటే మరికొన్ని తోకమీద నిలిచి నాట్యం చేస్తూన్నట్టు కనిపించాయి. పడగవిప్పిన సర్పాల తలలపై కృష్ణ పాదాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. మధ్య మధ్య అవి బుస్‌మంటూ తలలు పైకెత్తి మళ్ళీ ముడుచుకొని పడుకుంటున్నాయి.

ఒకేసారి అంత పెద్ద మొత్తంలో వాళ్ళెప్పుడు అన్ని సర్పాలను చూసివుండలేదు. ప్రత్యేకం జూలో పెట్టిన 'సర్పెంట్ సెల్'లాగా వున్నది ఆ ప్రాంతం.

చప్పుడు చెయ్యకుండా కిందికి దిగిపోయారు నవీన్, సౌమ్య. మళ్ళీ సమతలమైన ప్రదేశంలోనికి వచ్చారు.

"దాదాపు రెండు గంటలు వృధాగా నడిచాం. కాళ్ళ నొప్పులు పుట్టేలా మిట్టపల్లాలు ఎక్కి దిగాం. నయం, అవి మనల్ని గుర్తించలేదు. లేకుంటే ఒక్కసారి వాటి మధ్య చిక్కుకుంటే బతికి బయటపడటం కల్ల!" అన్నాడు నవీన్.

సౌమ్య కళ్ళముందు యింకా ఆ సర్పాలు కలకల్లాడుతూ తిరుగుతున్న దృశ్యమే కదలాడుతోంది. ఎంత మరచిపోదామనుకున్నా మరపుకు రావటంలేదు. ఆ సర్పాలు తన కాళ్ళకు చుట్టుకున్నట్టు, కాళ్ళమధ్య సంచరిస్తున్నట్టు తనని చుట్టుముట్టి వున్నట్టు అదోరకమైన మానసిక సంక్షోభంలోపడి చాలా సేపటివరకు తేరుకోలేక పోయింది.

"బాగా భయపడిపోయినట్టున్నావు" అన్నాడు నవీన్ ఆమె వెన్ను నిమురుతూ.

"భయంకాదు. ఏదో చెప్పలేని జలదరింపు. ఒళ్ళు

గగుర్పొడిచి ఇప్పటిదాకా నిమిత్తంగా అనిపించటంలేదు" అన్నదామె పెదాలని నాలుకతో తడుపుకుంటూ.

"కాసేపు విశ్రాంతి...."

"వద్దు వద్దు. అప్పుడే పదిగంటలు కావస్తోంది. సాయంత్రమయ్యేలోపల యిక్కడ్నుంచి బయటికి చేర గలిగితే సంతోషమే!"

ఇద్దరు మళ్ళీ నడక సాగించారు. చెట్లమీద పక్షులు ఏవేవో సంకీర్ణ ధ్వనులు చేస్తున్నాయి. గుబురుగా వున్న పొదల్లో చిన్నచిన్న జంతువులు అటు యిటు పరుగులు పెడుతున్నాయి. అడవంతా భయంకరమైన నిశ్శబ్దంతో వింతగా అనిపిస్తోంది.

* * *

అకస్మాత్తుగా ఎవరో ఎదురుగా పరుగెత్తుకొస్తున్నట్టు పొడగట్టింది. ఎవరో మనిషి! ఆచ్ఛాదనలేని మనిషి. రెండు కాళ్ళమీదే పరుగెడుతున్నాడు గాబట్టి జంతువుకాదు.

నవీన్ విల్లు సర్దుకున్నాడు. బాణంతీసి చేత సిద్ధంగా పట్టుకున్నాడు. ఆ వ్యక్తి యెదురుతిరిగితే నిర్దాక్షిణ్యంగా బాణంతో కొట్టి చంపేయటానికి నిర్ణయించుకున్నాడు.

అయితే ఆ వ్యక్తి వెనకగా పరుగెత్తుకొస్తూన్న ఎలుగొడ్డును చూడగానే వాళ్ళకు పరిస్థితి అర్థమయిపోయింది. ఆ మనిషిని ఎలుగొడ్డు తరుముకొస్తోంది. ప్రాణభీతితో అతను పారిపోతున్నాడు.

ఆ వ్యక్తి దగ్గరయ్యేసరికి పరీక్షగా చూసి ఆశ్చర్య పోయారు నవీన్, సౌమ్య.

అతను మనిషి కాదు. చింపాంజీ!

మనిషి సంతతికి మూలంగా చెప్పబడే మనిషి కాని

మనిషి — చింపాంజీ. ప్రాణభయంతో గునగున పరుగెత్తు కొస్తోంది. ఎలుగుబంటి తరిమి తరిమి కొడుతోంది. దొరికితే చంపెయ్యటానికి సిద్ధంగా నోరు తెరచుకుని కోరలు బయటపెట్టుకొని పరుగెత్తుకొస్తోంది.

నవీన్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఎలుగు బంటిని గురిచూసి బాణం వదిలాడు. అది సూటిగాపోయి దాని డొక్కలో దిగబడింది. బాధగా గుర్రుమన్నది ఎలుగు. మరో బాణం వదిలాడు. అది దాని పొట్టను చీల్చేసింది.

ఎలుగ్గొడ్డు నేలమీద పడిపోయి టపటప కొట్టుకున్నది కాసేపు. ఆ తర్వాత దాని శరీరంలో చలనాలు ఆగి పోయాయి.

చింపాంజీ నవీన్ దగ్గరకొచ్చి కృతజ్ఞతను వ్యక్త పరుస్తున్నట్టుగా అతని పాదాలని తాకింది. అతన్ని తాకుతూ చుట్టూ తిరిగింది. చేతులు చాస్తూ గునగున తిరిగింది.

నవీన్, సౌమ్య అచ్చం మనిషిలాగే ప్రవర్తిస్తున్న ఆ చింపాంజీవైపు చిరునవ్వుతో చూశారు.

నవీన్, సౌమ్య ముందుకు అడుగులు వేశారు. చింపాంజీ వాళ్ళ పక్కనే నడవసాగింది. వాళ్ళు ఆశ్చర్యంగా నిల్చిపోతే తనూ నిల్చుండిపోయింది. వాళ్ళు కదిలితే వాళ్ళతో బాటు తనూ ముందుకి కదిలింది. వాళ్ళకి దాని ఆంతర్యం అర్థమయ్యింది. అది తమతోనే రావాలని కోరుకుంటోంది.

నవీన్ సౌమ్య వంక భావయుక్తంగా చూశాడు. "పోనీయ్ నవీ, మనకి సాయంగా వుంటుంది. ఈ

అడవిలో దొరికిన నేస్తం!" అన్నది సౌమ్య దానివంక చిరునవ్వుతో చూస్తూ.

మనిషికి కూడా లేని కృతజ్ఞత చూపుతున్న నోరులేని ఆ జీవివంక ఆప్యాయంగా చూశాడు నవీన్.

ఇద్దరు ముందుకి అడుగులు వేస్తుంటే, వాళ్ళ పరసన యెంతో తెలిసిన స్నేహితుడిలాగా చింపాంజీ నడవ సాగింది.

* * *

కొంతదూరం ముగ్గురు అలా నడిచాక చింపాంజీ దారి నుంచి చీలిపోయిన ఓ సన్నటి బాటవైపు దారితీసింది.

నవీన్, సౌమ్య ఆగి దానివంక చూశారు. చింపాంజీ చేయెత్తి రమ్మన్నట్టు పిలిచింది. ఆశ్చర్యంగా దాన్ని సమీపించారు. చింపాంజీ ముందుకు దారితీసింది. వాళ్ళు అనుసరించారు. నిర్జనారణ్యంలో దారిచూపుతున్న గైడులా ముందు చింపాంజీ, వెనుక వాళ్ళిద్దరు దాదాపు అరగంట నడిచారు.

నవీన్ కి దూరంగా ఏదో వెంకటిల్లులాంటి కట్టడం కనిపించింది. సౌమ్యకి చూపించాడు. ఆమెకూడా ఆశ్చర్యంగా ఆ కట్టడంవైపు చూసింది.

"బహుశా ఫారెస్టు రేంజర్ గాని, మరెవరైనా అటవీ అధికారిగాని వుండే నివాసమేమో! చింపాంజీ మన మనసు తెలిసినదానిలాగా మనుషులుండే ప్రాంతానికి తీసుకువెళ్తున్నట్టుంది" అన్నాడు నవీన్. సౌమ్య తలూపింది.

పదినిమిషాల తర్వాత వెంకలతో కట్టిన చిన్న ఇంటిని చేరారు. చుట్టూ గోడబదులు అద్దంతో కట్టబడిన ఆ ఇల్లు

గ్లాస్ హౌస్‌లాగా వుంది. నేలకి అయిదడుగుల ఎత్తులో కట్టబడి వున్నది ఆ యిల్లు. చుట్టూ అడుగు వెడల్పులో గట్టుంది. ఎక్కడానికి మెట్లు లేవు.

ఆశ్చర్యంగా వాళ్ళు ఆ యింటిని సమీపించారు.

ఇంతలో "ఫ్రెండ్సా!" అన్న స్వరం చాలా బిగ్గరగా, కర్కశంగా వినిపించింది.

నవీన్, సౌమ్య దిగ్భ్రాంతితో అటు చూశారు. అద్దాల యింటిలోనుంచి తుపాకీ బారెల్ బయటకి పొడుచుకు వచ్చింది.

అప్రయత్నంగానే నవీన్, సౌమ్య చేతులు పైకెత్తి నిల్చున్నారు. చింపాంజీ విస్తుపోయినట్టు చూస్తోంది.

"హూ ఆర్యూ?" అని మళ్ళీ వినిపించింది.

నవీన్, సౌమ్య ఏం చెప్పాలా అని డైలమాలో పడ్డారు.

మళ్ళీ గద్దించి అడిగిందా స్వరం.

"ఉయ్యార్ ఫ్రెండ్స్. నాట్ ఎనిమీస్" అన్నాడు నవీన్ సరళంగా.

అద్దాల తలుపులు తెరుచుకున్నాయి. ఆజానుబాహు డైన వ్యక్తి బయటకొచ్చాడు. అడుగు వెడల్పు వున్న గట్టుమీదనే నించుని తీక్షణంగా నవీన్, సౌమ్యలవంక చూశాడు.

నవీన్, సౌమ్య అతని ముఖంలోకి ధైర్యంగా చూశారు.

అతనికి దాదాపు ఏడైి ఏళ్ళుంటాయి. జుట్టు అక్కడక్కడ నెరిసింది. పెద్ద బుగ్గమీసాలున్నాయి. నల్లగా పోతపోసిన కంచువిగ్రహంలా వున్నాడు.

వేటగాళ్ళు వేసుకునే దుస్తులు ధరించాడు. కాళ్ళ మిలటరీ బూట్లున్నాయి. నోట్లో సైపు వెలుగుతోంది. అతను రెండు చేతుల్లోను రైఫిల్ని ఫర్మ్గా పట్టుకొని సరాసరి వాళ్ళిద్దరికి గురిచేసి నించున్నాడు.

"మీరెవరు? ఎందుకొచ్చారు?" ఆంగ్లంలోనే మళ్ళీ అడిగాడతను.

అతనితో నిజం చెప్పాలా వద్దా అని తటపటా యించాడు నవీన్. అతను చూడగా వేటకోసం వచ్చిన మిలిటరీ మేజరో, వాలంటీరో అన్నట్టున్నాడు. కాని బందిపోట్లు ఆ పరిసరాల్లోనే నివసిస్తున్నారు. వాళ్ళ తాలూకు నాయకుడుకూడా కావచ్చును. వాళ్ళు దోచు కున్న సొమ్ము అక్కడ దాచుకుంటున్నారేమో! నాయ కుడు దానికి కాపలా వున్నాడేమో! నోరు జారితే ప్రమాదం!

"సర్, మేమిద్దరం సైన్సు విద్యార్థులం. పోస్టు గ్రాడ్యు యేషన్ చేసి రిసెర్చి చేస్తున్నాం. అడవిలో నారికే ళమూలికల గురించి పరిశోధించటానికి మా ప్రొఫెసర్తో బాటు పదిహేనుమంది విద్యార్థులం వేన్లో వచ్చాం. వాళ్ళు వేర్వేరు స్పాట్స్లో కలెక్షన్స్ చేస్తుండగా మేం దూరమయిపోయాం. వేన్ ఎప్పుడు వెళ్ళిపోయిందో, ఎటు వెళ్ళిందో తెలియక వెతుక్కుంటూ యిటువచ్చాం. మీకుగాని మా వేన్ కనిపిస్తే చెప్పి పుణ్యం కట్టు కోండి!" అన్నాడు నవీన్ యే మాత్రం అనుమానం రాని విధంగా.

"ఐ.సీ. యూఆర్ ఫ్రం విచ్ యూనివర్సిటీ?" అడిగా డతను.

"కాకతీయ యూనివర్శిటీ వరంగల్."

"అంత దూరంనించి మీరీ కీకారణ్యంలోకి యెందుకొచ్చారు? యూ నో, యీ అడవినిండా ఎన్నో క్రూర మృగాలున్నాయి. మానవమాత్రుడెవరూ యీ అడవిలో అరగంటకూడా గడపలేదు. మీ ప్రొఫెసర్ల ధైర్యానికి మెచ్చుకోవాలి!"

"రిసెర్చికోసం కదండీ, అందుకని యెవరూ ఎప్పుడూ చెయ్యని సబ్జెక్టుమీద కొత్తరకం పరిశోధనలు చెయ్యాలని వచ్చాం."

"వెరీ గ్లాడ్ టు మీట్ యూ!.... బైదిబై నా పేరు వీరేంద్ర. మాది బల్లార్షా. నేను మిలిటరీ సర్వీస్ చేసి మేజర్‌గా విరమించుకుని వచ్చేశాను. నేను తరచూ యీ అడవికి హంటింగ్‌కి వస్తూంటాను. నా కోసం ప్రత్యేకంగా యీ గ్లాస్ హౌస్ నేనే స్వయంగా నిర్మించుకున్నాను. రెండుమూడు రోజులు హంటింగ్ చేసి వెళ్ళిపోతుంటాను" అన్నాడు ఆ వ్యక్తి—వీరేంద్ర.

సంభాషణ ఆంగ్లంలోనే సాగుతోంది. అతను మహారాష్ట్రుడు. తెలుగు రాదు. వాళ్ళకు మరాఠీ తెలియదు. ఉభయులకీ అర్థమయ్యే ఆంగ్లభాష అలా ఉపయోగపడింది.

"మీరు ఒక్కరే యీ యింట్లో వుంటారా?"

"అవును. ఈ హౌస్ నేను స్వయంగా కట్టుకున్నానంటే మీరు నమ్ముతారా?"

"మిమ్మల్ని చూస్తే అంత సమర్థులేననిపిస్తోంది."

"థాంక్యూ!" వీరేంద్ర మొహం నిండా ఉత్సాహం.

"కమాన్, మీరు నా అతిథులు. లోపలికి రండి,

వివరంగా మాట్లాడుకుందాం" అంటూ ఓ చెక్క మెట్లున్న నిచ్చెనను లోపల్నుంచి తెచ్చి గట్టునించి కిందకి తాకేలా అమర్చాడు వీరేంద్ర.

మెట్లమీదుగా ముగ్గురు పైకి ఎక్కారు.

"వాట్, యీ చింపాంజీ మీ కెక్కడ దొరికింది?" అడిగాడు ఆశ్చర్యంగా వీరేంద్ర.

"కొద్ది సేపటి క్రితమే మాకు పరిచయమయింది. ఈ చింపాంజీయే మీ స్థావరానికి మమ్మల్ని వెంటబెట్టుకొచ్చింది."

"మీ చేతిలో యీ విల్లులేమిటి? కొంపదీసి మీరు కూడా హంటర్ కాదుగదా!"

"అబ్బే, అదేం కాదండి! ఏదయినా ప్రమాదం యెదురైతే ఉపయోగించటానికి మా స్టూడెంట్సందరికీ యీ బౌ, ఏరోస్ యిచ్చారు మా ప్రొఫెసర్!"

"ఐ.సీ. మీ ప్రొఫెసర్ బాగా ముందు చూపున్న మనిషిలా వున్నారు. మరి మిమ్మల్ని ఒంటరిగా వదిలి ఎలా వెళ్ళిపోయారో....?! నా అభిప్రాయం ఏమిటంటే మీ ఫ్రెండ్స్ యిక్కడే చుట్టుపట్ల మీకోసం వెతుక్కుంటూ వుంటారు .... మీరిక్కడ రెస్టు తీసుకోండి. నేను జీప్‌లో వెళ్ళి వెతికి వస్తాను."

"జీప్‌లోనా? జీప్ ఎక్కడా కనిపించదేం?"

వీరేంద్ర దూరంగా చెట్ల గుబురులమధ్య ఆకులు అలములతో కప్పి వున్న తన జీప్‌ని చూపించి, "సురక్షితంగా వుండటంకోసం కప్పి పెట్టాను" అన్నాడు.

గ్లాస్ హౌస్ లోపల రెండు ఫోల్డింగ్ ఛైర్స్, ఓ పొడవు బల్ల, దానిమీద కిరోసిన్, స్టౌవ్ వంటసామగ్రి

వున్నాయి. స్టౌమీద యేదో ఉడుకుతోంది.

"ఈ రెండు మూడురోజుల కేంప్ లో నేను నా ఆహారం తయారుచేసుకోవటానికి వెంట తెచ్చుకున్నాను. సాధారణంగా చెవులపిల్లులు, పిట్టలు వేటాడి ఆహారం వండుకుంటాను. మీరెప్పుడైనా రుచి చూశారో లేదో కవుజుపిట్ట మాంసం చాలా రుచి. అలాగే చెవులపిల్లి మాంసంకూడా" అన్నాడు వీరేంద్ర.

స్టవ్ మీద ఎదో పదార్థం కుతకుత వుడుకుతోంది. వీరేంద్ర పాత్ర మూత తీసి కారం, ఉప్పువేసి నీళ్ళు పోశాడు.

"మంచినీళ్ళు తాగుతారా?" అన్నాడు కేన్ లో నుంచి ప్లాస్టిక్ గ్లాసుల్లో ఒంచి నీళ్ళు వంచి యిస్తూ.

ఒక్కొక్కరు నాలుగు గ్లాసుల నీళ్ళు తాగాక గాని దాహం ఉపశమించలేదు.

వీరేంద్ర వంట చెయ్యటంలో సిద్ధహస్తుడిలాగా వున్నాడు. చాలా రుచికరంగా వండుతున్నాడు.

"మీరు శాఖాహారులా, మాంసాహారులా? అడగటం మరిచిపోయాను" అన్నాడు వీరేంద్ర.

మాంసాహారుల మేనని చెప్పాక సంతృప్తిగా తలాడించాడు.

అంతసేపు సౌమ్య వాళ్ళ సంభాషణలో భాగం పంచుకోకుండా కేవలం శ్రోతలాగే వుండిపోయింది.

వీరేంద్ర మసాలాపొడి వేసి కూరని దించి రొట్టెలు చేయటానికి వుపక్రమించాడు.

మొదటిసారిగా సౌమ్య పెదవి విప్పి, "మీరు అలా కూర్చోండి. రొట్టెలు నే ఒత్తుతాను" అన్నది.

వీరేంద్ర నమ్రతగా నవ్వి "మరేం ఫరవాలేదు. ఈ

పూటకి మీరు నా గెస్టు. అన్నీ స్వయంగా నా చేతుల మీదుగానే జరగనివ్వండి!" అన్నాడు.

అతని మర్యాదలకు పరవశించిపోయారు నవీన్, సౌమ్య. అతనితో అబద్ధం ఎందుకు చెప్పానా అని లోలోపల మధనపడుతున్నాడు నవీన్. నిజం చెప్పేస్తే అతడు తమని సురక్షితంగా అడవి బయటకు చేర్చుతాడు. ఏదో ఒక రైల్వేస్టేషన్లోనో బజారాల్లోనో వదిలేస్తే, క్షేమంగా ఇళ్ళకు పోవచ్చు. ఇందాకా అబద్ధం చెప్పి ఇప్పుడు నిజం చెప్పినా అతడు నమ్మకపోతే....!? అబద్ధం చెప్పినందుకు ఆగ్రహిస్తే....!?

అసలే మిలిటరీ మనిషి, కోపంలో షూట్ చేసినా ఆశ్చర్యంలేదు. నెమ్మదిమీద అతని మూడ్ కనిపెట్టి మాట్లాడాలి! అతను వేన్ వెతకటానికి వెళ్ళి తిరిగొస్తాడు. వేన్ యెలాగూ లేదు కాబట్టి అతనికి అనుమానం రాకుండా, వేన్ వెళ్ళిపోయింది కాబట్టి తమని అడవి దాటించమని అడగొచ్చు.

ఫరవాలేదు, వీరేంద్ర పెద్దమనిషి. మంచి మర్యాద తెలిసిన వ్యక్తి. తమ కష్టాలు గట్టెక్కాయి. తమకి దారి చూపిన చింపాంజీ ఋణం ఎలా తీర్చుకోగలరు?

"ఇదుగో, భోంచెయ్యండి!" పేపర్ ప్లేట్స్లో రొట్టెలు, పైన మాంసం వేసి వాళ్ళ ముందు పెట్టాడు వీరేంద్ర.

నవీన్ రొట్టె తుంచి నోట పెట్టుకోబోతూ ఆగి చింపాంజీవంక చూశాడు. చింపాంజీ అతని భావం అర్థమయినదానిలాగా బయటకి వెళ్ళి పదినిమిషాల్లో యేవో దుంపలు, కాయలు తెచ్చుకుని వచ్చింది.

మనిషిలాగే తెలివిగా అది ప్రవర్తించిన తీరు వాళ్ళకి

ముచ్చట కలగ చేసింది.

నవీన్ ప్రేమగా చింపాంజీ వీపు నిమిరాడు.

భోజనాలయిన వెంటనే వీరేంద్ర తుపాకీ చేతి పట్టుకుని లేచి, "మీ జీన్ ఎక్కడుందో వెతికి వస్తాను. ఇప్పుడప్పుడే మూడు గంటలు కావస్తోంది. ఈ అడవిలో మరో గంటలో చీకటి పడిపోతుంది. ఓ అరగంటలో నే తిరిగొస్తాను" అన్నాడు.

తన మాటల్ని నమ్మి జీప్‌ని నిజంగానే వెతకటానికి వెళ్తున్న వీరేంద్రకి నిజం చెప్పి ఆపు చేద్దామా అన్న ఆలోచనను బలవంతాన అణచుకున్నాడు నవీన్. మిలిటరీ వాళ్ళతో జాగ్రత్తగా వ్యవహరించాలి!

"మీకు చాలా శ్రమ ఇస్తున్నాం!" అన్నాడు నవీన్ వీరేంద్రవంక కృతజ్ఞతగా చూస్తూ.

వీరేంద్ర నవ్వి వెళ్ళిపోయాడు.

ఆ వెనువెంటనే జీపు స్టార్టయిన శబ్దం వినిపించింది.

కడుపునిండా తినగానే కళ్ళకు నిద్ర ముంచుకు వచ్చింది. వీరేంద్ర కేంప్ కాట్ నేలమీదుంది.

"అలా నడుం వాల్చు సౌమ్యా! బాగా అలసి పోయావు" అన్నాడు నవీన్.

"నువ్వు మాత్రం అలసిపోలేదా? నువ్వూ నడుం వాల్చు!" అన్నది సౌమ్య అతని కళ్ళలోకి ప్రేమగా చూస్తూ.

"భగవంతుడి దయవల్ల మనకి మనిషి తోడు దొరికింది. వీరేంద్ర మనల్ని సురక్షితంగా అడవి నుంచి బయటకు చేరుస్తాడు."

"అతను నువ్వు చెప్పిన కథ నమ్మేసినట్టుంది. పాపం, బోళా శంకరుడిలాగా వున్నాడు."

"అందుకే మనకి ఆశ్రయ మిచ్చాడు. కమ్మటి భోజనం పెట్టాడు—ఎలాగైనా మిలిటరీవాళ్ళు దయగా వుంటారు."

"దయగా వుంటే శత్రువుల్ని నగ్నంగా చూచగా యెలా చంపుతారు? వాళ్ళలో వుండేది దయకాదు! క్రమశిక్షణ, పాలెట్ సెన్. ప్రాణాలకు తెగించిన మొండి ధైర్యం!"

"కరెక్టు. నీతో వాదించి గెలవలేను."

"ఆడపిల్లలకు అంత తొందరగా సరెండర్ అయి పోకూడదు—"

"నీలాంటి ఆత్మీయురాలైన ఆడపిల్లకి సరెండర్ అయి పోవటంలోనే ఆనందముంది."

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

"పాపం, వీరేంద్రకి అబద్ధం చెప్పి మోసం చేశామేమో!"

"అదేం లేదు. నువ్వు వ్యవహరించిన తీరు కరెక్టే! అతనెవరో, ఎలాంటివాడో తెలియకుండా నిజం చెప్పటం మంచిది కాదు."

"మనని ఓ దారికి చేర్చిన యీ చింపాంజీకి యేమిచ్చి రుణం తీర్చుకోగలం?" ప్రేమగా చింపాంజీ వంక చూశాడు. చింపాంజీ నిశ్చింతగా నిద్రపోతోంది.

"తన ప్రాణం కాపాడినందుకు అదే మన రుణం తీర్చుకుంటోందని అనుకోవాలి!"

ఇద్దరూ నడుం వాల్చారు. నిద్ర ముంచుకువస్తోంది.

ఇంతలో జీపు శబ్దం వినిపించింది. ఇద్దరూ లేచి కూచున్నారు.

వీరేంద్ర లోనికొచ్చాడు. "సారీ ఫ్రెండ్స్! మీ వేన్ ఎక్కడా కనిపించలేదు. బహుశా మీ కోసం వెతికి

కొతికి మరలిపోయి వుంటారు” అన్నాడు.

నవీన్, సౌమ్య విచారంగా చూశా రతనికేసి.

“డోంట్ వర్రీ. మిమ్మల్ని బలాత్కారంగా చేరుస్తాను. చాలా?” అన్నాడు వీరేంద్ర దయగా నవ్వుతూ.

నవీన్ కృతజ్ఞతగా చూశాడు. “అంతకన్న కావలసిం దేముంది సర్!? అక్కడ్నుంచి వరంగల్ ట్రెయిన్‌లో వెళ్ళిపోతాం” అన్నాడు.

“అయితే, మీరు తెల్లవారేవరకు ఆగాలి! ఈ రాత్రికి హంటింగ్‌కి ప్లాన్ చేసుకున్నాను. పులిని వేటాడబోతు తున్నాను. ఇప్పుడు ఆల్‌మోస్టు చీకటి పడిపోయినట్టే! రాత్రికి యేదో యింత తిని శుభ్రంగా నిద్రపోండి. నేను హంటింగ్‌కి వెళ్ళి యే అర్ధరాత్రికో తిరిగొస్తాను. మీరు కూడా వస్తానంటే సంతోషంగా తీసుకెళ్తాను.”

“వద్దు వద్దు! మేము బాగా టైరయిపోయాం. మీరు వేటాడి రండి.”

“అలాగే. తెల్లవారగానే బయలుదేరుదాం. మీరు యిక్కడ కష్టంగా లేదు కదా!”

“అబ్బే, అదేం లేదండి ..ఇది అడవి కదా, ఫారెస్టు రేంజి ఆఫీసు, క్వార్టర్సు యేమీ కనిపించకపోవటానికి కారణమేమిటి?” నవీన్ అడిగాడు.

“ఇది అడవిలో బాగా మారుమూల ప్రదేశం! ఇక్కడికి మానవమాత్రుడు—చివరికి ఫారెస్టు డిపార్టు మెంటువాళ్ళు కూడా ప్రవేశించలేరు. ఫారెస్టు రేంజర్ క్వార్టర్స్ యిక్కడికి అయిదారు మైళ్ళ దూరంలో. అడవి ఎంట్రెన్స్‌లో వున్నాయి. నేనిక్కడికి హంటింగ్ కొస్తానని వాళ్ళకు తెలుసు. నేనిక్కడ డిపార్టుమెంటు పర్మిషన్ లేకుండా నే యీ గ్లాస్ హౌస్ కట్టుకున్నాను.

జస్ట్ అండర్ స్టాండింగ్, అంతే!"

ఆ తర్వాత సంభాషణ అనేక విషయాల మీదికి మళ్ళింది. అతనికి యే మాత్రం అనుమానం రానివ్వకుండా జాగ్రత్తగా సమాధానాలు చెప్పాడు నవీన్. సౌమ్య కూడా బెరుకు వదలి సంభాషణలో ఉత్సాహంగా పాల్గొన్నది.

రాత్రి భోజనాలయ్యాక బీరేంద్ర నడుము చుట్టూ బుల్లెట్సున్న బెల్టు తగిలించుకుని, గన్ చేతపట్టుకుని హంటింగ్ కి తయారయ్యాడు.

"డియర్ ఫ్రెండ్స్! నేను అర్ధరాత్రి ఎప్పుడో వస్తాను. తలుపు బయట లాక్ చేసుకొని వెళ్తాను. మీకేమైనా అభ్యంతరమా? మంచి నిద్రలో వుంటారేమో, లేపటం యిష్టంలేక యీ యేర్పాటు చేస్తున్నా" అన్నాడు బీరేంద్ర నవ్వుతూ.

"మీరు ఎలా చేసినా అభ్యంతరమేముంది? మా శ్రేయోభిలాషి మీరు!" అన్నాడు నవీన్.

బీరేంద్ర నవ్వుతూ వెళ్ళిపోయాడు. వెంట టార్చి లైటు, సిగార్ లైటర్, సెగడు చెయ్యటానికి చిన్న సీసాలో కిరోసిన్ తీసుకుని వెళ్ళాడు.

బీరేంద్ర వెళ్ళిన పదినిమిషాల తర్వాత నవీన్ సౌమ్యాని దగ్గరకు తీసుకుని "మన కష్టాలు గట్టెక్కాయి. ఈ రాత్రి యెలాగో గడిపేస్తే తెల్లారి మనం అడవి దాటి పోవచ్చు" అన్నాడు.

సౌమ్య అతన్ని విడిపించుకుని దూరంగా జరుగుతూ, చంపా జీవంక చూపించింది. చింపాంజీ గదిలో ఓ మూలగా కూచుని వీరివంకే చూస్తోంది.

"ఈ చింపాంజీని మనతో బాటు తీసుకుపోదామా?"

అన్నాడు నవీన్.

"వీరేంద్ర నడిగి అతను చెప్పినట్టు చేద్దాం. ఫారెస్టు ప్రాపర్టీ బయటకు తరలించకూడదేమో కదా!"

"కరెక్ట్, అలాగే చేద్దాం. నాకు నిద్ర వస్తోంది"

కబుర్లలో అలాగే నిద్రకు పడిపోయారిద్దరూ.

* * *

గ్లాస్ హావుస్ చీకటిగా వుంది.

సౌమ్య కెందుకో అకస్మాత్తుగా మెలకువ వచ్చింది.

తనమీదకు వంగిన ఆకారంవైపు పరీక్షగా చూసి చిన్నగా కేక పెట్టింది.

మొదట నవీన్ అనుకుని మృదువుగా మందలించబోయింది. కాని అతను నవీన్ కాదు.

మేజర్ వీరేంద్ర!

నిర్ఘాంతపోయింది సౌమ్య. నిజాన్ని జీర్ణం చేసుకోవటానికి ఆమెకు కొద్దిక్షణాలు పట్టింది. అతనిదగ్గర ఖరీదైన బ్రాందీ వాసన వేస్తోంది.

సౌమ్య ఉక్కిరి బిక్కిరై పోయింది.

కవ్వున అరిచింది సౌమ్య.

వీరేంద్ర, ముందు కొంచెం జంకినా మళ్ళీ వెంటనే ఆమెమీదికి లంఘించి ఆమెను ఆక్రమించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

సౌమ్య బ్లౌజు హుక్స్ ఎప్పుడో వూడిపోయాయి. బ్రా హుక్ కూడా వూడిపోయి వుంది. ఆమె చీర స్థాన భ్రంశం చెందివున్నది. బాగా అలసిపోయి గాఢంగా నిద్రపోవటంవల్ల ఆమెకు వెంటనే మెలకువ రాలేదు. ఈ లోపల అవకాశాన్ని వినియోగించుకున్నాడు వీరేంద్ర.

తన కంఠంలో ప్రాణముండగా అతనికి లొంగ

కూడదు. అదీ ఆమె దృఢనిశ్చయం!

ఆమె అతనితో పెనుగులాడుతూనే కేకలు పెడు తోంది. ఓ పక్క ఆమె నోరు నొక్కిపడుతూ మరోపక్క ఆమెను తన స్వాధీనంలోకి తెచ్చుకోవటానికి తీవ్రంగా ప్రయత్నిస్తూన్నాడు వీరేంద్ర. అతని పశుబలం ముందు ఆమె ప్రతిఘటన నీరుకారిపోతోంది.

ఇంతకీ, యింత జరుగుతున్నా నవీన్ ఏమైనట్టు? కొంప తీసి వీరేంద్ర అతన్ని ....!?

ఆ ఆలోచన రాగానే చిగురాకులా వణికిపోయింది. నిస్సహాయంగా కేక పెట్టింది. గ్లాస్‌హౌస్‌లో ఆమె గొంతు ప్రతిధ్వనించింది.

చటుక్కున మెలకువ వచ్చింది నవీన్‌కి. కొద్దిక్షణాల వరకు తనెక్కడున్నాడో, యేం జరుగుతున్నదో అతనికి వెంటనే అవగాహన కాలేదు. అంతా చీకటిగా అగమ్య గోచరంగా వున్నది. ఈలోపల మరోసారి సౌమ్య కేక ప్రతిధ్వనించింది.

ఒక్క ఉదుటున్న లేవబోయాడు. కాని అతని కాళ్ళు చేతులు వెనక్కి కట్టబడివున్నాయని, తన నెవరో బంధిం చారని గ్రహించేసరికి, జరిగిందేమిటో, ఒక్కొక్కటి గ్రహింపుకొచ్చాయి.

తనని బంధించి సౌమ్యమీద అఘాయిత్యం చేస్తున్నా రెవరో!....ఎవరు? వీరేంద్ర యేమయ్యాడు? కళ్ళు చికి లించి చూశాడు. అతని కళ్ళు చీకటికి అలవాటుపడ్డాయి. వీరేంద్ర అత్యాచారాన్ని, ప్రతిఘటిస్తున్న సౌమ్యని స్పష్టంగా చూశాడు.

కాని....తను నిస్సహాయుడు! తనని ముందు జాగ్రత్త కోసం బంధించి మరీ తన పాశవిక కోరికను తీర్చుకో

బోతున్నాడు బీరేంద్ర. ఎంతో మంచివాడిలా, శ్రేయోభిలాషిలా నటించి, ఆశ్రయమిచ్చి తన సౌమ్యమీద అత్యాచారానికి తలపడ్డాడు. ఎంతటి నయవంచకుడు!

ఈ లోపల బీరేంద్ర సౌమ్యని తన వశంలోకి తెచ్చుకోవటంలో విజయం సాధించాడు. మరికొద్ది క్షణాల్లో ఆమె కన్యత్వం మంటకలిసి పోయివుండేదే! కాని, సరిగ్గా అప్పుడే ఓ అద్భుతం జరిగిపోయింది.

ఓ మూలగా నిద్రిస్తూన్న చింపాంజీ ఒక్కసారిగా బీరేంద్రమీద దాడి చేసింది. నవీన్ విషయంలో జాగ్రత్త తీసుకున్న బీరేంద్ర చింపాంజీ విషయంలో అశ్రద్ధ చేశాడు. అదే అతను చేసిన పెద్ద పొరపాటు.

బీరేంద్ర చింపాంజీ ధాటినుంచి తనను తను రక్షించుకునే ప్రయత్నంలో సౌమ్యని వదిలి, చింపాంజీమీద తిరగబడ్డాడు. దూరంగా వున్న తుపాకీవైపు దొర్లబోయాడు. కాని చింపాంజీ అతనికా అవకాశం యివ్వలేదు. అతన్ని అంగుళం కూడా అటు కదలనివ్వలేదు.

ఈ అవకాశాన్ని సౌమ్య బాగా వుపయోగించుకున్నది. ఒక్క అంగలో వెళ్ళి నవీన్ కట్లు విప్పేసింది.

అయితే యింతలోనే చింపాంజీ గుండెలమీద చాచి తన్ని ఒక్క వుదుటున్న గన్ వున్న చోటికి గెంతి గన్ అందుకున్నాడు బీరేంద్ర. ముందుగా చింపాంజీ మీదికి కాల్చబోయాడు.

మెరుపులా అతన్ని వెనుకనుంచి వాటేసుకున్నాడు నవీన్. గుండు గురితప్పి అద్దాన్ని బద్దలు చేసుకుంటూ బయటకు దూసుకుపోయింది. ఈసారి సౌమ్యను కాల్చాలనుకున్నాడు బీరేంద్ర.

అయితే చింపాంజీ యెగిరి అతని చేతిలోని గన్ను

యొగరగొట్టేసింది. మరుక్షణం గన్ నవీన్ చేతుల్లోకి వచ్చే
సింది.

నవీన్ ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా వీరేంద్రని
కాల్చేశాడు. వీరేంద్ర అమాంతం విరుచుకుపడిపోయాడు.
అతి దగ్గర్నుంచి అతని ఛాతీకి గురిచేయబడ్డ గుండు అతని
గుండెల్లో చిక్కుకుంది. అయినా ప్రాణంపోలేదు. కూరలు
తరుక్కునే కత్తిని దొరకపుచ్చుకొని నవీన్ మీదికి విసర
బోయాడు. మరోసారి అతని ప్రయత్నాన్ని వమ్ము చేసింది
చింపాంజీ.

ఈలోపల గన్ లోడ్ చేసుకుని వరసగా రెండుసార్లు
కాల్చాడు నవీన్.

వీరేంద్ర శ్వాస శాశ్వతంగా ఆగిపోయింది.

సౌమ్య సుడిగాలిలా వచ్చి నవీన్‌ని అల్లుకుపోయింది.
ఆమె బాగా భయపడిపోయింది. క్రూరమృగాలకు కూడా
చలించని ఆమె ఈ సంఘటనతో బెదిరిపోయింది.

చిగురుటాకులా వణుకుతున్న సౌమ్య వెన్ను ఆప్యా
యంగా నిమిరాడు నవీన్. చల్లగాలి సోకిన మేఘంలా
భోరున ఏడ్చేసింది సౌమ్య.

“వాడు చచ్చాడు, నీకేం భయంలేదు. ఊరుకో!”
అన్నాడు నవీన్ క్రిదార్ఢ్యగా.

కొంతసేపటికి సౌమ్య మామూలు మనిషయింది.
“వీడింత మేకవన్నె పులి అనుకోలేదు. ఎంతో మర్యా
దస్తుడిలాగా పెద్దమనిషిలాగా నటించాడు. మోస
పోయాం” అన్నది.

చింపాంజీని ఆప్యాయంగా నిమిరింది సౌమ్య. తను
మలిన పడకుండా కాపాడింది చింపాంజీ. ఏమిచ్చి
ఋణం తీర్చుకోగలదు? నవీన్ దాని ప్రాణం కాపాడి

నందుకు అది తన మానప్రాణాలను కాపాడింది. ఎంత కృతజ్ఞత!

నవీన్ అప్పటికప్పుడే ఓ నిర్ణయానికి వచ్చాడు. బీరేంద్ర గన్ మళ్ళీ లోడ్ చేశాడు. బీరేంద్ర ఓ పక్కగా దాచిపెట్టిన బుల్లెట్స్ బెల్టుని నడుం చుట్టూ కట్టుకున్నాడు.

"మనం వెంటనే వీడి జీపులో అడవి దాటిపోదాం. నాకు డ్రయివింగ్ వచ్చు" అన్నాడు నవీన్. బీరేంద్ర దుస్తులు తడిమి జీపు తాళాలు తీసుకున్నాడు.

ఇద్దరూ గ్లాస్ హావుస్ నుంచి బయటికొచ్చారు. వాళ్ళని అనుసరించింది.

అప్పుడు రాత్రి రెండుగంటలు కావస్తోంది.

• • •

జీపుని కప్పిపెట్టిన ఆకులలములు తొలిగించారు ఇద్దరు కలిసి.

అది ఓ పెన్ టాప్ జీపు. కేవలం యిలాంటి చోట హంటింగ్ కోసం ఉద్దేశింపబడిన జీపు. అవసరమైతే టాప్ వేసుకోవటానికి వీలుగా సపోర్టింగ్ రాడ్స్ పైనుంచి అర్ధచంద్రాకారంగా వున్నాయి.

ఇగ్నిషన్ కీ తిప్పగానే జీపు స్టార్టయింది. నవీన్ పక్కసీట్లో సౌమ్య కూచుంది. వెనక సీట్ లేకుండా ఖాళీగా వున్న జాగాలో చింపాంజీ కూచున్నది.

హెడ్ లైట్స్ వెలుగులో దారి చూసుకుంటూ మెల్లగా జీపుని ముందుకి పోనిచ్చాడు నవీన్.

దారి అంతా ఎగుడుదిగుడుగా వుంది. బీరేంద్ర యెలాగూ అడవి దాటిస్తాడనే గుడ్డినమ్మకంతో వున్న తను అడవి బయటికి దారి యెటుందో అడగలేదు. కాని అక్క

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకూ చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 78/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించనవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

డికి అయిదారు మైళ్ళ దూరంలో ఫారెస్టు రేంజర్ క్వార్టర్సున్నట్టు మాటల సందర్భంలో వీరేంద్ర చెప్పాడు. కాని అది యే డైరెక్షన్‌లో వుందో చెప్ప లేదు, తను అడగలేదు.

పోను పోను దారి యిరుకై పోయింది. జీపు సునాయాసంగా వెళ్ళగల దారి కాదు. వీరేంద్ర ఉపయోగించే దారి అదికాదు. ఎలా యిప్పుడు?

మరికొంత దూరం వెళ్ళేసరికి దారి పూర్తిగా కప్పబడి పోయింది. అన్నీ ముళ్ళకంపలు, పిచ్చి మొక్కలు, రాళ్ళు రప్పలుతో నిండిపోయి జీపు మరో గజం కూడా ముందుకు వెళ్ళలేని పరిస్థితి ఎదురయింది.

"బాడ్‌లక్! చేతిలో జీపు వుండికూడా తప్పించుకు పోలేకపోతున్నాం. బాక్ చేస్తున్నా" అంటూ జీపుని వెనక్కి త్రిప్పి వచ్చిన దారినే పోనిచ్చాడు నవీన్.

దారి పొడవునా యేవో జంతువులు అటు ఇటు పరుగెత్తడం హెడ్‌లైట్స్ వెలుగులో కనిపిస్తోన్నది. పాములయితే చెప్పటానికి వీల్లేనన్ని కనిపిస్తున్నాయి. రకరకాల సర్పాలు అటు యిటు పరుగెత్తుతున్నాయి మహా వేగంతో. కొన్ని జీపు కిందపడి నలిగిపోతున్నాయికూడా.

గ్లాసు హౌస్ యింకో ఫర్లాంగు మార్గముండగా దారి ఓ చోట చీలిపోయి కనిపించింది. జీపు ఆపాడు నవీన్. ఇందాకా తొందర్లో గమనించలేదు గాని, ఈ రెండో దారి కాస్త వెడల్పుగానే కనిపిస్తోంది.

జీపు అటు తిప్పాడు నవీన్. కొంత దూరంవరకూ ప్రయాణం సజావుగానే జరిగింది. కాని, అంతలోనే అనుకోని ఆవాంతరం వచ్చిపడింది.

ఒక్కసారిగా పది పది హేను కొండముచ్చులు జీప్

మీద దాడిచేశాయి. అంతదాకా చెట్లమీద వున్నట్టున్నాయి. టాప్ లేని జీప్ మీదకి టపటప దూకేశాయి.

సౌమ్య బెదిరిపోయింది వాటిని చూసి. నల్లటి ముఖాలతో, ఒళ్ళంతా బూడిద రంగు బొచ్చుతో, పళ్ళు యికిలిస్తూన్నట్టు కిచకిచమంటూ మీదకొచ్చేస్తున్నాయి. నోరు తెరిచి అలా మీదికొస్తున్న వాటి కోరలు చీకట్లోకూడా మెరుస్తున్నాయి.

నవీన్‌కి వాటి ఆంతర్యం అర్థమయ్యింది. ఈ అడవిలో సాధు జంతువు ఒక్కటైనా లేదు. అన్నీ మాంసాహారుల లాగే వున్నాయి.

"సౌమ్యా, కిందికి ఉరికెయ్యి, జీప్ స్లో చేస్తున్నాను...." అంటూ జీప్ వేగం తగ్గించి సౌమ్య కిందికి దిగిపోగానే బ్రేక్ వేసి ఆపేసి, కిందికి ఉరికాడు.

అప్పటికే అవి స్టీరింగ్ మీదకి దాడిచేశాయి. నవీన్ గన్‌తో రెండుసార్లు కాల్చగానే ఒక్కసారిగా అవి బెదిరిపోయి చెల్లాచెదురై పోయాయి. గుళ్ళు వ్యర్థం కాలేదు. నాలుగైదు కొండముచ్చుల్ని గాయపరిచాయి. ఈలోపల మరోసారి గన్ లోడ్ చేసుకుని కాల్చాడు.

కొండముచ్చుల్లో మరో రెండు నేలకూలిపోయాయి. ఎక్కడివక్కడ క్షణాల్లో మాయమయిపోయాయి.

చెట్టు పక్క నుంచి సౌమ్య బయటికొచ్చింది. ఆమె కూచున్నాక తిరిగి జీప్ స్టార్టు చేశాడు నవీన్.

సౌమ్య ముఖం గంభీరంగా వుంది. ఆమెకి ప్రమాదాలను ఎదుర్కొని ఎదుర్కొని వాటిపట్ల భయం, బెరుకు పోయాయి. ఇక ఎంతటి విపత్కర పరిస్థితుల్లోను కూడా భయపడకూడదని, ఆత్మవిశ్వాసం సడలించుకోకూడదని గట్టిగా నిర్ణయించుకున్నది. (సశేషం)

